# భారతి

సచిత్ర మాసపత్రిక

# BHARATHI

(A TELUGU MONTHLY)

సంపాదకుడు:
శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.
౧౯౪౦

సంపుటము ౧౭, సంచిక ౨

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (194! సం. ఫిబ్రవరినెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1940 సం మార్చి 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

H 24, 35. J 3, 5. S 24, 36, 39, 40, 42, 44, 50, 110, 125, 127, 128, 130. T 2. V 31. Y 2, W 2.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపెడే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనంకావాలి. మన ఉద్యమాలు, మన దేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసిదని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.



చంద్రికా శోభ

చిత్రకారుడు :
కె. ఆర్. శర్మ.




సంపుటం. ౧౭ ప్రమాది, మాఘమాసము (ఫిబ్రవరి 1940) సంఖ్య. ౨

# వెలుఁగు గడప

శ్రీ విశ్వనాథ సత్యనారాయణ

అవుర! ఓ నాప్రభూ! వచ్చినట్లె వచ్చి
నే గడపదాఁక నరుదెంచు నిన్నుఁ జూచు
విధృతి వృథయుగా మొగము తప్పించినావు;
అవుర! ఓ నాప్రభూ! వచ్చినట్లె వచ్చి.

పొరపడితి నందువా! నీదుపొడయు నెఱుఁగ;
వేసికొన్న వత్తులుగాఁగ వేచికొనెడు
నా కనులు నమ్మరా దందువా? కడింది
వెలుఁగు నాముంగిటను గిలాబులు రచింప.

నీవుగాని రాకున్నచో నిభృతము లగు
జిలుగుసౌదామనీసరస్సుల వెలుఁగుల
సర్వవస్తుచ్ఛవుల్ పరాస్త మగునట్టి
నడక గల జిల్గు లొత్తునా నాగడపకు?

---

# ఉదాత్తసాహిత్యము

శ్రీ కొండూరు వీరరాఘవాచార్యులు

ఉదాత్తగుణశోభితమైన సాహిత్యమును శారద చంద్రుని ఆలోకముతోఁ బోల్పవచ్చును. వర్షాకాలపు దుర్దినము లనుగమించి షోడశకళాప్రపూర్ణుడై వెలుఁగు చందమామ స్నిగ్ధంపుఁ బండువెన్నెలలలో అమృతబిందువులు తొనఁకులాడుచుండును. కారుఁ జీఁకట్ల బోరలి కన్నులు పూడ్చుకొనిన లోక మీదివ్యాలోకములో అఖండానందచంద్రరసమును ఆత్మతృప్తిగాఁ జూఱలాడును. ఆ శ్లేషయనల్పగుణగుంఫిత మగు సాహిత్యాంగణమున విలాసకేళి సలుపఁ దివురు రసికలోకమును స్వీయహృదయము వికాసభాసుర మగుడు, మెలమెల్ల నందలి రసామృతమును గుత్తుకబంటిగాఁ దీల్చి "పరనిర్వృతి" నంది "రసోవై సః" "స ఏవాహమస్మి" అని ఆత్మానంద పథముల మధుర నాట్యము చేయును. సహృదయునికిఁ దొలుదొల్త సిద్ధించు సాహిత్యప్రయోజన మిదియె. ఉపదేశాదు లనంతరభావులు. సాహితి ఉదాత్తము కానిచోఁ దన ముఖ్యాతిముఖ్యప్రయోజనమును భావుకజగత్తునకుఁ బ్రసాదింప జాలదు. కారుమబ్బులు విలయతాండవ మొనర్చుపట్టులఁ గళానిధి యానందప్రదుఁడు గానట్లు, అధమగుణముల నుండి విడివడని సాహిత్యము నిరుపయోగము.

సమున్నత భావములు, అద్భుతకల్పనలు, నిత్యనూత్న చిత్రణము, అపూర్వార్థఘటనము మున్నగు గుణములు ఉత్తమ సాహిత్యదర్పణమునుండి మన మనఃఫలకములమీఁదికిఁ బరువు చుండును. ప్రకృతిమాతకు ఉదాత్తసాహితీక్షేత్రము క్రీడారామము. అందే రెండుఁ గాంచినను ఆమెపవిత్రపాదన్యాసములు ప్రస్ఫుటము లగుచుండును. విమర్శనదృక్కులగు పాఠకులా యడుగు జాడల స్వర్గసీమలనైన మెట్టి కృతార్థులు కాఁగలరు. ఇందులకుఁ గాళిదాసుని శాకుంతలమే ఉదాహరణము. స్వర్గ మర్త్య లోకములను రెంటిని గవి యిందు మనశ్చక్షువునకే కాదు పతిత భావనాశక్తిసంపన్నుఁడగుచోఁ జర్మచక్షువునకుఁగూడ సజీవచిత్రరూపమున గోచరింపఁజేయును. సంస్కృత సాహిత్యమున నీతనిస్థానము విశిష్టము. ఉదాత్తసాహితీ స్వరూపమును దెలియుటకు నీతని కావ్యములు ముఖ్యపఠనీయములు. వివిధములగు మానసికావస్థలను జిత్రించుటలోను, అద్వైత్య పాత్రల ఘనజఘన్యగుణముల నిరూపించుటలోను నీతఁడు సిద్ధహస్తుఁడు.

ఆర్షకవులు రామాదుల భావావస్థలను దివ్యదృష్టితో దర్శించి వాఙ్మయమును నిర్మించిరఁట. లౌకికకవులు వారివారి భావపరిణతులను ఊహించికాని, లేక తమకుఁ దోఁచినవిధమునఁగాని చిత్రింతురఁట. ఇది యాలంకారికు లన్నమాట. కాని ప్రతిమహాకవియు ఋషియైయుండునని నాతలఁపు. "నానృషిః కురుతే కావ్యమ్" అన్న అభియుక్తోక్తి ఆపాతరమణీయము కాదు; ఆలోచనామధురమగు విశుద్ధసత్యము. కవి ఋషిత్వమునకును, ఋషి ఋషిత్వమునకును గొన్నింట భేదముండిన నుండవచ్చునుగాని, భావనాపథమున నొక్కటియే. ఋషి (లేదా యోగియనుఁడు) ఏకాగ్రచిత్తముతో ధ్యేయమును భావించును. ఆతని భావనాదృష్టి సూక్ష్మాతిసూక్ష్మవిషయములనుగూడ దర్శించునంతటి తైక్ష్ణ్యము గలది. బాహ్యేంద్రియమార్గముల నరికట్టి అంతఃపథమున స్వేచ్ఛావిహారము సేయఁగలిగియుండుటయే ఋషి ఋషిత్వము. కవిగూడ కథానిర్మాణమునఁ గానిండు, పాత్రసృష్టిలోఁ గానిండు ఇట్టి యేకాగ్రభావన కలిగియున్నచో కాని కృతార్థుఁడు కాఁజాలఁడు. త్రికాలములయందలి వ్యవహారములను ఆతఁడు భావనావీథిని దేశకాలపాత్రముల కనుగుణముగఁ జిత్రించుకొనవలయును. ఈ విధమైన యంతర్దృష్టిలోఁ గవి వారివారి భావావస్థలను, మనఃపరిణతు

లను దర్శించి కథానిర్మాణము చేయును. ఇంతకన్న దివ్యదృష్టి యుండునా? అట్టిదివ్యదృష్టి కలవానినే కవి యనఁ జెల్లునని, వానిని ఋషిగా భావించి "నానృషిః కురుతే కావ్యమ్" అను వాక్యము వ్యవహారమైనది. సమున్నతమును సుదూరమును నగు నీదృష్టి లేనివాఁడు కవి కాఁడు; రచయితయేమో!

సంక్షేపముగాఁ జెప్పఁబోయిన ఈ నిర్వచనమునకు లక్ష్యభూతుఁడు కవి. అట్టికవులలో మహాకవి - సకల కవికులశిరోమణి కాళిదాసుఁడు. నక్షత్రములు రాలి పోయినను స్ఖలితము కాని ఉదాత్తమగు సాహితీసుధ యీతని లేఖినినుండి జాలువారి ప్రాక్ప్రతీచీ భూఖండము నార్ద్రమొనర్చి, చిదానందముల బులకరింపఁజేసినది. ఈతని కావ్యపాత్రములు శతాబ్దులకు శతాబ్దులు గడచిపోయినను జెక్కుచెదరని సజీవప్రతిమలు. కథావస్తువులును విశ్వజనీనములు. శకుంతలా దుష్యంతులు, ఊర్వశీపురూరవులు, మాళవికాగ్ని మిత్రులు స్వప్నావస్థనైనను మఱపురాని లోకోత్తర చరిత్రులు. అవక్రపరాక్రములగు రఘువీరులను వాఙ్మయాకాశమున నవీయప్రభాపుంజములు చిమ్ము ఉత్తమనక్షత్రములనుగా సృష్టించినాఁడు. శైశవమున విద్యాభ్యాసము, యౌవనమున విషయోపభోగము, వార్ధకమున మునివృత్తి, అంతిమకాలమున యోగమార్గముచేఁ దనుత్యాగము; ఆహా! ఎంతటి మహోన్నతాదర్శమును రఘువీరుల ముఖమున మానవలోకమునకు సందేశించినాఁడో చూడుఁడు! ఇంతటి యాధ్యాత్మిక జీవనసరణిని సులభముగను సరసముగను ఇక్ష్వాకుల ద్వారమున నేర్పిన మహాకవి సాహితీసృష్టిలోని ధ్రువ తారలకు లెక్క లేకపోయినది. ఈశ్వరుఁ డొక్క ధ్రువతారను మాత్రము సృష్టింపఁజాలినాఁడు.

మేఘదూతమువంటి కావ్యరత్నమే సాహితీ భండారముననైనను దుర్లభమే. నాల్గవశతాబ్ది నాఁటి భూగోళచిత్రమును గీయుట కిది లక్షణగ్రంథమైనది. కవిచంద్రుని సర్వతోముఖమయిన ప్రతిభ, శిల్పకౌశలము, లోకజ్ఞత, విశిష్టసృష్టియందు మూర్తీభవించినవేమో! త్రిజగన్మోహనమైన "అలక"ను, అందలి కామినీమణుల రామణీయకమును, అదిగో! కన్నులకు గట్టుచున్నాఁడు. జగదేకమైనశిల్ప మన్న నీతనిసొత్తే.

ఒక్క ప్రకృతిసౌందర్యమును మాత్రమే గుర్తెఱింగిన చతురుఁడు కాఁడు కాళిదాసు. వలసినంత యాధ్యాత్మిక సంపత్తినిగూడ గుత్తగొన్న స్థితప్రజ్ఞుఁడు. ఐహికాముష్మికవిభూతు లీతని సాహితీ క్షేత్రమున సమ్మేళనము నంది, ప్రతిభాసరస్వతీవశమున జగమును బునీత మొనర్చినవి. ప్రయాగయందలి త్రివేణీసంగమము భారతయాత్రికులకుఁ బవిత్రమైనట్లు, గీర్వాణసాహితీయాత్రికుల కీతని దృశ్యకావ్యత్రయమును, శ్రవ్యకావ్యత్రయమును సముపాస్యములైన ప్రఘట్టములై వన్నొందినవి.

గీర్వాణసాహిత్య మున్నతమగుట కిట్టి కవివతంసుల కావ్యజాలమే కారణము. ఉత్కృష్టములే, ఉదాత్తపాత్రములే, ఉన్నత కథావస్తువులే, లోకోత్తర కల్పనలే, ఆదర్శ సాహిత్యసృష్టికి వలసిన సామగ్రి యని నే నననుl. మధ్య మాధమ గుణములు, అట్టివే యగు పాత్రములు, సామాన్య కథావస్తువులు, సముచిత స్వభావ వర్ణనము మున్నగువానికిఁగూడ నాదర్శవాఙ్మయమునఁ దావు గలదు. కాని, మధ్య మాధముల కుపాదేయబుద్ధితో నందుఁ బ్రవేశము లేదు. పతిత యధమగుణములను, నీచ ప్రవృత్తులను దూరీకరించుకొనుటకే యం దవ్వాని నిరూపణము. ప్రతినాయకుని విపరీతరీతి సృష్టించుటయు నందుకే. అహితమును గుర్తెఱింగినఁ గాని హితప్రవృత్తి కలుగనేరదు. దుఃఖము భయంకరమును దుస్సహము నగుటచేతనే సుఖము సంపాదనీయమైనది. కావున, నట్టి దృష్టితోడి యధమగుణ సన్నివేశము సాహిత్యమునకు నింద్యము కాదు. రామకృష్ణుని నిగమశర్మదుష్ప్రవర్తనము, రుద్రకవి నిరంకుశుని కాముకతా ప్రాగల్భ్యము నాదర్శప్రాయములా? సంస్కారప్రబోధములు. అట్లని కేవలాధమపాత్రములతోడను, హద్దులేని హాస్య శృంగారములతోడను పామరజనానందకములై యొప్పు గ్రంథము లుపాదేయము లనుట నా యభిమతము కాదు. సంస్కృత సాహిత్యములో నట్టి

వారు. అయిన నేమి ? కవికల్పనాశక్తిచే నవ్యగుణరాజితులైనారు. సామాన్యపాత్రముల ఘాత్తునుగూర్చి వారిని గూడ మనకుఁ గ్రొత్తవారిని జేసిన కవికల్పనా ప్రతిభ అనిదంపూర్వము. అదే లోకోత్తరకావ్య మయినది. సరస్వతీచతుర్ముఖుల విలాస సంభాషణమును అపూర్వకావ్యమునుగాఁ జేసి, దేవమానవపాత్రములను ఒక్కరంగమున నవనాట్యదృశ్యఘటితిఁ జిత్రించి గెలుపొందుట మారన్నకే చెల్లె! కళాపూర్ణోదయము కంటె ప్రబంధము "నభూతో నభవిష్యతి" అనవచ్చును. ఏదీ? నేటికం కన్నికళా పూర్ణోదయములు వెలువడఁ జాలినవి? సుసంఘటితమైన సాహిత్యము శతాబ్దులలోఁ గాని సృష్టము కాదా దేమి? అని యుత్కృష్ట రచయితలవలనను, ఋషికల్పులగు కవులవల్లనే కాఁ దగినది.

కల్పనానల్పమగు సాహితి, అనువాదములకు ననుకరణములకుఁ దలయొగ్గని స్వప్రతిభాసమున్మిషిత మగు సాహితి, యావద్భారతదృష్టినే కాదు అఖిల ప్రపంచ దృష్టిని సయితము తనలావణ్యముమీఁదికి ఆకర్షించుకొను సుదాత్తసాహితి, విశ్వసారస్వత పథికులకు విశ్రాంతి నిచ్చి బ్రహ్మానందసుధను ఇందమని చేతి కందిచ్చు నవనవోజ్జ్వలనుతోత్తరమైన మహోత్తరసాహితి "దేశభాషలందుఁ దెనుఁగు లెస్స" అనిపొగడ్తల నందిన యాంధ్రభాషాదేవిగర్భమున నావిర్భవించు శుభదినములను తెలుఁగుకవిదివాకరులు సృజించుకొందురుగాక!

---

# వలపు పిలుపు

శ్రీ అడ్డేపల్లి నాగగోపాలరావు.

క్రమతారాకిరీటమ్ము గగనరమకు
తన్మాలతాంగికి చారుపుష్పాంబరాళి
అమల మణిరత్న నిచయంబు లంబునిధికి
కలవు. మన కిదే ప్రియసఖీ! కలదు ప్రేమ.

వనకుమారికి సౌందర్య వైభవములు
లలితవల్లీ నికుంజముల్ చిలుక గమికి
అమృత మృదుహాస విన్యాస మబ్జలతికి
కలదు. మన కిదే నెచ్చెలీ! కలదు ప్రేమ.

ఈ మహాప్రేమవారాశి ఈ తరంగ
లలితలాస్యమ్ములందు కాలమ్ము మరచి
విడని కౌగిళ్ల ముద్దుల విందులందు
దేహములె విస్మరింతము దేవి! రమ్ము.

# తిక్కన కళాప్రతిభ

శ్రీ రెందుచింతల నరసింహశాస్త్రి.

నన్నయ తిక్కనలయం దెవరు గొప్పవారను విషమసమస్య చిరకాలమునుండియు పాఠకలోకమును కలవరపరచుచున్నది. అట్టి విషయముపై వ్యాసము వ్రాయబూనుట కొంతవరకు సాహసమే యైనను వారిరువురి రచనలను బోల్చి గుణదోషముల వివరించుట భాష కుపకారము కాజాలదు. ఏకరము వారును కవితావిషయమున వీరిరువురి కిచ్చిన ప్రముఖస్థానము నేలనో ఎఱ్ఱన కీయజాలకున్నారు. అరణ్యపర్వ శేషపూరణమున ఎఱ్ఱనకృషి నిరుపమానమయ్యు, పాండిత్యమఖండమయ్యు కవిత్వ మంత రసవంతముగ గన్పింపదు. ఎఱ్ఱన పండితాదరణమును బడసియు నన్నయ తిక్కనలకు వెనుక బడుచున్నాడు.

ఇక రసజ్ఞులకు నిర్ణయింప గష్టమైనది నన్నయ తిక్కనల తారతమ్యము. ఎట్లకేలకు విమర్శకులు నన్నయ కవి యనియు తిక్కన నాటకకర్త యనియు నొక నిశ్చయమునకు వచ్చియున్నారు. ఇటీవల శ్రీరాయప్రోలు సుబ్బారావుగారు 'త్రివేణి' పత్రికలో తాము వ్రాసిన యాంగ్లవ్యాసమున నీ విషయమునే వ్యక్తపరచిరి. ఎందరెన్ని విధముల వ్రాసినను 'భారత భారతీ సముద్రము' దరియరానిదే! ఆంగ్లమున షేక్స్పియరు వాఙ్మయమున కున్న ప్రచార బాహుళ్యమే తెనుగున భారతమునకును గలదు.

నన్నయభారతభాగము నాదినుండియు చదువుకొని పోవువాడు, 'శారదరాత్రు లుజ్జ్వల' అన్నపద్యముతో నాతని కవిత్వ మంత మెుందునని యెరిగి, తృషాపీడితుడు నోటినుండటి మధుపాత్ర లాగివేయగా పడునంత బాధపడును. ఇంకను విస్తారమైన తిక్కన భారతభాగము నొకతరుగని గనితో బోల్పవచ్చును.

తిక్కన నిర్వచనోత్తరరామాయణము వ్రాసిన యెంతకాలమునకు భారత రచనకు గడగెనో తెలియుటలేదుగాని రామాయణము చివరిభాగములో సీతావనవిహార, సీతాపరిత్యాగఘట్టముల నున్న సీసపద్యములకును, విరాటపర్వములోని కీచకసంహార కథయందలి సీసపద్యములకును కొంతపోలిక కనబడుచున్నది. దీనినిబట్టి తిక్కనకవిత యెంత సక్రమరీతిని పరిపక్వదశకు వచ్చినదో మనకు దెలియుచున్నది.

ఈక్రిందిపాదముల నెంత మెలకువతో నడపినాడో చూడుడు:

"చ్యవనుని శాంభకు సంయాతినందన
యిడుముల కుడువదె యడవిలోన
రాఘవుతోడ నరణ్యవాసము సేసి
సంతాప మందదె జనకతనయ
కుంభసంభవునికై ఘోరదుర్గముల లో
పాముద్ర యలజడిపాలు గాదె
నలుని పెట్టుండ కానల కేగి దమయంతి
మనుజాలు పడని యుమ్మలిక పడదె"

ఈతని రచన యంతయు నొకేశయ్యా నడచినది. నన్నయలో నటనట నుబుకు నావేశములు తిక్కనలో నెచటను గానరావు. ఇతడు బహునిష్ఠాపరుడై స్వార్థచింత యేమాత్రము లేక కేవలము భాష కుపకార మొనరింప నీకృతి నిర్మించె ననుట నిస్సంశయము. నన్నయభట్టుకవిత్వమునెడల నితనికి గల గాఢాభిమాన మీ క్రింది చరణములవలన దెలియనగును.

"..............అం
డాడదొడంగి యాంధ్రకృతు
లాంధ్రకవిత్వవిశారదుండు, వి
ద్యాదయితుం డొనర్చె మహి
తాత్ముడు, నన్నయభట్టు దక్షతన్"

అది నన్నయ వ్యక్తియందుగల యభిమానమేగాని, అతని కవిత్వమునందును కృతియందును గల యభిమానము గాదనియు, అందుచేత తిక్కన నన్నయ రచితభారత భాగము నసలు చదివినట్లు కన్పడ దనియు నొకరు వ్రాసియున్నారు. ఈవాద మెంత యసంబద్ధముగ నున్నదో పాఠక మహాశయులే గ్రహింపగలరు. ఎవరికైనను పూర్వీకు డగు నొకకవియం దభిమానము కలిగినచో నది వారి రచనను బట్టియేగాని వ్యక్తిపరముగ నెట్లగును? తిక్కన, నన్నయ కవిత్వ మామూలాగ్రము చదివినాడనియు, తత్ప్రాబల్య మెఱ్ఱనాదులనువలెనే యితనినిగూడ కొంతవరకు వశపరచుకొనిన దనియు వ్రాయుటలో నెంతయు సత్యము గలదు.

కుపితు డగు భీముని వర్ణించునప్పు డిమ్మహాకవు లిరువురును వ్రాసిన యీ క్రింది పద్యద్వయమును జూడుడు ఎట్లొకరి నొకరు మించుచున్నారో !

"ప్రకటితకోపవేగమున
పద్మదళాయతనేత్రముల్ భయా
నకతరలీల దాల్చి నరు
నగ్యతి సద్ధరమై త్రిశాఖమై
భ్రుకుటిలలాటదేశమున
జాల్చ త్రికూటతటిన్ ద్రిమార్గగా
నకృతి ప్రభంజన ప్రియసు
తాజున కంతకమూర్తి కన్పటన్"
— నన్నయ.

"కనుగొని కోపవేగమున
కన్నుల నిప్పులు రాల వంగముల్
కనలగ పాండ్రఘూర్ణ పలి
లంబులు గ్రమ్మ నితాంతదంతపే
షనరటవాస్యరంగవిక
టభ్రుకుటీచటులప్రవృత్తన
ర్తనఘటనాప్రకారభయ
దస్ఫురణాపరిణద్ధమూర్తియై"
— తిక్కన.

ఇట్లే మానభంగ ఘట్టమునందలి ద్రౌపదియు, సైరంధ్రీవృత్తి నున్న ద్రౌపదియు రెండును ననమానపాత్రలే! కాని రెంటికిని భేదముగలదు. తిక్కనగారి ద్రౌపది పగ సాధించి శత్రుభంజన మొనర్చినది. విరాట నగరవాసుల కందరకును బెదురు పుట్టించినది. తుదకు తనచర్యనెట్లు సమర్థించుచున్నదో చూడుడు

..................................."దీనికై
కీచక యింతసేసితి సుఖిత్వము నొందెదుగాక నింక"

ఇట్లే యితరపాత్రలనుగూడ తిక్కన మన కనులయెదుట గట్టునట్లు సృష్టించినాడు. నన్నయకవిత్వము నిర్లక్ష్యముగా సాగదీసి వ్రాసినను సొగసుగానే యుండును. తిక్కన కొంత క్రమమును పాటించును. ఈ క్రింది యుదాహరణములను జూడుడు:

"వారిధారల ననివారిత నిర్గళ
  ద్దానధారల, దటిద్ధామములను
దళితధామంబుల, నశనిఘోషంబుల
  ఘనోర బృంహిత బృహద్ఘోషణముల
నివి ఘనబృందంబు లివి గజయూథంబు
  లని విచారింపంగ నక్కజంబు
గా లలితోత్తుంగశైల శృంగంబుల
  గ్రమ్మరు జలధరద్విరదతతుల"

—నన్నయ.

"సమదవారణము జంగమలత గనుకొని
  నరభసంబున బట్టు జనువిధమున,
గ్రూరదానవుడు భూచారినిర్జరకాంత
  బొదువ రయమ్మున బోవుభంగి,
ఘోరసర్పము సుకుమారనాగాంగన
  బటుగతి నొడియంగ బాఱుకరణి,
బ్రబల ఓఘాలంబు బాలతారిక మీద
  నతిరభసత్వరితముగ నరుగుమాడ్కి"

—తిక్కన.

"నీవు నలునకు కీర్తితో దేవివైన
గాక నీసముజ్జ్వలరూపకాంతి విభవ
నిత్య సౌభాగ్య భాగ్యాక్షిజాత్యభద్ర
లక్షణావలు లివి సఫలంబు లగునె"

—నన్నయ.

"చెలువ యప్పలుకులు చెవిచెవుల బెట్టి
ధీర గావున విగతవికార యగుచు,
మదిర వోయింపు డద్దేవి రొదురుచూచు
వలుగు దడసైన మసడ బోవలయు ననిన"

—తిక్కన.

తిక్కన ప్రజాస్వామ్యమునే దేశహితముగా గణించినట్లు గన్పడుచున్నది. 'ఉదోగాదులున్ గూడగా నదియేనింటి తెలుంగుబాస జనసంప్రార్థ్యంబులై పెంపునన్ తుదిముట్టన్ రచియించితి' ననుచున్నాడు. దీనిని బట్టి యీతడు ప్రజలయొక్క కవియని చెప్పనగును. ఈతని భారతభాగమున మానవప్రకృతి విస్తారముగా ద్యోతకమగును. నన్నయలోకంటె నీతనిలో నెక్కువ 'సిన్సెరిటీ' యున్నది. అతనికంటె యెక్కువ 'ఇంప్రెసివ్'గా చెప్పగలడు; ఎక్కువ సూటిగా చెప్పగలడు. నన్నయకు పెదవుల మీదనే మాటలుపుట్టును. తిక్కనకు హృదయములో నుంచి పెల్లగిలివచ్చును. కావుననే అఖండమైన తన ప్రతిజ్ఞను నెరవేర్చుకొని ధన్యుడు కాగలిగినాడు. కాని స్వతంత్రమైన యొక నాటకమును వ్రాయవలెననిగాని, అప్పటికే చాల ప్రచారములో నుండి యుండిన కాళిదాసాది సంస్కృత కవుల నాటకములలో నొకదానినైన తెనిగింపవలెనని గాని యేల పూన్కి గలుగలేదో! బహుశః, ఆనాటి తెనుగురంగస్థలము దేశమున నుచ్చస్థితిలో లేకపోవుటయే దీనికి కారణమైయుండవచ్చును. ఏమైనను ఈనాటి నాటకకర్తలకు పాత్రలను సృష్టించువిషయములో తిక్కనరచన యాదర్శముగా వెలయగలదని మన మాశింపదగును.

---

# నిగమశర్మోపాఖ్యానము

శ్రీ చతుర్వేది సత్యనారాయణ

౧

పాండురంగ మాహాత్మ్యమునందలి నృసింహ క్షేత్రమాహాత్మ్యము నుగ్గడించుచుఁ గవి—

" అపునరావృత్తి శాశ్వతవిపులసౌఖ్య
సిద్ధి ప్రహ్లాదునకు దయచేసినట్టి
యా నృహర్యక్షవిభు క్షేత్ర మధిగమించి,
జనుఁడు పాపంబువలన మోచనము గాంచు.

పంచన యింత లేక బహు
వారము లెంతయుఁ గ్రూరచిత్తుఁడై
పంచజనుండు పంచవిధ
పాతకముల్ మును చేసె నేనియున్
బంచత శ్రీనృసింహునకుఁ
భాగమునన్ గనుఁ బుణ్య మొక్కఁడున్
గాంచినఁ జాలు విష్ణుపద
గామి యగున్ గులకోటితోడుతన్."

అని వర్ణించెను.

ఈ క్షేత్రముయొక్క యాశ్రిత చరిత్రమును బ్రకటించుటకుఁ గవి నిగమశర్మోపాఖ్యానము నుదాహరణముగా గ్రహించెను.

మాహాత్మ్యములఁ దెల్పు కావ్యములయం దుదాహృతము లగు నుపాఖ్యానవిధానముల మన మూహింపవచ్చును. మహాత్ముఁ డల్పాత్ముల నుద్ధరించుచుండుట గాన నగును. అల్పాత్ముల నుద్ధరించుటచే నిజముగా మహాత్ముఁడు మహాత్ముఁ డగును. తా నల్పాత్ములలో నెంత యధముని నుద్ధరింపఁగల్గునో యాతఁడు మహాత్ములలో నంత యధికుఁడు. ఒకచోటఁగల యపకృష్టతి తదుద్ధరణమూలమున మఱొక్కచోట నుత్కృష్టతా కారణ మగును.

ఇట నరసింహదేవుని మాహాత్మ్యమును ఘోషించుటకై కవి నిగమశర్మను బతితాధమునిగా వర్ణించెను. అందువలన నీ యుపాఖ్యానమున నిగమశర్మపతనమును, దాని నుద్ధరించుటచే నరసింహుని మాహాత్మ్యమును గవి ఘోషింపఁదలఁచిన విషయములు.

కవి నరసింహమాహాత్మ్యఘోషణమున వైష్ణవమతాభినివేశమును జూపినను, నిగమశర్మపతనమునఁ దన యనల్పశిల్పప్రాబల్యమును బ్రదర్శించె ననుటకు సందియము లేదు.

కళాదృష్టితోఁ జూచిన నిగమశర్మోపాఖ్యానమున "నిగమశర్మ పతనము" ముఖ్యవస్తువు. కావ్యకళామర్మ మెఱుంగని కవి యైనచో

"బ్రహ్మహత్యా, సురాపానం,
స్తేయం, గుర్వంగనాగమః;
మహాంతి పాతకా న్యాహుః,
తత్సంసర్గశ్చ పంచమః."

అను శ్లోకమునందలి పంచమహాపాతకములను నిగమశర్మయందు

"లలనాధరోష్ఠలాలాజలాన్వితముగఁ
గ్రోలె మద్యము పేరిటలము నెల్ల,
వావివర్తనలతో వావంత దలఁపక
కన్నిచ్చు వడతేఁ చెఁ గామవికృతి,
జనులఁ బ్రువ్వఁగఁ దిట్టి పడి కోర్చి యార్జించె
బశ్యతోహరవృత్తిఁ బసిఁడిబ్రోగు,
కన్న పెట్టియుఁ ద్రోవఁ గాచి కొట్టియుఁ జంపె.
లెక్కకు మిగులు భూలేఖవరుల,
మఱియు నీరీతిఁ గ్రూరుల మైత్రి వడసె,
నితరపాతకములు చేసె నెన్ని యేని......"

అని యుదాహరించి యాతని నుద్ధరించుటచే వర
సింహుఁడు మహాత్ముఁ డని చెప్పి తనపని దీరినట్లు
సంతృప్తిఁజెందును. కళాకోవిదుఁడైన యీకవి యంత
మాత్రమునఁ దనివిసనక నిగమశర్మపతనమూలక మగు
కారణపరంపరను నిరూపించుచు నాతని పతనమును
బహుముఖము గావించెను. కారణపరంపర కవకాశము
గల్గుటకును, బతనాత్కృష్ట్యమును బ్రదర్శించుటకును
వాని పూర్వావస్థకును బశ్చిమావస్థకు నవాంతర మెం
తేని కల్పించెను. అంతటి యుచ్చస్థితినుండి యింతటి
నీచస్థితికి వచ్చెనని యాతనిపతనమును నిరూపించునపుడు
పాఠకుల హృదయముల నది యాకర్షింపకపోవు టెట్లు?

మానవులలో నెల్ల పతితుఁ డెవ్వఁడు. ఇంద్రియ
లౌల్యముచేఁ దనమనమును నియమించుకొనలేక యవి
పోయినట్లెల్ల బోయి తన సహజస్థితినుండి పడిపోవు
వాఁడు పతితుఁ డనఁబడును. వాఁడు సులభముగాఁ దన
స్థితిని గాపాడుకొనుశక్తి కలిగియు దాని నిలఁబెట్టు
కొనుటకేని ప్రయత్నింపక పశువువలె నవిచార్యకరణ
శీలుఁడై చెడిపోవును. ఇట్లు తన మానవత్వమునకు హాని
కల్గించుకొనుటచేఁ బతితుఁడు మానవాధముఁ డనిపించు
కొనును.

ఈ యుపాఖ్యానమున నిగమశర్మ పతితాధముఁ
డుగా వర్ణింపఁబడెను. నిగమశర్మ పూర్వపశ్చిమస్థితి
గతుల మతిఁ దలంచినచో వానిపతన మతిఘోర మని
మన మెఱుంగఁగలము.

వివేకపూర్వకమైన బుద్ధికలిగి తనజీవితప్రయోజ
నమున కనువగు పురుషార్థమును గ్రహింపకపోవుటయే
వీనిపతనమునకుఁ బ్రధానకారణము. ఇది చేయవచ్చును;
ఇది చేయఁగూడ దను జ్ఞానము వీనికి లేదు. ఇంద్రియము
లెట్లు ప్రేరేఁచిన వీఁ డట్లు నడచుకొనును. ఇట్లింద్రియ
ముల నమ్ముకొనినవాఁడు చెడకుండు టెట్లు? తనవశులోఁ
బడిన సారథియు, సారథిచేఁజిక్కిన పగ్గములును, పగ్గ
ములకుఁ గట్టువడిన గుఱ్ఱములు నున్నచో రథికుఁడు శీఘ్ర
ముగా గమ్యస్థలము నధిగమింపఁ గలఁడు; గుఱ్ఱము లిచ్చ
వచ్చినట్లెల్ల పాఱినచో వాఁడు గమ్యస్థలమునకుఁ జేర
కుండుట యటుండ నిడుమలఁ గుడువవలసివచ్చును.
అట్లే మనుజుని కనుకూలముగా బుద్ధియు, దానికి మన
స్సును, దానికి నింద్రియములు నున్నచో వాఁడు సుక
రముగాఁ గార్యసిద్ధి నొందును; లేనివాఁడు దుర్గతిఁ
జెందు నని కాఠకమునఁ గలదుగదా!

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవతు,
బుద్ధింతు సారథిం విద్ధి మనః ప్రగ్రహమేవచ.
ఇంద్రియాణిహయానాహు ర్విషయాం స్తేషుగోచరాన్
ఆత్మేంద్రియమనోయుక్తం భోక్తేత్యాహుర్మనీషిణః.
య స్త్వవిజ్ఞానవాన్ భవ త్యయుక్తేన మనసా సదా,
తస్యేంద్రియా ణ్యవశ్యాని దుష్టాశ్వా ఇవ సారథేః.
యస్తు విజ్ఞానవాన్ భవతి యుక్తేన మనసా సదా,
తస్యేంద్రియాణి వశ్యాని సదశ్వా ఇవ సారథేః.
విజ్ఞానసారథిర్యస్తు మనః ప్రగ్రహవా న్నరః,
సోఽధ్వనః పారమాప్నోతి తద్విష్ణోః పరమం పదమ్॥"
—అధ్యా ౧, వల్లీ ౩.

జ్ఞానముకల మానవుఁ డెవ్వఁడును బ్రయోజనము
లేక యే కర్మ నాచరింపఁడు. "నకుర్యాన్నిష్ఫలంకర్మ"
యని గదా పెద్దలు చెప్పుదురు. అందువలన నేదియో
యొకప్రయోజనము నుద్దేశించి ప్రతిపురుషుఁడును కర్మ
నాచరింపవలెను. అందుఁ బరమప్రయోజనములు ధర్మా
ర్థకామమోక్షము లనుచతుర్విధపురుషార్థములు. ఈనా
లుగు పురుషార్థముల బలాబల పరిశీలనము చేసినచో
మోక్షము పరమపురుషార్థమని గ్రహింపఁ గలుగుదుము.
ఉత్తమకర్మ నాచరింపఁదలఁచినవాఁ డుత్తమపురుషా
ర్థమునకై కృషిసలుపవలెను. కావునఁ బురుషుఁడు
మోక్షముకొఱకుఁ బ్రయత్నింపవలెను. మోక్ష మెందు
వలనఁ బరమపురుషార్థము? అది స్వపర్యవసన్నము.
దాని నందినవాఁడు శాశ్వతానందము నందఁగలఁడు.
"న స పున రావర్తతే" వానికిఁ దిరిగి సంసారసంబంధ
గంధమైన లేదు. అంతటితో వాని ఫలప్రయత్నము లవ
సితము లగును. ధర్మార్థకామము లట్లు స్వపర్యవసిత
ములు కావు. ధర్మముయొక్క పరమ ప్రయోజనము
మోక్షము. కామముయొక్క పరమప్రయోజనము
ధర్మము. అందువలన మోక్షానుసారియగు ధర్మ
ముత్తమము; తక్కిన ధర్మ మధమము. అట్లే ధర్మాను
సారియగుకామ ముత్తమము; తక్కినయది యధమము.
సరియగు కామము నాసించువాఁడు ధర్మము ప్రయో

జనముగా గ్రహింపవలెను. ధనదారపుత్రాదుల ధర్మ మాచరించుటకుఁ గోరవలెను. ధనమును సత్కార్యములకై వినియోగించుటకును, దారను బుత్రులకొఱకును, బుత్రులఁ బైతృకకర్మలకు నాశింపవలెను. అట్లే ధర్మము మోక్షానుసారిగా నుండవలెను. ధర్మాచరణముచే సత్త్వశుద్ధి కలుగును. సత్త్వశుద్ధి కలిగినవానికి నాత్మస్వరూపశ్రవణ మనన నిదిధ్యాసలచేఁ బ్రతిబంధత్రయ మంతరించి మోక్షము కరతలామలకము కాఁగలదు.

౨

నిగమశర్మ బ్రహ్మజ్ఞానార్హులగు బ్రాహ్మణులలోఁ బ్రాఁగువిత్తవంటి నెఱపాఱుకులమందుఁ బుట్టెను. వానితండ్రి వేదములం దోఁకగాఁడు; సమస్తశాస్త్రపారంగతుఁడు; సభాపతి, ఆహితాగ్ని; తల్లి పుత్రులకై యతులనిష్ఠతో నింగివేల్పుల నేలకు నేలవేల్పుల నింగికిఁ దెచ్చుచుఁ గొల్వఁగా వీఁడుద్భవించెను. ఇట్లనూచానసంతతి పవిత్రిల్లుటచే శుద్ధసత్త్వస్వరూపుఁడై, దానికిఁదోడు వేదములఁ జదివి నిగమశర్మ యను పేరు సార్థకముచేసికొనెను. అనంతరము నిగమశిఖల శ్రవణముచేసి తద్రహస్యమును మనన మొనర్చెను. వానికిఁదగిన నిదిధ్యాసకూడ నున్నచో ముక్తి యాతని పాణిగృహీతి యయ్యెడిది. ముక్తి కంత సమీపమం దున్నను దానియందు మనస్సు నిల్పలేక తార్తీయపురుషార్థమునకుఁ దార్చెను. మోక్షమునుండి యొక్కసారిగాఁ గామమునఁ బడుట యాతని ప్రథమపతనము.

కామము లోకప్రవృత్తికి మూలము. అది సర్వజనసేవ్యమగు పురుషార్థము. కామసేవనమునఁ గామచార మవలంబించినచో సర్వానర్థములకును మూలమగును. ధర్మ మూఁతఁగొని యంతకాలము దానికిఁ బతన ముండకుండుటయగాక ప్రశంసాపాత్రముకూడ నగును. కామ మందువలన సర్వాత్మకముగా నిషిద్ధము కాదు.

కావునఁ గవియు నీతని పురుషార్థపతనమున కట్టి దోషాపాదనము నొనరింపక యది దైవఘటనవలనఁ గలిగెనని జాలిఁగొనెను. తరువాత నిగమశర్మకామము ధర్మదూర మైనపుడు కవి యాతని ప్రకృతియందే దేదే నొక దోషముచే నిట్టిదుర్బుద్ధి పుట్టెనని తలఁచి దాని నన్వేషింపదొరకొని "కళింగోద్భవుఁ" డనుట చేనొ యని దోషకారణమునుగూడ సంభావించెను.

నిగమశర్మకామము ధర్మదూర మగుటకుఁ గారణముల నిరూపించుచు "శిశ్నోదర పరాయణత్వమునకుఁ బార మెఱుఁగక తిరుగు వాబ్రాహ్మణుం" డని కవి నుడివెను. అశ్లీలదోషమున కొడిగట్టియుఁ గవి యాతని వ్యసనాతిశయమును సూచించుట కిందు మొదటిపదమును బ్రయోగించెను. శిశ్నోదరవ్యసనములచే నిగమశర్మ నివృత్తిమార్గమును వదలి ప్రవృత్తిమార్గమునఁ బ్రవృత్తుఁ డయ్యెను. ఈ రెంటిలో స్త్రీవ్యసనము ప్రబలమైనది, అది తీరనిది దీనికి బ్రదుకుఁ దెరువే లేదు. ఉదరవ్యసనము దాని నాశ్రయించియుండును. ఇందుసగఁద నితర రజఃపాత మొనర్చి ధానితోఁ దానుగూడ నడఁగంటిన స్త్రీ యుభయతృష్ణలు నితరగుణపాత మొనర్చి వానితోఁ దాను నాశమొందెను.

ఇతని స్త్రీవ్యసనము సర్వానర్థములకును మూలము. అది మొదట ధర్మపాత మొనర్చి దానితోఁ దానుగూడఁ బోడవడంగెను. స్త్రీభ్రంశము ననుసరించి స్థానభ్రంశము, దాని ననుసరించి యుదరభ్రంశము కలిగెను.

కామపరాయణుఁడై నిగమశర్మ మొదట వైదికాచారములకు స్వస్తిచెప్పెను. దుష్పథగామియై భోగబాహుళ్యము నాశించుటచే గుణమహితయు, లాలితాకారయు నగునిల్లాలియందలి ప్రేమ సన్నగిలెను. మనస్సు మన్మథాయత్తమై క్రమముగా వేశ్యలయందు లగ్నమయ్యెను. అదివఱకు హోమాగ్ని నూఁదెడివాఁ డది మాని విరహాగ్ని పెచ్చునూర్చెను. సంధ్యావందనము మాని యీర్ష్యాకషాయితలకు వందన మాచరించెను. వేదవాదములఁ జాల్గొనుట మాని విటవాదములఁ దీర్చుచుండెను. విష్ణుశ్రీపాదపయఃపానము మాని యోషావశాధరసీధుపానుఁ డుండెను. శరీరమునఁ బుణ్యచిహ్నములు మాని నఖక్షతముల సమ్మతించెను. ఇట్లు నిగమశర్మ తనవామమును వైదికాచారదూరుఁడై నేతిబీరకాయ నొనరించెను. దుష్టవర్తనమునకు దిగిన శ్రోత్రియులలో నెఱఁగినవారిని జూచిన సిగ్గుపడెడివాఁడు క్రమముగా

వేశ్యల కఠినియం దనురాగము ధనముతోఁ గూడినది. ధన మిచ్చునంతవఱకును వారి ప్రేమ ప్రకాశించును. వారిని దనియించుట కాతఁ డింట దొరకిన ధనమెల్ల గొల్లపెట్టెను. ముందు దన మేనఁగల సొమ్ములఁ గుదువఁబెట్టెను. తల్లిని బీడించి యామె సొమ్ములఁ దెచ్చియిచ్చెను. తండ్రికిఁ దెలియకుండఁ బత్రముల దొంగిలి వచ్చినంతకు వాని నమ్మెను. ఎంత వడ్డియైనను సందేహింపక మృత్యుస్వరూపులైన సాహులయొద్ద ఋణము గ్రహించెను. చేలు గ్రామాంశముల నమ్మఁ జూచెను. ముందువెనుకలు చూడక వాఁ డిల్లు గుల్ల చేసెను.

అంతతోఁ బోలేదు. ధనార్జనమునకు జూదము, దొంగతనము, అనృతభాషణము, మోసమును జేయ మొదలుపెట్టెను. ఇది చేయఁగూడదను వివేకము వాని కప్పుడు లేదు. ఎట్టి యకార్యము నాచరించియైన వ్యసనము తీర్చుకొనుటయే వానికిఁ గావలసినది. అందువలనఁగూడ ధనముఁ గానక యక్కమాటల వినిన పగిది యింట నున్నట్లుండి యొకరాత్రి పడు పడుక కైనఁ జెప్పక యింటఁగల ధనమంతయు దోచికొని పోయెను.

ఒక్కఁడు నిర్జనారణ్యమునఁ బోవుచుండ దొంగ లాతనిఁ జావఁగొట్టి ధనమంతయు దోచికొనిపోయిరి. ఆదారిఁ బోవు కాఁపుకుమారుఁ డొకఁ డనుకంపామృదుహృదయుఁడై వానిని దనయింటికిఁ గొనితెచ్చి చేయవలసిన యుపచారములఁ జేసి పడిపోవు ప్రాణముల నిలఁబెట్టెను; విస్తారగౌరవముతో మన్ననల సలిపెను. నిగమశర్మయుఁ గ్రొత్తయగుటచే నెవరిస్వభావము లెట్టివో తెలియక తలలో నాలుకవలెఁ గలసి మెలసి యుండెను.

ఆ కాఁపుకుమారుని కొకరీతి భార్య కలదు. ఇంట నడ్డమాక లేక తిరుగు దీనిపై నామె వలపు నిలిపెను. ఈ మిత్రద్రోహి — ప్రాణదాత కపచార మొనర్చుటచే నీక గురుద్రోహి — ప్రాణదాత యని గాని, గురుఁడనిగాని, మిత్రుఁడనిగాని, భక్తుఁడనిగాని, యాశ్రితుఁడనిగాని యెంచక వానియిల్లాలియందు దుశ్చేష్టిత మారంభించెను. కవి యాతని యధర్మము నిట్లు నిరసించెను.

"తలపుండ్లు గడిగించి తన్ను బ్రదికించెఁగా
యడవిఁ జోరాహతుం డైనఁ దెచ్చి
కన్నబిడ్డలకన్న గారవంబునఁ జన
విచ్చెఁగా నిచ్చలు నింటిలోన
గ్రాసవాసక్లేశకశ్మలత్వ మడంచి
యనురక్తిఁ బెనిచెఁగా ననుదినంబు
గురువుగా వేల్పుగాఁ గూర్చుచుట్టంబుగా
భావించి కొలిచెఁగా భక్తియుక్తి
నెవ్వఁ డా రెడ్డియింటికి నెగ్గు చాలఁ
జేయు గుడినుండి గుడిరాళ్లు దీయుకరణిఁ
గపటనటనానటుఁడు బ్రాఁతఁ గట్టుబోయ
కాయజామేయసాయకాఘాతభీతి."

స్త్రీవ్యసనము దీరనిచో బ్రదుకలేనేమో యను భీతిచే నతఁడు కాఁపుకోడలితో రహస్యరతులఁ దవిలి తనివి సనక యామెను దీసికొని ఘోరారణ్యమున కేఁగెను.

అటఁ గల్లుపెల్లాని వేఁటాడు గరుసు నేరచెను. కడుపునకుఁ దగిన యాహారము లేకుండుటచే మాంసభక్షణము మొదలుపెట్టెను. ఇంద్రియపరాయణత్వ మాతని ధర్మభ్రంశమునకుఁ గారణము. స్త్రీవ్యసనమున నెట్లో యుదరవ్యసనమున నట్లే యతనిధర్మ మడుగంటెను. స్త్రీవ్యసనమున నగమ్యాగమన మొనర్చిన ట్లుదరవ్యసనమున నభక్ష్యభోజన మొనరించెను.

ఇట్లుండఁ గొలఁదికాలమునకుఁ గాఁపుకోడలు పరలోకమున కేఁగెను. ఆతఁ డంతట నొకపల్లవవాలాంగనాసాంగత్యము చేసెను. ఆమెయం దీతనికి నవపుత్రి మగు పుత్రలాభము కలిగెను. ఆమెతోడి సుఖముల కాసించి యాతఁడు సేయని మహాపాతకములే లేవను నపుడు తక్కిన యల్పపాపములఁ జెప్పనేల ? ఇతనివలనే సురాపానము, సువర్ణస్తేయము, గుర్వంగనాసంగమములు, సంభవించినవి. బ్రహ్మహత్య మహాపాతకుల తోడి సాంగత్యము, దోయుట, దారులుకొట్టుట, యిది యది యన నేల ? వాఁడు సేయని యకార్య మేదియు లేదు. లోకమేమనుకొనినను వానికి లెక్కలేదు.

"ఈ కడజాతిజాతినాతి కిపి
హీ నహిదేవుఁడు చిక్కు నంచు నక్
రాకకుఁ బోకకుక్ జనప
రంపర కెంపగుచూడ్కిఁ జూచి యం
బూకృత మాచరించుటకు
బుద్ధిఁ దలంక........"

ఇది ధర్మభ్రంశము.

ప్రప్రథమమున నీతనిజీవనము సాత్త్వికమైనది. కామమునఁ బడినది మొదలు అది రాజసమునకు దిగెను. భోగపరత్వమున భోగవనితాలోలుఁ డైన కాలమున రాజస మారంభమయ్యెను. గ్రామమునఁ గాఁపుకోడలితో నున్న కాలమున నది పరిణతమయ్యెను. కాంతారమునకేఁగి కల్లుపెల్లానుటతో వాని తామసజీవన మారంభమయ్యెను. అనంతరము వేఁట, మాంసభక్షణము, చండాలసంసర్గము, బ్రహ్మహత్యాది దుష్కర్మలచే వాని తమోగుణము పరిణతిఁ గాంచెను.

ఇది ధర్మభ్రంశములోఁ జేరిన గుణభ్రంశము.

నిగమశర్మ బ్రాహ్మణితోఁగూడి వైదికకర్మ లాచరించుచున్నంతకాలము బ్రాహ్మణోత్తముఁడు. వైదికాచారముల మాని భోగపరాయణత్వమునకు దిగినపుడు సామాన్య బ్రాహ్మణుఁడు. వేశ్యాలోలుఁ డైనపుడు జాతిమాత్రోపజీవి. కాఁపునింటఁ గుడుచుకాలమున నింకను ప్రాయశ్చిత్తమున బ్రాహ్మణత్వయోగ్యత గల్గుటచే బ్రాహ్మణాధముఁడు. అనంతరము కాఁపుకోడలితో నరణ్యమున కేఁగి—

"ఎన్ని జన్మంబు లేనియుఁ జన్న పిదపఁ
గాని ప్రాపింపరాని ధరానిలింప
జాతి గడిలోన నప్పాపజాతి తొలఁగి,
కల్లుపెల్లాని వేఁటాడు గరుసుతోరసి"

నపుడు బ్రాహ్మణత్వము గోల్పోయి శూద్రుఁడు. కాఁపుకోడలు పరలోక మేఁగఁగాఁ జండాలను బరిణయమాడి చండాలకర్మల నాచరించుటచేఁ జండాలుఁడు. అందునను బంచమహాపాతకము లాచరించుటచేఁ జండాలాధముఁడు.

ఇది ధర్మభ్రంశమునందలి జాతిభ్రంశము.

నిగమశర్మయిల్లాలు ముద్దరాలు; రూపగుణములకాణాచి; భర్తయెడ నామె కెంత యనురాగమున్నను సిగ్గుచేతను, పెద్దలవలని భయముచేతను గుట్టుగా దాఁచుకొనుటయే గాని పైపొంగు లామె యెఱుంగదు. హృదయమునందుఁ బ్రేమ నిండియున్న చాలు నని యామెయభిప్రాయము. నిగమశర్మ నిరాదరణమువలన నాయమ సౌందర్య మడవిఁ గాసిన వెన్నెల యయ్యెను; అనివార్యమాణజృంభణంబగు నామె యౌవనారంభము వనకేళీ పలాశదోహదమయ్యెను; భర్తృవైముఖ్యముచేఁ గుందువడిన యామె సౌందర్య యౌవనములు చూచినవారు కడుపుచుమ్మలు చుట్టి కన్నీ రుట్టిపడఁ బొట్టు పొరలుచుండువారు. ఆమె యత్తమామల చిత్తమున కెక్కునట్లు భక్తిశ్రద్ధల మెలఁగుచుండెను. ఎప్పుడును బ్రాణేశ్వరుని శ్రీపాదద్వయమును మనమునఁ దలఁచికొనుచు, నాతనికిఁ దనయందుఁగల యనాదరమునకు వ్యాకులిత నిజనిశ్వాసజతాపమునఁ గాలము గడపుచుండెను.

తనతోడిదే బ్రదుకుగా నెంచు నిల్లాలి నిల్లాలితాకారము నిగమశర్మ నిరాకరించెను. ప్రేమ గుట్టుగా నుండుటవానికిఁ గిట్టదు. అది పరస్పరావలోకమున బుస్సని పొంగవలెను. మాటలలోఁ జేష్టలలో నంతటఁ గానరావలెను. ఇట్టి పైమెఱుంగుల కుట్టటలూఁగు నిగమశర్మకుఁ దనయిల్లాలి భావము తెలియు టెట్లు? ఆమె యెదయందు పెల్లిగొనియు నిగూఢమైన ప్రేమను గని తనివిగాంచు టెట్లు?

స్త్రీవ్యసనమున దిగుటతోడనే యాతని వివేకము వీటఁ గలిసెను. ఈ వ్యసన మావేశించినపు డాతనికి జాతి గుణభేదములు గణనకు రావు. కంటికింపైనకాంతల నెల్లఁ గవయఁగోరు మానసిక క్షయపీడితుల మన మెఱుంగుదుముగదా! నిగమశర్మ నావ్యాధి బాధించుచుండెను. మనోదౌర్బల్య మీ రోగమునకు నిదానము. ఇట్టి లఘుశీలుఁడు కావుననే పేఁకవన్నియలును, వలకాఱిబాగులును కలిగి లేనిమచ్చికలఁ జూపు కోయింతులు లేమ నక్కటక్కులు, వింత నయగారములు, బహునాటకములు, సాగింపులు మొదలగువానిచే వాని చిత్తము చూఱఁగొనిరి. వాని ధనమంతయు నుంజుకొని

ఈతని స్త్రీవ్యసనమున కనంతరాహుతి కాఁపుకోడలు. ఆమె శశికలను బోలినదయ్యు నొక రకమైనది; విలాసవతి యయ్యును జానపద. ఈమె విలాసములలో మోటుతనము లేకపోలేదు.

"కుదురుపాలిండ్లపైఁ గొంగుజాఱఁగఁ గొప్పు
వీడ నూరక నవ్వు వెట్టినవ్వు
నేరొలిపట్టి విర్ర్త్రి చెక్కిలి నొవ్వఁ
గఱచి వాఁ డేర్చినఁ గౌఁగిలించు
పండునకి మెడఁ బుంజాలదండఁ దెట్టుఁ,
దెట్టు మెట్టెలు బిసు వంచుఁ దగి కళాదు
వనిత చిన్నారిపొన్నారివయసువాని,
విప్రనందనుఁ గన్నంతఁ జకలియునచు"

ఎడ్డెదనపుఁ గైసేఁ తలవా రీమె చెలిమికత్తెలు. నిగమశర్మను జూచినది మొదలు, పగలెల్ల పొలమున వలసి సొమ్మసిలెడి మగఁ డీమె మనసునకు నచ్చలేదు. తనకంటె కింపయి యుంటిన కంకుకెందళుకు లంగమునఁ గలిగి గృహమున నడ్డమాక లేక చరించెడి నిగమశర్మ యీమెచిత్తము నెత్తుకొనెను. స్త్రీవ్యసనము తీరనిదే మన నేరని నిగమశర్మ యీమెవలపులు తనయందే సమధిరూఢము లగుట నెఱింగి యూరకుండు టెట్లు?

"బళిరా! తేరకుఁ దేర దక్కె నిటు లీ
బంగారుకుం డెంచుఁ జం
కలు దాటించుచుఁ గెంపుమోవి కొడుకం
గా, గుబ్బపాలిండ్లు బి
ట్టలమంగా, ముఖగంధపారణము సే
యంగాఁ, గటీసీమ ను
త్పలపత్రాళి ఘటింపఁగాఁ దివురు మి
త్రద్రోహి మోహాంధతన్."

నెమ్మదిగాఁ గాఁపుకోడలితో రహస్యరతులకుఁ గడంగెను. పొంగులూరని ప్రేమ యీతని కింపు నింపదుగదా! స్వైరవిహారమున కచ్చట నవకాశము లేదు. జాతరలో నూరివారందఱును వ్యాపృతులై యుండఁగా సందుచేసికొని కాఁపుకోడలితో నిగమశర్మ యొక యరణ్యము చేరెను. అటఁ గొంతకాలమున కామె పరలోకమేఁగెను.

వెంటనే వానికొక చండాలాంగనాసంగాతము సంఘటిల్లెను. ఇది లోపించ చ్ఛదసచ్ఛవి; రూపాతీత. వానికి జాతిగుణరూపములు ప్రధానములు గావుగదా! వీనిదెట్టివిధమున స్త్రీవ్యసనము తీరవలెను. పై మెఱుఁగు లున్న గుణమే. లేకపోవుట యగుణము కాదు. వ్యసనమున మునిఁగినవీని కేవిధో కొన్ని మెఱుఁగు లామెయందుఁ గానరాకపోవు.

"సన్నపు పిక్కలుల్ గలుగు
చన్నులఁ బయ్యెదకొంగు వ్రాలఁగాఁ
గెన్నెరవీణె మోపి ప్రతి
గీల్కొన సారెకుఁ జక్కనొత్తి యు
ద్యన్నఖరప్రఘాతములఁ
దంత్రులు మీటుచు నాలపించు నీ
తిన్ననివొల్లు నా చెవులఁ
దేనియ లొల్కుచవుల్ దలంచెదన్."

ఈ చండాలతో నాతఁడు చాలకాలము గడపెను. అపవిత్రమైన పుత్రసంతానము గలిగెను. ఇంతకంటె మెఱుఁగులఁ జూపెడి మెఱుఁగుఁబోఁడి యాతని కచట కంటఁబడకుంటయే యామెయందుఁ దగిలియుండుటకుఁ గారణము.

నిగమశర్మ యిల్లాలు స్వీయ; కులశీలములు గల యువతి. బాహ్యయంత్రానుబద్ధమగు పెట్టెనలెఁ దన జీవితము నాతని జీవితమునకుఁ దగిలించెను; ఆతని తోడిదే తన బ్రదుకని నమ్మెను. రతి రసముగా మాఱుట కింతకంటె నుచితాలంబనము దుర్లభము. కాని నిగమశర్మ దుష్పృథభాజనమగు బాహ్యయంత్రము. తాను చెడుటయే కాక యామెనుగూడ దుఃఖముల పాలుచేసెను. అనంతర మాతఁడు వేశ్యాలోలుఁడయ్యెను. వీరు సామాన్యనాయికలు. వీరిప్రేమ యొకరియందు నియతము కాదు. పదిమందితోడి బాంధవ్యమున నొకరియందును పరిణుసనురాగము లేక తల్లోపము వల కారిబానులచేఁ బూరింతురు. వీ రాలంబనమున కనర్హులు గారు. కాని యుచితాలంబనములును గారు. వసంతసేనాకాద్రపకుల పట్లఁ దప్పఁ దాదృశమైన యనుబంధ మింకొక సామాన్యయందుఁ గానిపించదు. కావున వేశ్యాలంబనము రతికి గుణము కాఁజాలదు.

ఇఁకఁ గాఁపుకోడలు పరకీయ ; ఒకనిజీవితము నకుఁ దనజీవితమును దగిలించియు వాతసులమును ద్రెంచివేసి వానికంటెఁ గంటికింపైనవాఁ డని కేళీలోలుని వెంటఁ బరువెత్తినది. పరకీయాలంబనముగాఁ గల రతి రసముగాఁ బరిణమింపదు; అది నింద్యముకూడ నగును. పరకీయ తన విలాసములచే రతి నెంత పోషించినను నందలి ధర్మవైరుధ్యము పానకమునఁ బుల్లవలె సహృదయుల రసాస్వాదమునకు నడ్డుపడకుండ నుండదు.

అనంతర మొక చండాలవారాంగనారతికిఁ బాల్పడెను. ఈమె నాయికగా నుండుట కర్హురాలు కాదు. కావ్యమునందు బాహ్యశృంగారము వర్జనీయము. విభావానుభావసంచారిభావసంయోగముచేత రతి శృంగారముగాఁ బరిణమించును. ఇల్లుగట్టితనము పునాదిపై నాధారపడినట్లుల రతిపోషణము లాలంబన మూలము. ఆలంబనము యోగ్యమైన ననుభావ సంచారి భావములు విస్తరించును. అయోగ్యమైనచో ననుభావ సంచారుల కవకాశ ముండదు. అప్పుడు సామగ్రీలోపముచే రతి రసముగాఁ బరిణమింపఁజాలదు. గ్రామీణ నీచాదులు హావభావాదు లెఱుంగరు గావున వారియాలంబనమున ననుభావములకుఁ దావులేదు. చండాల వారాంగనాలంబనమునఁ జండాలకావున ననుభావ లోపము, వారాంగనకావున సంచారిలోపము కల్గుటచే రతిపోషణమున కవకాశములేదు. ఆలంబనానౌచిత్యము రసాభాసకారణ మని రసగంగాధరకారుని యభిప్రాయము

ఇది స్త్రీభ్రంశము.

విరాగియైనవాఁడు సంసారముతో సంబంధము వదలించుకొని శాంతి వాసించి సంఘమునకు దూరము గాఁ బోవ నమకట్టును; వానికి నగరమునకంటెఁ బల్లె యందును, బల్లెయందునకంటె నరణ్యమునను బ్రశాంతి దొరకును. సరాగియైనవాఁడు భోగముల కాసించి జన సంఘమును జేరవలయును; వాని కరణ్యముకంటెఁ బల్లెయుఁ బల్లెకంటె నగరమును సుఖదాయకములు. ఒకదానికంటె నొకదానియందు భోగము లెక్కువ.

పాపము నిగమశర్మ భోగముల కాసించియు నగరమునుండి గ్రామమున గ్రామమునుండి యరణ్యమునఁ బడెను.

నిగమశర్మనివాసము పీఠికాపురి. అది రాజధాని; సర్వభోగములకు నాకరము. వానియిల్లు వసతుల కెల్లతావలము. రాకపోకలు రాజమందిరమునకుఁ జేయుచుండెను. ఇఁక వేశ్యాలోలుఁడైనదిమొదలు నగరమున నందియు నింట నుండక వేశ్యావాటికలఁ గాలము గడపుచుండెను. ధనమంతయు వారికిఁ గొల్లపెట్టి యాసకించనుఁడై యూరిలో ఋణదాతలఁ దప్పించుకొను టకుఁ జాటుచాటునఁ దిరుగు దురవస్థకు వచ్చెను. తరువాతఁ బల్లెయందుఁ గాఁపునింటఁ గాఁపుర ముండెను. అటనుండి కాఁపుకోడలితో నరణ్యమున కేఁగెను. ఇది స్త్రీభ్రంశము ననుసరించి వచ్చిన స్థాన భ్రంశము. స్థానభ్రంశమువలన వీనికి నుదరభ్రంశము కలిగెను.

ఉదర మనుట నాహారభోగపరము. ఇతని గృహము భోగముల కాటపట్టు. భోగముల మధ్యయం దుండియు వాని వర్జించి యితని పూర్వులు వైదిక కర్మల నాచరించుచుండిరి. నిగమశర్మ వైదికకర్మల వదలి భోగములయం దనురాగము వహించెను,

"తలగడుగంగ మర్దనము
  ధౌతపటావరణంబు సంస్కృతో
జ్జ్వలకలమాన్నభోజనము
  చందనచర్చ ప్రసూనదామకం
బులు కపురంపువీడ్యమును
  భూషణసంతతులు కల్గి నిచ్చలుం
బులుకడుగంగఁ బడ్డను మ
  హత్త్వముఁ బోలుచు వాలుచుం బరికెన్"

స్త్రీవ్యసనమున వేశ్యావాటికలఁ దిరుగాడు చుండెను. తన ధనమంతయు వారికి నూడ్చిపెట్టెను. పొందుపట్టుల నప్పులు పొడిచిపొడిచి,

"మితి గడచిన ఋణదాతలు
  పతిపెట్టఁగ నూరు చోరక పలిపలి దిరుగన్
దతిఁ గూడు లేక యాఁకటఁ
  గుతిలపడు నతఁడు నుర్వకుత్సితతోడన్"

ఇప్పుడు వాని శోకదినము పండుగ, యొకదిన మొండుట. తిండి లేక కాఁగు లొండుటు, కావలసిన స్త్రీని వదలలేక, ఇంటి కేఁగినచో వాని కేమి[illegible]!

ఇంటికి రానుండ వద్దనువా రెవ్వరు? ఇట నాహార దారిద్ర్యమైచ్ఛికము, ఆహారముతో పాటు భోగములకుఁ గూడ దారిద్ర్యము కలుగుచుండెను. వేశ్యాలోలుఁడై నదిమొదలు భోగభోజనము లోకవిదితముగా లేవు. నిర్గమింక డైనతరువాత రెండును గోలుపడిన వనియే చెప్ప వచ్చును. మాఁడిమాఁడి యాఁకలికిఁ దట్టుకొనలేక యాకస్మికముగాఁ దింటికిఁ జలిదివంటకముఁ గుడువఁ జనుదెంచెను. వచ్చినవాని కక్కటితలు గలుగఁగాఁ జాలదినములనుండియు మైలపడిన బడుగుగావున వాఁ డున్న పాపకాంత యామె యానతిచ్చిన సద్బుద్ధి యాదరించినట్లు తేనెపూసిన కత్తివలెఁ గొంతకాల ముండి యొకనాఁ డింటఁగల సొమ్ములెల్ల హరించి పాఱిపోయెను.

ఇఁకఁ గాఁపునింట నున్న దినములలో నాతని తిండి కేమియు లోపము లేదు. కాని భోగముల కవ కాశము లేదు. కాఁపు నివసించునది యొకచిన్నపల్లె. తినుట కచ్చట సంస్కృతోజ్జ్వల కలమాన్న భోజన మెక్కడిది? వానికిఁ దనతోపాటే జొన్నన్నమో సజ్జన్నమో లోటు లేకుండఁ బెట్టుచుండెడివాఁడు. అది లేక నిగమశర్మ యచట నిల్చెను. ఇంతలో నాతనికోడలితో సంబంధము కలిసి స్వైరవిహారము నకై యామెతో నరణ్యమున కేఁగెను.

అక్కడ నుండుటకు సరియగు నిల్లులేదు, సరి యగు నాహారమును లేదు. భోగములసంగతి వేఱచెప్ప నవసరము లేదు.

"జిగురుకులువాలు లెస్సగఁ దంచి వెదురుబి
య్యముసు బువ్వలవలె నలఁచిలోవి
వార్చి డించిన క్రొత్తవంటకం బరిమాత్ర
ధాతశరావపాత్రమునఁ జాల
వడ్డించి పలువన్నె వన్యామిషంబులు
చుట్టువాఱఁగ నంచి చొక్కటముగఁ
గాఁచిన గురుసెయ్య చేచాఁచఁ జాలినం
తయుఁ గుమ్మరించి తత్తరకపూర
మొకయలాబుశలాటుఖండోదరమునఁ
బూన్చి యటు డించి తానును బొత్తుకలసి
పామిదస్తాన్నకబళముల్ సామి కొసఁగు,
నసుచుఁ జవు లెచ్చరించుచు నిసుగుఁబోఁడి"

తినుట కిపుడు సన్నవరిబియ్యమునకు బదులుగా వెదురుబియ్యము, వండుకొనుటకు రాగిగిన్నెకు నుత్తిగా నలఁచిలోవి, వడ్డించుకొనుటకుఁ జక్కనివియగు టాకులకు మాఱుగా శరావపాత్రము, రకరకములగు వ్యంజనముల కీడుగాఁ బలువన్నె వన్యామిషములు, హైయంగవీనమునకుఁ బ్రతినిధిగాఁ జొక్కటముగఁ గాఁచిన గురుసెయ్యి, చల్లగిన్నె కాదేశముగా నలాబు శలాటుఖండోదరము నుపయోగించుకొనుటను జూచిన నాతని భోగభోజన భ్రంశము మన కవగాహము కాఁగలదు. కాని వాని కీలోపము లన్నిటిని దీర్చెడి నాతి గలదు. ఆమె పామిదస్తాన్నకబళములఁ దనకొసఁ గి నసుచుఁ జవు లెచ్చరించుచుండఁగా వానికిఁ బ్రపంచ మునఁ గావలసిన దేమున్నది? స్వర్గసమము దీర్పఁగల స్త్రీగలదు. ఇంక నేఁటి రోటు పోయినను వాని కక్కఱ లేదు.

మనస్సుగదా మనుజుని సుఖదుఃఖములకు నివా సము! సుఖ సమయములందు దుఃఖించువారిని, దుఃఖ ములయం దుండియు సుఖించువారిని మనము చూచు చున్నాము. **"The mind is its own place and in itself can make a Heaven of Hell and a Hell of Heaven;"** సైతానునకే నిగమశర్మ శిష్యుఁడు కావచ్చును. గురువున కెంతపటిమయో శిష్యునకు నంతపాటవమే.

కాఁపుకోడలు మరణింపఁగా నాతఁ డొకచం డాల కాంతతోఁ గాంతార మధ్యమునఁ బూరింటఁ గాఁపుర ముండెను. కాఁపుకోడలితో దిసాళ్య మింటఁ గాన రాదు. ఇదివఱ కెన్నఁడు నొక్కచోటవతియం దీతని మనస్సు నిలుకడగా లేదు. ఇచ్చట నింతకంటె మెఱుఁ గులుగల నాతి లేకుండుటచేత నామె వల్లనిరూపము నిక్కమైన దని సంతృప్తిఁ జెందెను. సంతానముకూడఁ గలిగెను. పుత్రుల నీమెను పోషించుభారము మీఁద పడెను. ఇంతటిలో నాతనిభోగము లడుగంటెను. అను దినము వేటకేఁగి పెక్కు మృగములఁ జంపి కన్నిచ్చకు

వచ్చు పెక్కునంజాడులఁ జేవడించక కావడించి ప్రొద్దు తిరిగి యింటికి వచ్చుచుండెను. ఇప్పు డాతనికిఁ గేవలము మాంసమే యాహారము.

ఇది యుదరభ్రంశము.

నిగమశర్మ మోక్షాంతికము నుండి కామమునకును బడెను. అది మొద లుత్తమ వైదికకర్మల మాని కుత్సితకర్మ లంగీకరించెను. సత్వ సంపత్తికి స్వస్తి చెప్పి తామసము స్వీకరించెను. ఉత్తమ బ్రాహ్మణత్వ ముడివోవ మాలజాతి నాలింగనముఁ జేసి కొనెను. జాతి కుల శీల రూప గుణములుగల యిల్లాలి నొదలి చండాలరూపాశీవతో జీవము గడిపెను. సౌఖ్య నిధానమగు రాజధాని వదలి ఘోరారణ్యమున శరీర శ్రమ కురరీకరించెను. కలమాన్న భోజనమును గోలు పోయి మాంసాహార మాశించెను.

సంక్షేపముగాఁ జెప్పిన నిగమశర్మపతన మిది.

ఇంతటితో వానిపతన మాగలేదు. ఒకనాఁ డాతఁడు భూయిష్ఠములగు మృగములఁ దెగఁజూచి ప్రొద్దుగ్రుంకువంతకు నిజనివాసమునకు వచ్చుచుం డఁగా నిల్లంటికొని, చెడఁద్రావి యొకసెలయుంగక పడి యున్న వానిచండాలవనిత సపుత్రకముగా దగ్ధమగు టను గన్నులారఁ గాంచెను. కని పెంగందికనుఁగ్రంతల ముంతలఁ బోసినట్లు కన్నీరు గార్చెను. ఇప్పటియాతని దైన్యమును వర్ణించుటకు నంతంతమాత్రపుఁగవికి నలవి కాదు.

ఇలఁ జదికిలపడి పలుమఱుఁ దల
దోర్చు వికృత మగు వదనమున లాలా
జలములు తీఁగెలుసాగఁగఁ
బలుకు నతం డాలిసుతచి పరిచితరక్తిన్."

రామకృష్ణుఁడు దక్క యింత చక్కఁగా దైన్య స్వరూపమును గన్నులయెదుటఁ బెట్టఁగలవా రెవ్వరు?

చండాలస్త్రీ దగ్ధమగుటచే నితనికి స్త్రీనాశనమే గాక స్థాననాశము, ఉదరనాశముకూడఁ గలిగెను.

"అని తన యాలిని దనయా
లిని గని మఱికొని కుడువలేఁగూడు జలం
బును ద్రావలే ననుచు నన
శనమున నతఁడేఁగఁదొచ్చె జనరహితమహిన్."

ఇంతదైన్య మింతహైన్య మింతశూన్యహృదయ త్వము చండాలయందలి ప్రేమవలనఁ గాదు, గుణవతి యగు బ్రాహ్మణిని వదలి వేశ్యలను, తరువాతఁ గాఁపు కోడలి, ననంతరము చండాలకాంతను బరిగ్రహించిన నిగమశర్మకు నీచండాలయం దఖండానురాగము పొరలిపోయె ననిన నమ్మ కెట్లు? ఇప్పుడైన నొక యంగన యాతని నంగీకరించినఁ బరిగ్రహించుట కాతని యభ్యంతరము లేదు. అది యేదియు సంభవింపకుండుట వలనఁ బూరింపరాని వెలితి యాతని వేపించెను. జగ మంతయు జీర్ణారణ్య మయ్యెను. హృదయము శూన్య మయ్యెను.

వాని ప్రస్తుత దుస్థితి యనిర్వర్ణనీయము. సం సార మసార మని దానినుండి నివృత్తి లేదు గావున నది వైరాగ్యము కాదు. కోరికతో నొకకార్యమునఁ బ్రవృత్తి లేకుండుటచేఁ గామమును గాదు. సాధారణ మానవుని కుండఁదగిన వివేక మిదివఱకే నశించెను. ఇప్పుడు జంతువులకుఁ దగిన యంతర్జ్ఞాన ప్రవర్తనమైనఁ గానిపించదు. ఈక్రిందివాక్యములఁ బట్టి వాని యవస్థ యెట్టిదో చదువరులే యూహించుకొందురు గాక

"ఇట్లనుద్దిష్టప్రయోజనుండై బహుయోజ నంబులు నిర్భోజనుండు నిరంబుభజనుండునై యూకుజ నుండు పెక్కుదినంబు లరణ్యమునఁ దిరిగి నృసింహుని పుణ్యప్రదేశము ప్రవేశించి యొకనాఁడు.

"ఉడుగనిపస్తులఁ జెవులను
గడియలు వడ చేను వసఁక్కఁ గాలము గడవం
బడమిఁ బుడమివేలుపు వడి,
చెడి పుడమింబడియె విగతజీవుఁడు నయ్యెన్."

బ్రహ్మసాక్షాత్కారమందఁగలిగిన బ్రాహ్మణుఁ డుగా నుండి పడి పడి పశువునకంటెఁ బరమహీనుఁ డయ్యెను. ఇది యంతయు స్త్రీవ్యసనప్రభావము.

ఔరా! స్త్రీవ్యసన మెంత...

## 3

ఏకసంబంధిజ్ఞాన మపరసంబంధిస్మారక మను నట్లు నిగమశర్మజ్ఞానము సాధర్మ్యమునఁ గీచకాదులను, వైధర్మ్యమునఁ బ్రవరాదులను స్మృతిపథమునకుఁ దెచ్చుచున్నది. ప్రవరాఖ్యునిగూర్చి ముందు విపులముగా వ్రాయ నున్నను విరోధగుణ సామీప్యమున నిగమశర్మగుణయాథార్థ్యము స్పష్ట మగునని తలఁచి యుభయగుణములఁ బ్రదర్శించెదను.

నిగమశర్మ యనాచారసంతతి నవతరిల్లెను. ప్రవరాఖ్యుఁడు సద్వంశమున జననమందెను. ఇతఁడు సమగ్రకాంతిమహిమచేఁ జంద్రుని పెన్నడి, వనితామానసనూనసాయకుఁడు; అతఁడు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి. ఇతఁడు భూజనసన్మాన్య విశుద్ధవర్తనుఁడు; అతఁడు వివిధాధ్వర నిర్మలధర్మ కర్మదీక్షాపరతంత్రుఁడు. ఇతఁడు వాచాలత్వమున మత్తోత్కచుఁడు; అతఁడు భాషాపరశేషభోగి. ఇతఁడు నిగమములఁ జదివి నిగమశర్మ యను పేరు సార్థకము చేసికొనెను; అతఁడు నిగమములఁజదివి యనారతాధ్యాపన తత్పరుఁడు. ఉభయులకు దినుటకుఁ బెట్టుటకుఁదగిన భోగభాగ్యములు కలవు. ఇట్లు స్థితిగతులయం దిరువురు నొక్కఁ డయ్యు జ్ఞానసముపార్జనమున నిగమశిఖారహస్యము తెలియుటచే నిగమశర్మయే ముందంజవేసెను. కాని తారుణ్యమున నిగమశర్మమనసుఁ దార్తీయపురుషార్థమునకె తార్చి వేశ్యాలోలుఁ డయ్యెను. ప్రవరుఁడు కర్మనిరతుఁడై వైరాగ్యమున జేసి కాంతసేయు జారకామినులకు భోగబాహ్యుఁ డయ్యెను.

వేశ్యాలోలుఁడై నిగమశర్మ క్రమముగా

"ఉష్ణాన హోమాగ్ని నూదనొల్లఁడుఁ గాని
విరహజ్వరార్తుఁడై వెచ్చనూర్చు,
సంధ్యకుఁ బ్రార్థనాంజలి ఘటింపఁడు గాని
యెరఁగు నీర్ష్యాకషాయితల కర్థి,
వాగమవాదంబు లాఁగా దవఁడుగాని
విటవాదములు తీర్చు వేగ లేచి,
కంబుభృత్పాదోదకంబు గ్రోలఁడుగాని
యువతాధరసీధు వాని చొక్కుఁ,
బుణ్యచిహ్నంబు లపఘనంబున ఘటింప
సిగ్గుపడుఁగాని కరనఖశిఖరలిఖిత
జాతనూత్నక్షతాంకముల్ సమ్మతించు,
వారజము మీరి యాదుర్వ్యవహారహారి."

ప్రవరుఁడు కర్మనిరతుఁడై—

"వరజాతరంగిణీదరవికస్వరనూత్న
కమలకషాయగంధము వహించి,
ప్రత్యూషపవనాంకురములు పైకొనువేళ
వామనస్తుతిపరత్వమున లేచి,
సచ్ఛాత్రుఁ డనుచు నిచ్చలుఁ జేరి యర్ఘ్యోట
నఘమర్షణస్నాన మాచరించి,
సాంధ్యకృత్యము దీర్చి సావిత్రి జపియించి
సైకతస్థలిఁ గర్మసాక్షి కెఱఁగి,
ఫలసమిత్కుశకుసుమాదిబహుపదార్థ
తతియు నదికిన మడుఁగుదోవతులఁ గొంచు
బ్రహ్మచారులు వెంట రా బ్రాహ్మణుండు,
వచ్చు నింటికిఁ బ్రజ దన్ను మెచ్చి చూడ".

నిగమశర్మదురాచారములను వాని యక్క యీగతి నిరసించెను.

"పరమేష్ఠినుండి నీతరముదాఁక విశుద్ధ
తరమైనవంశంబు దలఁచవైతి,
దతిఁ ద్రొక్కి యున్న యాతల్లిదండ్రులఁ జాల
పలుచనై సంతోషపఱచవైతి,
వగ్నిసాక్షిగఁ బెండ్లియాడిన యిల్లాలి
నిల్లాలితాకార నొల్లవైతి,
ధర్మశాస్త్రార్థవిత్తముల విత్తములచే
నలరించి విఖ్యాతి నందవైతి,
శీల మఖిలంబు నిది పిల్లిశీల మనుచుఁ,
జదువు లివి యొల్లఁ జెల్కలచదువు లనుచుఁ
దోడివారలు నవ్వ నాతోడ! యేల,
చేల వైతివి యీగుణం బేల నీకు."

ఇఁకఁ బ్రవరాఖ్యునిసదాచారమును గవి యీగతిఁ బ్రశంసించెను.

యావనమందు యజ్వయు ధ
నాఢ్యుఁడునై కమనీయకాయక

శ్రీవిధిఁ గూఁకటుల్ గొలిచి
 చేసిన మూరిమిపోమిదమ్మ సౌ
ఖ్యావహమ్మై భజింప సుఖు
 లై తలిదండ్రులు గూడి జీవియుం
దేవరవోలెనుండి యిలు
 దీర్పఁగ.........గాఁపురముండి..."

ఒకనాఁడు హిమవంతమునఁ జిక్కి యిలు వోఁడఁ గొంత యాలస్యము కాఁగాఁ గర్మలోపమున కెట్లు పరితపించెనో చూడుఁడు.

"వేలిమియుఁ సురార్చనయు
 విప్ర సపర్యయుఁ జిక్కి భుక్తికిన్
వేళ యతిక్రమించె జన
 నీజనకుల్ కడు వృద్ధు లాఁకటన్
సోలుచుఁ జింతతో నెదురు
 సూచుచు నుందురు రాహితాగ్ని నేఁ
డూలు సమస్తధర్మములు
 తొయ్యలి! నేఁ డిలు సేరకుండినన్."

ధనాభావమునఁ దనకుఁ గల్గిన స్త్రీవ్యసనమును దీర్చుకొనుటకై యింటఁగల ధనమెల్లఁ దోఁచికొని పోవ నరణ్యమధ్యమున ని. శర్మ చోరాహతుఁ డయ్యెను. ప్రాణావశిష్టుఁడై డియున్న తన్ను దయతో నింటికిఁ గొనితెచ్చి యెడసేయక ప్రోచు కాఁపుకుమారుని భార్య తనయందు వ్యామోహిత యైనట్లు తెలిసినపుడు వీనికిఁ గల్గినమోదమునకు మేర లేదు.

"బళిరా! తేరకుఁ దేర దక్కెనిటు శ్రీ
 బంగారుకుం డంచుఁ జం
కలు దాటించుచుఁ గెంపుమోవిఁ గొఱుకం
 గా గుబ్బపాలిండ్లు బి
ట్టులమంగా ముఖగంధపారణము సే
 యంగాఁ గటీసీమ ను
త్పలపత్రాళి ఘటింపఁగా దివురు ని
 ర్త్రిద్రోహి మోహాంధతన్."

ఇంతకు వీనికి దొరకిన దెవరు? ప్రాణదాత, అన్నదాత, గురుఁడు, శిష్యుఁడు, మిత్రుఁడు, భక్తుఁడు, వాష్టుఁడునగు కాఁపుకుమారుని భార్య. ఆమె కాఁపుది. వేశ్యల విలాసములవలె నీమెవిలాసములు నాగరికములు కావు. ఎడ్డెరసపుఁగై నేఁతలవా రీమెచెలిమికత్తెలు. స్త్రీవ్యసనమాషితుఁడగు నిగమశర్మకు వావివరుస లతోఁ బనియేమి? తావలచినది రంభ; తా మునిఁగినది గంగ.

ఇఁకఁ బ్రవరాఖ్యుని వరించినది వరూథిని. ఆమె దేవతావేశ్య, నిత్యనూత్న విలాసిని. రంభోర్వశు లామె చెలిమికత్తెలు. ఆమెపొందు పాపపరామృష్టము కాదు. ఇట్లుండియుఁ దనపైఁగల తమకము నాఁపుకొనలేక యామె "ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁ బై యంచుల్ మోవఁగఁ గౌఁగిలించి యధరం బాసింపఁగా" వాధీరుఁడు "హా శ్రీహరీ! యంచు నోర మోమిడి తదీయాంసద్వయమ్మంటి పో మ్మంచున్ ద్రోచెను" వానిధీరత్వమునకు మెచ్చుకొని సాటోపముగాఁ "గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్?" అని వచించుట కల్లసానివాని కెంతయుల్లాసము కల్గెనోగదా!

క్రమముగా నిగమశర్మ యరణ్యముల పాలై చేయని పాపము లేక సౌఖ్యము లన్నియుఁ జెడిపోవ దిక్కులేనిచావు చచ్చెను.

ఇఁకఁ బ్రవరుఁడు ధైర్యముతో వరూథినిని ద్రోచివైచి "యువ్వనజగంధిమేని జవ్వాదిపస గదంబించు నొడలు గడిగికొని వార్చి" గార్హపత్యాగ్ని యనుగ్రహము వడసి యొక్క త్రుటిలో నిలు సేరెను.

ఇంద్రియలౌల్యమునకు నింద్రియనిగ్రహమునకుఁ గల ఫలవైరూప్య మిట్టిది.

"పరాచః కామా ననుయంతి బాలా స్తే
 మృత్యోర్యంతి వితతస్య పాశమ్
అథధీరా అమృతత్వం విదిత్వా ధ్రువ
 మధ్రువేష్విహ న ప్రార్థయంతే."
— కాఠ. అధ్యా ౨ వల్లి ౧.

౪

కృష్ణరాయలు తాను విష్ణుభక్తుఁడై విష్ణుచిత్తీయమును రచించి తనకాలమున వైష్ణవమతప్రచారమును విస్తారముగాఁ జేసెను. నాఁడు విద్యాగరిష్ఠులు

నైతె మానుతమం దభిమానము చూపినట్లు తెలియుచున్నది. అల్లసాని పెద్దన్న వైష్ణవాభిమానము కల్గి హరికథాసారము రచించిన ట్లవగతమగుచున్నది. అట్లే తెనాలి రామలింగఁడును మొదలు శైవాభిమానముచేత నుద్భటారాధ్యచరిత్రమును వ్రాసినను తుది వైష్ణవాభినివేశముచే రామకృష్ణుఁడై పాండురంగమాహాత్మ్యమును వ్రాసెను. ఇహపరముల సాధించుకొనుటకు భగవంతుని యనంతకల్యాణగుణములును, నాతని యాపన్నశరణ్యత్వము నీతని మనస్సున నెక్కియుండును. ఆకాలమునఁ బ్రబంధరచనను నూత్నమార్గములఁ ద్రొక్కుచున్నను భగవంతుని యపారకారుణికత్వమును బ్రదర్శించుట కీమాహాత్మ్యమును వ్రాసియుండును.

నిగమశర్మవంటి పరమపాపాత్ముని రక్షించెడు నా భగవంతుఁ డెంత కరుణాసాగరుఁడో యూహింపవలెను. భార్యాపుత్రులకై రోదనము సేయుచు సంగమతీర్థమునఁ గుంకులిడి పలుమాఱు తన్నుఁ జూచుచు నిరాశాభగ్నుఁడైపోవు నిగమశర్మ విపద్భారము మాడఁగనే భగవంతుని మనసు కరఁగిపోయెను.

వాత్సల్యముతో నాతని రక్షణమును సంకల్పించెను. విపన్మగ్నమువనే యభ్యుదయముకూడ మొదలుపెట్టెను.

"ఒకయింత యెప్పువేయక చూచుఁ దెఱవారిఁ
దలఁ గొట్టుకొని దుఃఖజలధి మునుఁగు,
బిలను తెలుపు మంచుఁ బృథివిలోఁ జొరఁబాఱు
సమధిక స్తంభోద్భవము గమించు,
తిరియువాఁడునుబోలె దెసలకుఁ జెయి చాఁచుఁ
దొరగునశ్రాంబుధి దొప్పఁదోఁగు,
హా! పోయితే! యని యఱచు భార్యగుఱించి
బహువిధాసక్తి విభ్రాంతిఁ బొందుఁ,
జేరఁగారాని దర్శనస్థితి వహించు
బాడబనూర్తిలోఁ గొన్నపగిది మండు
దానవారాతి కాఁబోని తదవతార
దశకమును మున్నె తాల్చె నాధరణిసురుఁడు"

మానవుని ప్రయత్న మేమియు లేక యనభ్రవృష్టి వలె భగవంతుని దయారసము వర్షించుచుండును. మానవుఁ డెంతపాపియైనను, భగవంతుని నామోచ్చారణ మొక్కసారియైనఁ గావింపకున్నను, జాలిగలతండ్రి బిడ్డ లెట్టివారైనను నారిమంచిచెడ్డల నాలోచింపక యాపదల కాదుకొనుటకై పరుగెత్తుకొని వచ్చునట్లు భగవంతుఁడును నిరాలంబుఁడై నిరవధికవిపన్మగ్నుఁడగు మానవుని పాపపరామర్శన మొనరింపక పరుగెత్తుకొని వచ్చును. విపన్మగ్నగజేంద్రునిరక్షణమునకై పరువులెత్తెకి విష్ణువు

"సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం
జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం
బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లము చక్క నొత్తఁడు వివా
దప్రోత్థిత శ్రీకుచో
పరిచేలాంచల మైన వీడఁడు గజ
ప్రాణావనోత్సాహియై."

కావుననే వైష్ణవులు "విపదః సన్తు నః శశ్వత్తాసు సంకీర్త్యతే హరిః" అని భగవంతుని శ్రీఘ్రానుగ్రహమునకై యాపదలఁ గోరుకొందురు. మనలో శైవవైష్ణవులు భగవంతునట్లు దయార్ద్రన విహారునిగా విశ్వసింతురు. ఆపదలలో నున్నపు డాపన్నునకు భగవంతుని యభయహస్త మాలంబనముగా గోచరించుచుండును. జీవిత మెంత దుస్సహమైనను నీయంధకారమున కావల వెలుఁగు కలదను నాశచే వాని నిరుత్సాహ మావహింపదు. వాఁడు చూరమున నున్నదనుకొను దివ్యజ్యోతికిఁ దన జీవితమంటఁగట్టి కృతకృత్యుఁడైనట్లు భావించుకొనును. ఈభావమే యమంగళ నాశింపక "శివాణి భద్రాణి పశ్యతి" యని మన జీవితమును మంగళాంతముగా ధన్య మొనర్చుచున్నది. ఈనాఁ డొక మానవుఁ డెంత పాపిగాఁ గానిపించినను మొదలు విశ్వశుద్ధబుద్ధముక్తస్వరూపుఁ డగుటచే వాని జీవితయాత్ర భగవదైక్యముతో విరతిఁ జెందు నని మనవారి యాశయము. ఉత్కృష్టజీవితప్రతిబింబములగు కావ్యములు వైతమందు వలననే మంగళాంతములుగా భారతసీమఁ గాన్పించుచున్నవి.

ఇఁకఁ బాశ్చాత్త్యులదృష్టి దీనికి విపరీతమైనది. జీవితమున కావలితీరము వారెఱుంగరు. మానవుఁడు పాపసంభవుఁ డనియు, వాఁ డొనరించిన పాపములు పశ్చాత్తాపముచేతను, శాశ్వతనరకానుభవముచేతనుగాక యింకొక మార్గమున నుపశమిల్లవని వారు తలంతురు. విశ్వఫల్గుత్వవాదము భారతీయులదైనను నిరాశావాదము (**Pessimism**) మాత్రము కాదు. నిజముగా నిరాశాభిముఖులు పాశ్చాత్త్యులే. అల్పపాపములు పశ్చాత్తాపముచేతఁ బరిహృతము లైనను మహాపాపములు ఘోరనరక మనుభవింపక యూరకపోవు. పాపాత్మునిపై విధి యేగడియనో విఱుచుకొనిపడు నని వారికిఁ దెలిసినను సామాన్యముగా మనుజుఁడు పాపాత్ముఁడగుటచేఁ దనపై నెక్కడ పడునో యని ప్రతిమనుజుఁడును వెఱగందుచుండును. గ్రీకునాటకములం దట్టి విధి (**Fate**) ప్రాబల్యమే ప్రదర్శింపఁబడినది. చరిత్రయందుఁ గూడ గ్రీకువీరులు విపన్మధ్యమున నాత్మహత్య చేసికొనినట్లు తెలిసికొనుచున్నాము.

పాశ్చాత్త్యులు పాపపరిహారమునకు నిహలోకాభ్యున్నతికిని భగవంతుని బ్రార్థింతురు కాని తానుభగవంతుఁడగుటను గాంక్షింపరు. ఆత్మైక్యమును గోరుమనల నది యసంభవ మని యధిక్షేపమును జేయుదురు. వారు భగవంతుని మానవదృష్టితోఁ దిలకించుటచే నాతని నిర్హేతుకజాయమాన కటాక్షము వారికి గోచరింపదు. పాశ్చాత్త్యులుకూడ భగవంతుని కరుణామయునిగా వర్ణించినను నాతని కారుణికత్వము ప్రదర్శించుపట్ల భారతీయులు పాశ్చాత్త్యులకంటె మిగిలి రనుట నిస్సంశయము.

నిగమశర్మ యెంత నిర్భాగ్యుఁడైనను శుభాయతివశమునఁ జావుదలకు నృసింహక్షేత్రమునకుఁబోయి తన యాలిని దనయాలిని దలఁచుకొనుచు నశ్రువులతోఁ బాటు నసువుల రాల్చెను. దిక్కు లేకుండం బడియుండుటచే నా శవముపైఁ గాకఘూకములు వ్రాలియుండఁగా, యమకింకరు లాతని యాతనాశరీరమును బంధించి బాధింపఁగా జడిసి దిశాక్రామన్నాదముగ నాక్రోశ మొనరించెను. నృసింహునిచే క్షేత్రవాసుల రక్షార్థముగా నిడ్డచక్ర మది విని విక్రాంతి వహించి యమదూతల దూరముగాఁ దోలెను. హరిభృత్యు లంతట గరుడవాహనమున నడపించుచుండ

"ఉత్తాలఫణిభుగ్గరుత్తాలవృంతాని
లాశాంతఘర్మంబు వఱియ్య మేయఁ,
ప్రత్యగ్రముక్తాతపత్రీభవచ్ఛేష
వారితాతప మరయ్యఁ జారుసూరి,
సూత్రవతీశదోస్స్వత్రదత్తావకా
శామరంబరయ్యఁ గటాక్షవిహృతి,
భృంగభర్మద్వ్యాజప్రభృతికృతస్వస్తి
వాగ్ఘరముఖరము లయ్యెఁ బార్శ్వతలము,
అరుణకిరణ సహస్రాభ మభ్రగంబు నగు
విమానంబుపై నెక్కి నిగమశర్మ
తీండ్రఁ బుణ్డ్రేక్షుకోదండు తండ్రిఁబోలి
...నాల్గుచేతులు గాంచన నలినమాలి
కలు నిడుదకన్ను లాస్యప్రభలు చెలంగఁ
బరమధామమునకుఁబోయెను.

ఔరా! రమానాథుఁ డెంత కరుణాసాగరుఁడు!

భగవంతునినుండి తప్పించుకొని పోవుటకై నిగమశర్మ యెంత ప్రయత్నించినను భగవంతుఁడు వాని వెన్నంటి పట్టుకొని యాపదలనుండి లేవఁదీసెను. తన లోకము నిచ్చుటయేగాక తన్నైన నిచ్చుటకుఁ బూనుకొనెను. అప్పుడైనను నిగమశర్మ భగవంతునిదయాను యత్వమును తలఁచియుండవచ్చును.

# ఏకవేణి

శ్రీ పులివర్తి శరభాచార్యులు

పవనడోలాయితములైన పర్ణతలము
లను దళాలు వాల్చి విరులెల్లఁ గునుకుఁజెందె;
ప్రకృతి శాంతిని మున్గె; నీరవ నిశీథ
మేన యొక్కర్తుకనె తెప్పలెత్తియుంటి.

వెన్నెలలుపుక్కిలించి నక్షత్రములందుఁ
దుంపురులు జిమ్ముచున్నదేదో చకోరి;
అండజంబుల కమృతంబు పిండువాఁడు
చిగురుఁబోఁడుల విరహాగ్నిఁ జెనకనేల?

ఆ కళానిధియైన యాహ్లాదకరుఁడు
వచ్చినాఁడని యెంతొ సంబరముతోడఁ
జదలపాన్పున మల్లెలు జల్లుచున్న
యీ నిశాకామినీశ్రమ నిచ్చగింతు.

మధుప వల్లభులం దమ మందిరములఁ
బవ్వళింపఁగఁ జేసి శర్వరులు ద్రోయు
పద్మినీలలామలకు నీ ప్రణయనిష్ఠ
సేకురుట యేపురాసుని శేష హార!

మనసు మఱపించి మురిపించి, మస్సృణగండ
తలములం దాఁగి యున్న ముద్దులు హరించి,
అధరరససంపదలను చౌర్యమొనరించి
యల్లనల్లనఁ బ్రియుఁడు 'మాయ'మయిరాఁడు.

దిగ్వలయచక్రమట్టు లందికొనరాక,
ప్రతిరవమువోలె దూరదూరముగఁజనుచు,
ఏకవేణిక నిట్లలయింప నేల?
ఈ శిరీషశరీర సహింపలేదు.

కళకళలాడు సౌరులని
గారములం దగు మావులం గవుం
గిళులఁ జెనంగివైచి గిలి
గింతలు పెట్టెడు సన్నజాజి తీ
వెల బడు పూలవానలకు
వేఁడుక లందుచుఁ బ్రేమపాయసం
బులను భుజించునాఁటి తల
పుల్ వలపుల్ మొలిపించు నాలకుఁ.

త్వష్ట్రకల్పిత నిూస్నేహపాత్రలోని
మర్మశిల్పమదేమొ ప్రేమరస మూరె;
రమ్ము నవమన్మథాకార! రాఁగదోయి!
ఈ తనూవల్లి కాలంబ మీయవోయి!
కంకణక్వణములను శృంగారగీతు
లను వినంగల వింక నాలస్య మేల?

---

# మనసు

శ్రీ కొడవంటి సూర్యలక్ష్మణరావు

సత్తిపాడు గ్రామం. గ్రామానికంతటికీ ఒక్కడే ఒక్కడు ఆయుర్వేదవైద్యుడు కన్నయ్య. తానేకాదు వంశపారంపర్యముగా తాతలనాటినుంచీ వస్తుండే వృత్తే అది అతనికి. అన్నిటికంటె యిరుకుపట్లు పాముకాట్లు నయంచేయడానికి ఆచుట్టుపట్ల అతన్నిమించిన చేయి లేదని ప్రసిద్ధి. అతనిపేరు పఠిస్తేనే పాములన్నీ పారిపోతాయని వాడుక. కులానికి మాలవాడైనా అతన్ని ఆగ్రామీయులంతా గౌరవపూర్వకంగా "దొరా" అనే పిల్చేవారు. ఆ వూళ్లోనే ధన్వంతరి ఔషధాలయమని, ఒక చిన్నగదిలో మందులుపెట్టికొని అందరికీ చికిత్స చేస్తుండేవాడు కన్నయ్యదొర. చేతనయినంత వరకు ఉచితంగానే సేవచేస్తూండినా, వారూ వారూ యిచ్చినడబ్బు న్యాయార్జితం గనుక కొంచెం నిలవేసి, వూరికో మైలుదూరంలో ఒకతోట కొనుక్కొని పాక కట్టుకున్నాడు. పిత్రార్జిత మేమీ లేదు సరికదా, స్వార్జితమైనా ఆ ఒక్కతోట, పాకమాత్రం మిగిలాయి కన్నయ్యకు ఆ యాభైయ్యోపడిలో. మొదటి భార్య చనిపోగా, సంరక్షణకు పనికివస్తుంది కదా అని రామి అనే పద్దెనిమిదేళ్ల పిల్లను తెచ్చికొని ఒక సంవత్సరంనుంచి తోటలోనే కాపురం పెట్టాడు. రామికి వేరే యింకెవ్వరూ దిక్కులేకపోగా అతని దగ్గరే వుండిపోవలసి వచ్చింది, యిష్టం లేకపోయినాను. ఇప్పటికి తనకి సంతానం లేదు. రామివాటం చూస్తే యికమీదట వుంటారని ఆశకూడా లేదు. వంశపారంపర్యంగా వచ్చిన యీ మాంత్రికవైద్యవిద్య తనతో ఆగిపోవలసి వస్తుందేమోనని బెంగపడేవాడు కన్నయ్య. పిల్లలు కలుగకపోతారా అని మళ్లీ తృప్తిపడేవాడు.

*　　*　　*　　*

అప్పుడే భోంచేసి కన్నయ్యా, ఆ వేళ వచ్చిన చుట్టం వీరయ్య ఆ చేలల్లోంచి గ్రామం వేపు నడచి పోతూంటే వాళ్లిద్దరూ కనుమరుగైందాకా వాకిట్లో చూస్తూ నిలబడింది రామి. మంచి వయసులో నుండి, నూనూగుమీసాల్తో, గిరజాలజుట్టుతో, బెంగాలీపంచ, క్రీపుజోడు, పూలీసిలుకు వుత్తరీయం ధరించిన వీరయ్యకీ నలభైఅయిదోయేట, తీక్ష్ణమయిన కళ్లతో, ముతకగుడ్డలు కట్టిన, మొగడు కన్నయ్యరూపానికీ రామికంటికి ఎంతో వ్యత్యాసం కనపడిం దాసమయాన్ని.

కన్నయ్యకైనా యేమంత పెద్దవయస్సని? అయినా తనకి అతనికి మధ్యనుండే వయోభేదాన్ని కప్పిపుచ్చటం తనవల్ల కానేరదనుకుంది రామి. సంవత్సరం నుంచి యీ నిర్జనప్రదేశంలో ఒంటరిగా యెల్లా కాలం గడుపుకు వస్తుందో తనకే ఆశ్చర్యమైంది. పగలంతా దొర గ్రామంలోనే ఔషధాలయంలో వుంటాడు. తానుమాత్రం యింటివద్ద ఆవును, తోటను సంరక్షిస్తూ దొరకోసం వేచివుంటూండాలి. తాను దొరను విడిచిపెట్టి వెళ్లలేదు. అతనిలో తన్ను లోబర్చుకొనే అతీతమైన శక్తి యేదోవుంది. లేకపోతే అతనిమీద యిష్టం లేకపోయినప్పుడు యింకా తా నాచోటనే యెందుకు కట్టుబడివుండాలీ? గ్రామంలో కన్నయ్య కున్నంతపలుకుబడి యింకెవ్వరికీ లేదు. అందరూ అతన్ని అపర ధన్వంతరిగా భావిస్తూ నోరార "దొరా" అని గౌరవిస్తారు. తనకూ ఆయనయందు గౌరవం వుంది. తానూ అతన్ని "దొరా" అనే సంబోధిస్తుంది. అంతే. మనస్సులో ఆయనయందు భర్తృభావం వుందో లేదో తనకే సందేహం.

భారంతో నిట్టూర్చింది రామి. అదే వీరయ్యనైతే తా నలా పిల్చేదీ! ఎంతో యింపుగా ముద్దులు మూటగట్టేట్టు "మామా" అని పిల్చుకోదూ? ఏమో, యింతకూ వీరయ్య ఎటువంటివాడో? అతడ్ని గురించి

తన కేమి తెలుసునని? అతడు కన్నయ్యదొర స్నేహితుడు కోటయ్య కొడుకనీ, ఏదో మందు తీసుకుపోవడానికని కన్నయ్య దొరవద్ద కొచ్చాడనీ, ఆవాళటికి ఇంట్లో భోంచేసి వెళ్లిపోయాడని మాత్రమే తనకు తెలుసును. అప్పటప్పట వచ్చిపోయే చుట్టాల్లో యితడెప్పుడూ రాలేదు కూడాను. ఇతడ్ని గురించి కన్నయ్యదొరైనా యెప్పుడూ తనతో ప్రస్తావించలేదు. ఏమైనా, యింతవరకూ భర్తవద్దకు వచ్చిన రోగుల్లో యింతమంచి రోగిని రామి చూడ్డం తటస్థపడలేదు. వయసుకాడు, తీర్చి దిద్దిన చందనపుబొమ్మలాగుంటాడు ఓరచూపులతో మనిషి. అతిచురుకుగాను నిలువెల్ల వుత్సాహంతోను కనిపిస్తాడు. ఇంక తన్ను తనవైపుకి లాక్కున్నా డనడంలో వింతయేముంది?అతడ్ని చూసింది మొదలు—యింతవరకు యెండి బీటలువారిన తన హృదయసీమలో కుంభవృష్టి కురిసినట్లైంది రామికి.

ఈ భావాల్తో రామిహృదయం రేగిపోయింది. అప్పటికే చాలావేళ అయింది. యింటిపనులు చక్కపెట్టుకోవాలని ఇంట్లోకి వెళ్లిపోయింది రామి. అప్పుడే కన్నయ్య వీరయ్య భుజించిన యెంగిలి కంచాలు యెత్తబోయింది. ఎంత ప్రయత్నించినా వీరయ్య నామరూపాల్ని మనస్సునుండి కదిలించ లేకపోయింది రామి. వీరయ్య అక్కడే ఒక్కక్షణం క్రితమే ఆ కంచంముందే కూర్చొని భుజించాడు. భుజిస్తూండినంతసేపూ అతడు తనతో మాట్లాడకపోయినా చూపులతోనే తన్నెన్నో విధాల పలుకరించాడు. ఒక్కసారి వంజులు వడ్డిస్తుండగా ప్రమాదవశాన్ని తన చెయ్యి వీరయ్యచేయీ రాపాడ్డంకూడా జ్ఞాపకం తెచ్చుకుంది రామి. ఆ భావం రాగానే నరాలన్నీ జువ్వుమన్నాయి. రక్తం అంతా వుడుకెత్తి ప్రవహించినట్లైంది. శరీర మంతా గగుర్పొడిచింది. తిరిగీ ఒక్కసారిగ అతడ్ని మరచిపోదామని ప్రయత్నించింది రామి. ఇప్పుడేమైతే మాత్రం ఏంలాభం? అత డెలాగూ వెళ్లనే వెళ్లాడు. తిరిగి ఎప్పుడైనా యికమీదట వస్తాడో రాడో? వెళ్లేటప్పుడైనా తనకేదీ సూచింపనైనాలేదు. ఇంతకూ తానాతడ్ని గూర్చి అనుకుంటున్నట్టు అతడు తనగురించి భావిస్తున్నాడో లేదో? తా నిప్పు డేమనుకున్నా లాభంలేదనీ, వెళ్లిపోయినవాడింక తిరిగి రాడనీ,యింక అతన్ని మరచిపోవడమే వుత్తమమనీ గట్టిగా నిశ్చయించుకొని, భావావేశంలోనుండి ఒక్కసారిగా తెప్పరిల్లి నడుం బిగించి యింటిపనులు చూసుకో తలపడింది రామి.

ఎంగిలి ఎత్తిపెట్టి కన్నయ్య దొర గది వూడ్చింది. అతనిబట్టలవీ సర్ది మడిచిపెట్టి నులకమంచంమీది చాప దులపబోయింది. క్రిందటి రాత్రి కన్నయ్య దొర మొలనుండి వూడిపడిన తాళంచెవి కాబోలు చాపనుండి క్రిందికి పడి చప్పుడైంది. రామి దాని నందుకొని అది దేనిదై వుంటుందా అని ఆలోచించింది. బహుశా అది కన్నయ్యదొర పెట్టెదై యుంటుంది. ఆ పెట్టె కన్నయ్యకు ప్రాణం. ఎవ్వరినీ దానిదగ్గరకు పోనీయడు. దాన్ని చూచేందుకైనా ఒప్పుకోడు. మూడుపూటలూ గ్రామానికి వెళ్లేటప్పుడూ వచ్చేటప్పుడూ తనతోనే, చేతులారా తీసుకెళ్లి తెస్తూంటాడు. ఆఖరుకి తన్నైనా దాన్ని ముట్టనీయడు. ఎంతైనా చేసుకున్న పెళ్లానికి చెప్పరాని రహస్య మందులో ఏముంటుందో? ఆవాళ వుదయమే గ్రామానికి పోయేటప్పుడు వీరయ్య అడిగాడు కూడాను—

"ఏం కన్నయ్యబాబూ! నీ కెందుకేటి బరువు. నీయెనకాల, ఆపెట్టెని నానే మోసుకొత్తాన్లే" అని. అయినా కన్నయ్యదొర అందు కొప్పుకోనేలేదు. చివరికి "పోన్లేరా యీరయ్యా! యియ్యాల దానిపని నాకట్టే సేదుసేరా యింటికాడే ఒగ్గేస్తాను" అన్నాడు కన్నయ్య.

"ఏటిబాబూ అందులోని యిచ్చింతేరం? నన్ను కూడా నమ్మకపోడాని కందులో సేటిగనకం వుందేటి?" అని అడిగాడు వీరయ్య అనుమానం తట్టి. "ఏటుంటా దీరయ్యా? ఏటుంటా దనుకుంటావు? మా వుంటే నా పాతికేల్ల ఆదాయం వుండితీరా అనుకుంటావు. అంతేనా యింకేటుందా" అంటూ వీపుతట్టి వీరయ్యను తీసుకుపోయాడు కన్నయ్యదొర.

తాళంచెవి దొరకగానే యీసంభాషణంతా తలపు కొచ్చింది రామికి. కన్నయ్య చెప్పిన చివరి

వాళ్ళం రామి చెవుల్లో గింగురు మందప్పుడు. "జొను ఆ పెట్లో యిన్నాల్లూ కూడ్డేసిన దనమంతా కన్నయ్య దొర దాచుకో నుండాల. నేకపోతే ఆరూ యీరూ మందుకనీ మాకుకనీ యిచ్చిన డబ్బంతా యాటవు తాది? అందుకే కాబోల యిన్నాల్నించీ నన్ను దానికేసి తేరి సూడనీనేదు దొర" అని అనుకుంది రామి. ఆ పెట్టె తనని బాగా ఆకర్షించింది. పెట్టె తీస్తే దొర యేంచేస్తాడోనని భయంవేసింది. తా సెనోసార్లు కన్నయ్యను కాళ్ళా వేళ్ళా పడి, పెట్టెలో నే ముందో చెప్పమని ప్రాధేయపడినా, దొర మాత్రం కళ్ళు రుముకూ "ఏటుంటే నీ కేమి నే! నోరుమూసుకో. అదంతా వారయిస్యం. నువ్వెంత నా దానివైనా, నీతో సెప్పకూడ్డు దాన్ని గూరిసి. సెప్తే నాకు నష్టమొద్ది" అని గదిమేవాడు. ఇప్పుడు సమయం చిక్కింది రామికి. పెట్టె యింట్లోనే వుందీ వేళ అదృష్టవశాత్తూను. తాళంకూడా చేకిక్కింది. ఇంక పెట్టె తెరవకుండా యెలా వుండగలదు? కన్నయ్యదొర అప్పుడే పైటికి వెళ్లాడుకూడాను. ఇక మధ్యాహ్నంవరకూ యింటికి రాడు. ఈలోగా తాను పెట్టె తెరచి చూసినా దొరకు తెలియబోదు. ఈ సమయం వృథాపోనీయకూడ దని, ఏమైతే కానీ, పెట్టె తెరచి చూడిం తర్వాతనే తాళంచెవి దొరకు యీయవలె నని నిశ్చయించింది రామి. నడుం బిగించి ఆ పనికి పూనుకుంది.

* * * *

వాకిట్లో చప్పుడైంది. వెంటనే రామి చీర మడతలో తాళం దాచేసి త్రుళ్ళిపడి లేచింది. గుమ్మం లో వీరయ్య నిలుచున్నాడు.

"అమ్మయ్యా!" అనుకుంటూ వేసిరపాటుతో "ఓస — నువ్వా?...మల్లీ యి...లాగ..." అని అన బోయింది రామి నేలకు చూస్తూ.

"వస్తా ననుకోనేదు కాబోల?" అని చిరు నవ్వు నవ్వుతూ, "అయితే, రామి నాసిలుకు వోనీ వుంచీ సుకోవా లనుకుం టేటి?" అని కళ్లెగరవేస్తూ అడిగాడు వీరయ్య.

"సిలుక్కావోణే?"

"ఆఁ! అదే! యిక్కడే దా న్నొదిలీసినట్టు గాపకం. పల్లె కెల్లిపోయాక తలుపు కొచ్చిం దా యిసయం. మా వూ రెలిపోతా నని, కన్నయ్యబాబుకి దండాలెట్టి సెప్పి, ఆ వూపున యెకాయెకీ, వోనీ తీసుక్కపోదామనీ పరుగులె ట్టొచ్చిసాను"

"అయితే యీడ కొస్తున్నట్టాఁగ..."

"సెప్పనేదు. కన్నయ్యదొరతో సెప్పనేదు. ఎందు కేటి సెప్పడం యీపాటి సిన్న యిసయానికి?"

రామి నవ్వుకుంది. "అయితే యీరయ్యా! నీ సొక్కాలో దాక్కోనున్న వోనీ యాడనుం చొచ్చింది?" అంది వ్యంగ్యంగాను.

"గయించినా! సంగతంతా సొష్టంగా గయించినా! అద్దిగదా ఆలాగుండాల తెలివంటే"

"సరేలే యిక సెల్లు వోనీ దొరికిందిగందా?" అంది రామి పైకి. మనస్సులోమాత్రం అత డింకా కాస్సేపు వుండాలనే కోరుకుంది.

"ఆఁ! యెల్దానికే వొచ్చానే. నిబద్దిగ సెప్తాం డాను – రాఁమీ నీకు సెప్పి మరీ పోదాఁవనే వొచ్చాను" అన్నాడు వీరయ్య.

"వోస్సి! అదా – మాదొర సెలవిస్తే మరి నా కెందుకనే. యెల్లు" అంది బాధగాను రామి.

"ఏటీ? దొరా? అవున్నే. నీపాపం. అడు సెప్పి నట్టు తిరక్కపోతే నీగ్గతెలాగనే? ఎద్దు మొద్దుగా నడిస్తే పాలికాపోడు కొట్ట కూరుకుంటాడేటి?" అన్నాడు వీరయ్య చమత్కారంగా.

"శివశివా! నేరు యీరయ్యా! వాదొర నన్నెప్పుడూ కొట్టెరగడు. ఏమన్నాయం పున్నాయం ఐనా నాదేనే – నీ కెందు కేటి పో." అంది కోపంతో రామి. ఇంతవరకూ వీరయ్య తప్ప యెవ్వరూ తన దొరని "అడు" అని పలికెరగరు.

"వోవోవ్! — పలికేవునె ద్దమ్మా పలుకు! — అడికి నీమీ దంతేమను సుండబట్టే కాబోలు ఆ...

పెట్టినన్నా ముట్టనీడు నిన్ను." వీరయ్య కొంచెం చనువుతీసుకొని రెండడుగులు ముందుకేశాడు. "రామీ! నిజెం సెప్పాలిసొస్తే ఆడు—మనిసా? — రాచ్చసుడు. సక్కని సుక్కలాంటిదానివి నిన్ను మనసి ఆడ్ని సూత్తే కాకిముక్కుకి దొండపండు కట్టినట్టుగుంది. నువ్వెంత సక్కంగుంటావని ఆ డెప్పుడైనా సూసినా? నీకళ్లు సూరియసంద్రుల్లాగ, నీలాలవాగ యింత జిగేలుమంటా యని ఆ డెప్పుడైనా నీతో సెప్పేడునా? నీబారెడు జుట్టూ సక్కంగా నెమలిపించం నాసుంటా దని ఆడికి తెల్సా? అయన్నీ నాకు తెల్సు. ఆటిమజా నానే సూడాల" అంటూ చటుక్కున రామి చెయ్యి పట్టుకున్నాడు వీరయ్య. అతని గొంతుక సన్నగిల్లింది. వుద్రేకంతో "ఆడు నిన్ను పేమించనేడు పిల్లా. అదంతా నాను సెయ్యాల. రామీ! నువ్వు నాదానివి కావాల. ఆడు నిన్నేలుకోనేడు. జోడుగుర్రాలమీ దెక్కించి నిన్నూరేగిస్తాను. నిన్ను నాదానిని సేసుకుంటాను. రామీ! నన్నేలుకోవూ" అంటూ ఒళ్లోకి లాక్కోబోయాడు వీరయ్య.

రామి పెనుగులాడుతూ "ఛీ పూరుకో! తిన్నింటికి వాసాలు నెక్కపెట్టడ మిదేగంద?—ఛా! ఏంబుద్ధి లియ్యి యీరయ్యా? పో అవతలకి నా దొరొస్తే డొక్క చీల్చేస్తాడు" అంది తెచ్చుకొన్న కోపంతో రామి.

వీరయ్య పకపక నవ్వాడు.

"ఎందుకమ్మీ అంత కోపమూ? ఆడేసా మేమ్మైనా దొంగలాడేను గనకనా? నువ్వాడి సొమ్మయితే గదా ఆడికోసం? ఆడివొస్తువు కానిదాన్ని తీసుకుంటే దొంగన నెవుడో డంటాడో రమ్మను" అన్నాడు వెటగారంగా వీరయ్య.

"కాద నేరు సెప్పగలు యీరయ్యా! మమ్మాటికి నేను క-న్న-య్య దొరకి పెల్లా......న్నే" అన్నది రామి తలవంచికొని. అయినా హృదయంలో నుంచి రాలే దామాట.

"కడంటా సాంతంగా యిను రామీ"...అంటూ రామిచేతుల్ని గుండెల కదుముకుంటూ, "నామనసు లోని మాట పైకి కక్కేసాను పిల్లా! నిన్ను యీడ యేరూ లేనిసోట యీ పాకలో సూత్తుంటే ఆ పంజరం లోనిచిలక వూసలకి రెక్కలు కొట్టుకుంటున్నట్టనిపిస్తాది. నీవొయిసా, సాలా సిన్నది. ఆ ముసిలోడితోటి నువ్వేటి మనవుతావు నే? సూడు నేను నిన్నెంచక్కా యేలుకుంటాను. వొయిసుపిన్నెలన్నీ నువ్వనుబవిద్దువుగాని. యే టిక్కడీ సచ్చినోడితోటి కాపరం? రా. నాతో సేచి రా. మరకట్టే అలెస్సెం సెయ్యక. నాకు తెల్సు నీకూ యిట్టమే నని. బేగి సెప్పేదో—అన్నీ యియ్యాలే రైటు కావాల" అన్నాడు రామి గడ్డం నిమురుతూ వీరయ్య.

"నేచిరాలేను యీరయ్యా" అంది రామి సందేహిస్తూ.

"ఆఁ! ఎందుకు రానేవు? వొస్తావు. రాగలవు వొచ్చితీరుతావు. నేకపోతే కలకాలం యీ సోట యీ అడివిలో బతుకుగల్దువా? పెపంచం అంతట్నీ సూడకుండాను. పెపంచకానికి నువ్వు కావాల నీసక్కదనం కావాల. నీసక్కదనం యీసోట కుల్లిపోకూడ్దు. ఎక్కడైనా అనుబవించాల. దానికి నాను తయారీ. మరకట్టే సూడకు బేగినీ సెప్పు. మళ్లీ ఆ వొస్తాడు.

కన్నయ్యదొరను తలచుకోగానే రామికి నవనాడులూ లాగేశాయి. భయంతో "వొద్దీరయ్యా! నన్నొదిలే సెల్లు నేను రానేను. దొరకాడే వుండిపోతాను" అని రెండుచేతులతో కళ్లుమూసికొని యేడ్చింది రామి. వీరయ్య రామిని అమాంతంగా చేతుల్లోకి తీసుకొని, తల నిమురుతూ గాఢంగా ముద్దెట్టుకున్నాడు. రామి మెత్తబడి అతడి గుండెలమీద కొరిగింది.

"రామీ, రామీ, నారామీ నువ్వునా రానివే" అని గుండెల కత్తుకున్నాడు వీరయ్య. రామికి శ్రవణానందమైంది. ఆ క్షణంలో సెలయేటి నిస్వనాన్ని, కోకిల కలకూజితస్వరాన్ని మించి వినిపించింది వీరయ్యగొంతుకామెకు.

"హాఁ! నామనసూ నీమీనే. నాపాపాలన్నీ నియ్యే" అని తల వాల్చింది రామి. ఒక్క క్షణంవరకు ఆనందసముద్రంలో వుండిపోయింది రామి.

"అయితే యిన్నాళ్లే మనిద్దరం వుడాయించి యేమాల? యిన్నాళ్లున్నుండి మనం సత్తెప్పమానంగా ఒకళ్లొకళ్లని కలిడిసిపెట్టి ఉండకూడ్దు" అన్నాడు వీరయ్య.

"నా మొగుడ్నెలా గిడిసిపెడ్తాను మాఁవా?" అంది రామి

"నన్నా? ఆడ్నా? అసూసె త్తకునే. నీ యిట్టం యేదో కానిచ్చి. ఆడిపని ఆడే మసక్కుంటాడునే. బాదపడకు."

"నేదు మాఁవా! కన్నయ్యదొర సంరచ్చనకో ఆపదుండాల మాఁవా" అంది గద్గదికతో రామి.

"ఓలబ్బ! ఆడ్నేఁ ఎరగడేటి? ఇప్పటికే నీతో టిద్దరయ్యారుగందా? ఇక మూడోవాన్ని ముడెట్టుకుంటాడ్లే నీకేటి. ఆడికేకాదు నాకూ కావాల్సా ఆడని. నాకు నువ్వే కావాల" అన్నాడు వీరయ్య.

రామి నిట్టూర్చింది. ప్రేమపురస్సరంగా వీరయ్యకు పెదవు లందిచ్చింది.

"ఇదుగో నాగ్యేపకానికి సిల్కువోనీ తీసుకో. రాతిరేల నువ్వొచ్చేటప్పుడేదైనా మూటకట్టుకోడానికి పనికొస్తది. నే నిప్పుడెళ్లిపోతాను. ఆ ద్దొచ్చి యేమాలయింది. అద్దరేతిరికాడ అల్లదిగట్లో ఆ పెద్దమర్రి సెట్టు కాడికొచ్చి నీకోసం కాసుక్కుసుంటాను. ఆడునిద్దరోతుంటే సడినేయకుండా సల్లంగా జారొచ్చి. కొంచెం పిసరా పిప్పి యాదైనా వుంటే తెచ్చినే. కొన్నాల్దాకా కాస్తాది. తరవాత నా మువ్వానే. నీకే యిబ్బందీ రాదునే ... మరి నే నెల్తన్నాను. నే సెప్పిన వన్నీ మరిసిపోకే" అంటూ మారుమాటాడకుండా రామిని ఒదిలి ఒక్కపరుగున వెనక్కి తిరిగిచూస్తూ పారిపోయాడు వీరయ్య.

రామి కేమీ పాలుపోలేదు. వీరయ్య పొలాల గట్లు దాటి పోతూంటే రిచ్చవడి చూస్తూ వుండిపోయింది. ఇంతవరకు వచ్చాక వీరయ్య తిరిగి వస్తాడో రాడో అన్న సందేహం లేకపోలేదు రామికి. అప్పటికే అతన్ని తిరిగి పిల్చి తాను దొరను విడిచి రాలేనని చెప్పాలనుకుంది. అప్పటికే మనస్సు మార్చుకుంది. అయినా వీరయ్యను తన మనస్ఫూర్తి, నిలువునా, యెంతో ప్రేమించినా కన్నయ్యదొరను మోసగించి వెళ్లిపోవడం తన కెంతైనా దుస్సాధ్య మనుకుంది. ఒకప్రక్క యిష్టం లేకపోయినా బలవంతంమీద అతి సన్ననిగొంతుతో వీరయ్యదిక్కుకు చేయి జాపి మెల్లగా "యీ రయ్యా! మాఁవా! నేను... నేను దొరను యిడిసి రాలే..." అని చతికిలబడింది రామి. వీరయ్యకామాట లేపీ వినపడలేదు. వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ నా మాట మీరకుమీ అని చేత్తో సూచిస్తూ ఆ తోటల్లో పడి మాయమైపోయాడు వీరయ్య.

* * * *

కన్నయ్యదొర ప్రొద్దు పోయాక వచ్చాడు యింటికి. రాగానే తాను వుదయం విడిచివెళ్లిన సందుగుపెట్టె యథాస్థానంలో వున్నందుకు సంతోషించి, రామితో "అమ్మీ! నా నేటి కల్లి నీలోనే కో నొస్తానే. యింతనో నే యాదేనా మాటిలో కఁవిర్సి పెట్టు" అని చెప్పి స్నానానికి పోయాడు కన్నయ్య.

ఇంతవరకు వీరయ్య ప్రేమసముద్రంలో మునిగిపోయి రామి పెట్టెసంగతే మరచిపోయింది. యిప్పుడైనా యేమంత మించిపోయింది? దొర యెలాగూ స్నానాని కెళ్లాడు; యింతలో పెట్టె తీసి చూడవచ్చునని, కన్నయ్య అవలి గదిపలో కాలిడిందే తడవుగ, రామి తాళంచెవి పైకి తీసి పెట్టె తీయ బూనుకుంది. సరి. తాళం తీసి పెట్టెమూత దరుత్తతో తూండేసరికి యెక్కడినుండో కన్నయ్య వూడిపడి ఘర్జిస్తూ పెట్టెమూత తీస్తున్న రామిచేతి నొక్కపెట్టున కాలితో తన్ని "ఓసి ముండా! యెంతకైనా తగుదువే నువ్వు! కుడుసుకోడానికేదేనా సుడ్డెత్తుకు రావాలాని, సఁవెయ్యాని కొచ్చాను గావట్టి సరిపోయింది లేకుంటే యీపాటికే కైపై పానో. నీ కెక్కడి తెగులొచ్చిందే పావో ముండా. దానిరేపు నూడకే నూడకే అని అన్నాల్నుండి సతపోరు గడ్తున్నా యినిపించుకోకుండా, నాకు లేని సఁవెయం నూసి అందులో నేటుందని దొంగలాడదాఁ మనుకున్నావే సంజా!" అంటూ కళ్లు

రుసుతూ ఒక్క పెట్టున పెడబొబ్బ పెట్టాడు కన్నయ్యదొర.

దొర తాపుకు రామి ఒకమూల బోరగిలాబడి వెక్కి వెక్కి యేడ్చింది. వణుకుతూ ఆమూలనే నక్కి కూర్చొని "నేను దొరా! నాకేమీ దొంగలాడాలని లేదు. ఇందా కిల్లాడుస్తుంటే యీ తాలం చెవి దొరికితే అది యీ చందుగు పెట్టెదో కాదో చూసి అయితే నీకిచ్చేయాల్ననుకుంటన్నాను దొరా! ఇంకేమీ దురు బుద్ధి నాకు లేదు దొరా" అంటూ యేడ్చింది రామి.

కన్నయ్యదొరకు కడుపు కరిగింది. రామి నెప్పుకోగా తానం లేనిమాట లనలేదు. పైగా ఆమె ప్రేమ సంపాదించడంకోసం ఎన్నోవిధాల ఆమెను లాలించే వాడు. ఈ వాళకూడా నిజానికి రామిగురించే తానింత కాఠిన్యం వహించవలసి వచ్చింది. మళ్లీ యిలాగన్నాడు కన్నయ్యదొర — "రామీ! పోన్లే అయిం దేదో అయింది, యేడవబోక. మరి నీ కెన్నిచాట్లు సెప్పినా నీవరికి పెట్టె తీడానికే తలిసావు. అందుకే నాకు కోపం వుండబట్టక యేదో మాటన్నాను నొచ్చుకోక. యెళ్లి బేగి నీవొంట సెయ్యి. తానం నేసి వూస్నేపట్లో వొస్తాను. లే; తాళం లే—" అని తాళం పుచ్చుకొని తిరుగ పెట్టెకు తాళంవేసి తాళంచెవి మొలకు కట్టుకొని యేటికి స్నానానికి పోయాడు కన్నయ్యదొర.

ఆవేళ దొర తన్నం లేసి మాట్లాడు తుంటే రామి కాతనిపై మనసు విరిగింది. అసలే వీరయ్య కొంత మతి విరిచాడు; దాని కీ యీదంతం దోహద మయింది. దొర యెన్నిసార్లు లాలించినా ఆ లాలనలో రామి కా సమయంలో ఆలోచిస్తే అసహ్య భావం కలిగింది. ఆ ముసలిని మాయంచేసి తప్పించు కోవాలనే దృఢనిశ్చయం చేసుకుంది. గీరుకుపోయిన చేతిని చూసుకుంటూ వంట చేయబోయింది. వండు తూండినంతసేపూ తనకు వీరయ్యపైనే మనస్సు. ఇంతవరకూ తన మనస్సులో దొరకు అన్యాయం చేస్తున్నానేమో యనే ధర్మసందేహం కొట్లాడు తుండేది. ఈ దెబ్బతో అది పటాపంచ లయింది. దొర తనయందు క్రూరంగా జంతువువలె వర్తించాడు. తాను నిజానికి దొంగతనం చేయ తలపెట్టకపోయినా

తనమీద నిందారోపణ చేశాడు. ఇదివరకటి దొరమీది తనకృతజ్ఞత అంతా యీపెట్టున అసహ్యంగాను పగగాను మారిపోయింది రామికి.

"ఏం పిల్లా చెయ్యి గీరుకుపోయిం దేటి? పాపం! మాన రాసి మంతరిస్తానులే బయం లేదు" అన్నాడు కూడాను కన్నయ్య రాత్రి భోంచేస్తూ.

"అక్కర్లేదులే దొరా మాదొడ్డోడికి" అని విసురుగా పలికింది రామి. పాపం! కన్నయ్యదొర మనస్సులో యెంతగా విచారించాడో.

ఆవేళ రాత్రి రెండు ఝాము లైంది. అలసిసొలసి కన్నయ్యదొర నిద్రపోతున్నాడు గురకపెడ్తూను. రామి సడిచేయకుండా లేచి చేతిదెబ్బకు కట్టు కట్టుకుంది. ఆ బాధలో ఆమె దొరను ఎన్నైనా తిట్టి పోసింది. ఆ సమయంలో అతని కెంత ద్రోహమైనా చేయతలపెట్టింది. ఈ యింట్లో యీ ముసలోడికి కట్టుబడి తానేమీ సుఖ మనుభవించలేనని తలపోసింది రామి. ఇంకొక్క క్షణంలో తనవీరయ్యతో యెనలేని సౌఖ్యం చూరగొంటానుకదా అని వువ్విళ్లూరింది.

వెంటనే లేచి సవ్వడి కాకుండా పెరటివాకిలి తెరచి, వుత్తచేతులతో పైకి పోయింది రామి. ఆఖరు సమయంలోనైనా, దొరచే తాను దొంగనని నిష్ఠూర్యం పడడం రామికిష్టంలేకపోయింది. అందుకే ఆ యింట్లో నుండి ఒక చిల్లిగవ్వైనా తనవెంట తీసుకుపోలేదు. ఇంటినుండి బయటబడి, చివరిసారి — ఒక్కసారిగా యింటివైపు మనసారా చూచి, తాను చేతులార పెంచిన గోమాతకు అక్కడినుండే నమస్కరించి, వెనుదిరిగి, శుద్ధవెన్నెలలో భయంతో మెల్లగా అడుగు లిడుతూ నిర్ణీతస్థలం చేరుకుంది రామి.

ఆ మర్రిచెట్టువద్ద వీరయ్యజాడ లేవీ అగుపడ లేదు రామికి. ఏమో తాను ముందు వచ్చిందేమో. ఇంతకూ వీరయ్య కాలనిర్ణయం చేయనేలేదు. ఎప్పటికైనా వీరయ్య రాకపోతాడా, తామూ వీరయ్య కలిసి చిలకా గోరింకల్లా అడవుల్లోనుంచి ఎగిరి పోక పోతామా అన్నధైర్యంతో రామి ఆ చెట్టుమొదల్నే కూర్చొని వీరయ్యకోసం నిరీక్షింప దలచుకుంది. కొంతసేపయ్యాక ఆ సుడిగాలులలో తన కేదీ కన్పించక

పోయినా ఏవో మనుష్యులు నడిచిన చప్పుడుమాత్రం అయింది

"మామా! మామా! ఇక్కడనే నిక్కడే వున్నాను" అని మెల్లగా పిల్చిందికూడాను రామి. అయినా జవాబు రాలేదు. రామి ధైర్యం విడువలేదు. ఆ రాత్రంతా మెలకువతో వీరయ్యకోసం వేచివుండా లనుకుంది. కాని ఆ వేళటి మనస్సు రాపిడిచేత రామి అట్టేసేపు తెలివిమీద వుండలేకపోయింది. కాస్సేపటిలోనే, ఆ చెట్టుమొదలుకే తలచేర్చి, ఆ శిశిరరాత్రిలో అక్కడే నిద్రపోయింది.

* * *

తిరిగీ మరుసటిఉదయముననే మంచుకు బిగిసి తెలివొచ్చి లేవగల్గింది రామి. తా నెంతసేపు నిద్రపోయిందో తనకే తెలియదు. అయితే వీరయ్య రాలేనట్టే; మరి రాడని ధ్రువపర్చుకొంది. అతని యిన్ని ప్రేమాలాపాలూ వట్టిపోల్లులేనా? అతనిచెప్పినవన్నీ పరాచికాలేనా? అతని సూచనలన్నీ కట్టుకథలేనా? "ఏం మొంగోడు!" అనుకుంది రామి. ఇంతా అతన్ని నమ్మి మోసపోయినందుకు తగినశాస్తి అయిం దని తన్ను తాను నిందించికొంది. అప్రయత్నంగా యేడుపు కమ్ముకు వచ్చింది రామికి. ప్రపంచమంతా తన్నింక వేలెత్తి హేళన చేస్తుందని భావించుకొంది. తన జీవితంలో తీరనిమచ్చ తెచ్చిపెట్టికొన్నందు కెంతో దుఃఖించింది. ఇక లోకంలో తలెత్తి తిరగడమెట్లో అని భయపడింది. ఒక్కసారిగ తన తప్పిదమంతా కళ్ల ముందు తాండవించింది. ఇంత కృతఘ్నురాలనే నాకింక పుట్టగతు ల్లేవని వలవల యేడ్చింది రామి.

ఇప్పుడు తా నేంచేస్తుంది. తనకు తెలియకుండా కన్నయ్యదొర తన్ను వెంబడించి సంగతంతా యీపాటికే గ్రహించివుంటాడు. ఏమో అతడు వెంబడించలేదేమో! తనగుట్టింకా బయటపడలేదేమో! ఇంటికి పోతేనే మంచిదేమో! అతనికి తెలిస్తేమాత్ర మేమి, పాదాలమీద పడి తనతప్పు మన్నించమని ప్రార్థియపడితే ఆ మాత్రం క్షమించకపోడు మహానుభావుడు కన్నయ్యదొర. పోనీ క్షమించక చావమోదినా ఫరవా లేదు తనతప్పుకు తగినశాస్తి అవుతుంది. ఇక్కడ వుండి వల్లకిమోళ్లలోనూ పడేకంటే మొగుడిచేతుల్లో చస్తే పుణ్యమైనా వస్తుందని అనేకవిధాల ఆలోచించి రామి చివరకు యింటికే పో నిశ్చయించింది

లేచి అడుగుల్లో అడుగులు వేసికొంటూ రామి మెల్లగ యింటిదారి పట్టింది పొలాల గట్లమీదనుండి. రామిమనసు మనసులో లేదు తనుచేసిన ఘోరానికి. గాలికి కదలిన చెట్లకొమ్మలుకూడ తనవిషయమే గుసగుసలాడుకుంటునట్టు తోచింది. కప్పలు బెకబెకలాడుతూ తనవర్తనను చూసి పకపక నవ్వుకుంటునట్టు తోచింది. చివరికి అస్తమించు చంద్రబింబంకూడా తన నడవడిని శంకించి వెలవెలబోయిం దనుకుంది రామి. దూరాన్నుండే తనయింటిని- తిరిగి యెప్పటికై కలలోనైనా చూస్తా ననుకోనియింటిని తిరిగీ రామి చూచింది. సందెలు దడదడా కొట్టుకున్నా యామెకు. ఇల్లుమాత్రం యెప్పటిలాగునే ప్రశాంతంగా వుంది. రామి యింటిచేరువగా నడిచింది. అన్నీ - పరిసరాలన్నీ సలక్షణంగానే వున్నాయి కాని యింటితలుపుమాత్రం బారలా తీసివుంది. తాను వెళ్లినప్పుడు తలుపు దగ్గరగా వేసి పోవడం తనకు బాగా జ్ఞాపకముంది. అయితే యిప్పు డెందుకు తెరిచివుండాలి? దూరాన్నుండే తలుపుసవ్వడి యిప్పుడే తాను వినిందికూడాను. ఏదో ముప్పును శంకించింది రామి. బహుశా దొరయే తన్ను వెతకడానికని బయటికి వెళ్లాడేమో. ఒకవేళ మరిచిపోయి తానే తలుపుతీసివుంచిందేమో? అలాగయితే భయమే లేదు. తాను చప్పుడు లేకుండా యెప్పటియట్లే యింట్లోకి పోయి యేమీ జరుగనట్టే వుండవచ్చు. ఈ ఆలోచనతో రామి త్వరగా యింటిగడప యెక్కింది. లోపలనుండి వుచ్ఛ్వాసనిశ్వాసాల్ని చెవుల్నిక్కపొడిచి "విని అమ్మయ్య బతికాను రా దేవుడా!" అని దేవుడి కనేకధన్యవాదా లర్పించి, యింక తనగుట్టు వెల్లడికానందుకు, దొర యింకా లేవనందుకు ఎంతో సంతోషించింది. అయినా సందేహం మాత్రం వొదల్లేదు రామిని. ఆశ్వాస సాధారణమైందిలా వినబడలేదు. కొంచెం బరువుగానూ, కోరివుండి పట్టిపట్టిపేల్చుతున్నట్టూ వినబడింది. రామిగుండెల్లో రాయి పడింది. ఏమో కన్నయ్యదొర తన్ను పరీక్షించడానికి కలతనిద్ర అభినయిస్తున్నా డేమో. ఏమైతే కాని

తెగించి లోనికి పోయింది రామి. గదంతా చీకటిగా వుంది. గదిగుమ్మంవద్దనే యేదో కాళ్లకు తగిలి పడి పోయింది రామి. మోకాళ్లమీద లేచి తడివిచూసి ఆదో కమనిషి శరీర మని పోల్చుకొంది రామి. వెంటనే భయంతో ముచ్చెమటలు పోశాయి. కెవ్వునకేకవేసి కళ్లుమూసుకోబోగా చేతికి అంటిన జిగటరక్తం తడి తడిగా తగిలింది రామికి. తిరిగీ తడిమి చూచి దెబ్బ తిని పడివున్నది కన్నయ్యదొరే అని తెలుసుకుంది రామి. ఇల్లంతా తడిమి వెదికి దీపం వెలిగించింది.

కన్నయ్యదొర శవంచుట్టవలె ద్వారాని కడ్డంగా పడివున్నాడు. ఇంకా వుచ్ఛ్వాసనిశ్వాసాలు బాగానే వున్నాయికాని, తలమీద బలమైన గాయం తగిలిందని గ్రహించింది రామి. సాయానికైనా చుట్టుపట్ల మైలు దూరంలో యెవ్వరూ లేరు. తానొంటికత్తె అసహాయ రాలై భయంతో యిల్లంతా కలయజూచింది. వెంటనే పందుసపెట్టె యథాస్థానంలో లేకపోవడం గ్రహించింది రామి. వెంటనే జరిగిన కలాప మంతా కళ్ల కట్టింది. అందుకే, ఆ పెట్టెలోని, తన కన్నయ్యదొర సర్వ స్వాన్ని, అపహరించడానికే ఆ దొంగముండా వీరి గాడు వలపు నెపాన్ని తనమీద మచ్చుమందు చల్లి రాత్రివేళ బయటికి పంపించి, సమయం చూసి కన్న య్యను గాయపరచి తాళం లాక్కొని పెట్టెతో వుడాయించి వుంటాడని గ్రహించింది రామి. వీరయ్య తన కిచ్చిపోయిన సిల్కువోణీ ముక్క ముక్కలుగ చించి నీటిలో తడిపి కన్నయ్యదొర గాయాన్ని కడి గింది రామి. కసితీరా వీరయ్యను శపించింది. తన మాంగల్యమే శుభప్రదం కావాలంటే వీరయ్య — తన్నింత వంచించిన వీరయ్య—తన సంసారా న్నొక్క క్షణంలో సర్వనాశనం చేసిన వీరయ్య నెత్తురు కక్కి చావా లని శపించింది. కోపంతో రోమరోమాలా కంపించిపోయింది రామి.

తన దొర నష్టం ఆలోచించింది. ఇన్నేళ్ల పాటి రెక్కల కష్టమూ ఆ నాటితో వృథాపోవడం తనమూలాన్నే — తన స్వార్థపరత్వాన్నే — తన మాయదారిబుద్ధిమూలాన్నే. తన్ను ముక్కలుగ కోసి నా పాపం లేదు. దొరను చూచేసరికి రామి కేడు పాగలేదు. కన్నయ్యదొర తలను తొడపైకి తీసికొని చీరచెరగుతో విసరుతూ దొరముఖంపై పే నిదానించి చూస్తూ నిరీక్షించింది రామి. ఆ మూతపడిన కన్నుల్లో— పెదవుల వంపులో—యెంతో ప్రశాంతత కనుపడింది రామికి. ఆవేళ సాయంత్రం తప్పించి యెప్పుడైనా దొర తన్ను కసిరేనా? ఎన్నివిధాల తన్ను లాలించి పాలించే వాడు? "రామీ! నామీద నీ కెప్పుడు దయ కలు గుద్దో" అని ఎన్నిసార్లు తన్ను గడ్డంపట్టి ప్రాధేయపడే వాడు? తా నెప్పుడైనా తన్ని భర్తవలె గౌరవించిందీ? తా నెంతపాపాత్మురాలు? అటువంటి సద్గుణరాశికి తానుభార్యగా వుండడానికన్ని నోములు నోయాలి? అయినా ఆ సంవత్సరంపాటు దొరని చులకనగా చూసి నందుకు తనకే శిక్ష విధించాలి! అయినా తానుమాత్రం ఆయన్ను వదలివుండగలిగిందా? దానికి కారణ మే మై వుంటుందో తాను కొంచెమైనా ఆలోచించిందీ? తన మలినముఖాన్ని దొర కేవిధంగా చూపుతుంది? దొర విషయమై ఆలోచిస్తూంటేనే రామికి ఆయన మీద అవ్యాజప్రేమ అంకురిస్తూ పెరుగుతూంది. తన పొరపాటుకు లోలో నెంతో కుమిలిపోయింది. మన స్సులో దొరపవిత్రనామాన్ని సహస్రజపం చేసికొంది.

నెమ్మదిగ దొరతలను తనతొడపైనించి కదుముకొని "దొరా! నాదొరా!" అని యెన్నోమార్లు పలవించింది రామి. హృదయంలో ఆతనినూర్చి యమయాతన ననుభవించింది. తనభర్తను—తన కన్నయ్యదొరను శీఘ్రంగా ఆరోగ్యవంతుని జేయు మని మనస్సులో వేయిదేవుళ్లకు మొక్కుకుంది. గొంతుకలో గాద్గదిక పుట్టింది రామికి ఆవేశంలో. కళ్ల వెంబడి నీళ్లు జలజలా రాలాయి. వణుకుతూన్న పెదవుల్ని కన్నయ్యదొర ముఖాన్ని అన్ని వలపలా రుద్దింది రామి.

దొర కదిలాడు. కళ్లు విప్పి రామి కళ్లల్లోకి చూశాడు.

"ఏం అమ్మీ! అలా యేడుస్తూండావు?" అని హీనస్వరంతో అడిగాడు కన్నయ్యదొర.

"దొరా! యీ పాపాత్మురాల్ని క్షమించు. దీనిపాడుబుద్ధి మూలకంగా నీయాస్తి నీయారోగ్యం పోనాది. యీ బడవముండను నీలముంచినా పాల

మంచినా నీదేభారం" అంటూ దొరచేతులు పట్టి బావురని యేడ్చింది రామి.

కన్నయ్యదొర కొంచెం నవ్వాడు- "ఓస్సి! అదా? ఆ సందుగపెట్టా— అదే—దానిసికతరగా— అదే తెచ్చిపెట్టినా దీవాలకి మంతౌను. దాన్ని గురించి ముందే నీతో సెప్పేసుండినా బాగుండిపోను. నా మంతరం పోద్దికావాలని జడిసి సెప్పసేదు నీకోటి. పోలేపోనీ యిప్పుడైనా సెప్పితీర్తాను నీకోటియిను— ఆపెట్టెలోంది ఆస్తీకామా సున్నాకాదు. ఒక బయంకరమైన యిససర్పం. దాన్ని సూడెయ్యడం వాళ్ళోడికే తెల్సు. యింకేరైనా దాన్ని సూస్తే పేపాలు సత్తారు. అందుకే నిన్నైనా దాన్ని సూడ్నిచ్చిపోలేకాదు. అయితే దానిపసేటంటావు—ఎవలికైనా పాముగర్రా కుట్టిందంటే యీ పాముని తీసుకెల్లి కుట్టినోడికి సూపి మంతరిస్తే ఆడికి తగ్గిపోద్ది. ఈ రయిస్యం ఎవలికైనా తెలిస్తే నా మంతగ ప్రభావం పోద్దని నా నెవల్లోని సెప్పసేదు. అందుకేగండ నిన్న టేల నిన్ను తాకలేకాను. నువ్వుకూడ నామీద నలిగేవు. ఆ రాచ్చసిముండా నోడు యీరిగాడు పాపం! అందునోయూటో దవరాసులున్నాయని కాబోల నన్ను కొట్టి పెట్టే, తాలాకూ పట్టుకుపోయా డిప్పుడే. అనుబవిస్తాడునే ఈపాపానికి" అంటూ అలిసిపోయి చెప్పాడు కన్నయ్యదొర.

దొర ప్రభావం అప్పటికి బోధపడింది రామికి. ఇన్నాళ్లూ దొరచర్యలకి కారణ మవగాహనమైంది. దొరపైని ప్రేమ యినుమడించింది.

"దొరా! నాదొరా! నా నిన్నాళ్లూ నీ కెంత సంకటం సేకూర్చినానో—నా తప్పు లన్నీ సెమించవూ?!" అని రామి తనముఖాన్ని దొరముఖానికి రాసింది.

కన్నయ్యదొర రామితల నిమురుతూ "రామీ! యింకా నన్నలాగే పిలాల టే?!" అని తలెత్తి అడిగాడు నవ్వుతూ.

రామి నవ్వుతూ సిగ్గుతో "మామా, నాముద్దుల మామా!" అని దొరగుండెలమీద వాలింది.

అంతలో దూరాన తోటలో పెడబొబ్బలు వినిపించాయి. కేక లంతకంతకు అధికమై ఒక్కసారిగా చల్లారిపోయాయి.

రామి భయంతో దొరను గట్టిగా పట్టుకుని "మామా ఆ చేటిమామా! మనిసికేకల్లా గినిపిస్తన్నాయి" అని అడిగింది.

దొర నవ్వేడు "ఊం. ఏదో తోడేల్ని—కాదు మనిసిరూపాన్నున్న తోడేల్ని పాము కరిసుంటాది. ఆ మొకం సచ్చుంటాది అరుపుమాని. అంతే" అన్నాడు.

రామి గ్రహించింది. కన్నయ్యదొరచేతుల్ని గట్టిగా రొమ్ము కదుముకొని "నానా జలమజలాన్కలికి నువ్వే నాకు మామవి కావాల" అంటూ తృప్తితో కళ్లు మూసింది రామి.

"రామీ! నారామీ! నీ కిన్నాలకి నామీద మనసుకలిగింది. నా వింక దన్యాతుముడ్ని. నాకోర్కె లన్నీ యిక పలప్పెదమైనట్టే" అని ఆనందాశ్రువులు కార్చాడు కన్నయ్యదొర.

డి. పి. వాటర్ ఫీల్డుకథఆధారంగా.

# నర్తకి

శ్రీ వేలూరి శివరామశాస్త్రి

౧

ఓ విశ్వనాథ ! జన తృ
ష్ణావారిద ! నాదుభావనానర్తకి నీ
పావనపరిధిని భరత
ప్రావీణ్యము చూప నీవు పరికించితివే ?

౨

ఇది యున్నది యున్నటు లే
యదనున వాకొనదు కల్ల లాడెదు నని నా
మెదఁ దోఁచె, సిద్ధి చేసిన
యదె నృత్యము నీదు నెదుట నంతర్యామీ ?

౩

ఇది నీ పరిధిని నృత్యము
పదింబదిగఁ జేసి రాస భావాంతరమై
పొదలెడునెడ స్వేదము నీ
పదములపైఁ బడుట కెంతో వగచెడిని బ్రభూ !

౪

నీ విద్దానిం దాఁకితి
కావలయును ; దీనిమేన కాకే యలంకా
రావళి సకలమ్ము రస
ప్లావితమై కానఁబడు నపార్థివ మగుచున్.

౫

పంచాంకంబుల నాటకం బయిన యీబ్రహ్మాండ మం దెంతయున్
సంచారం బొనరించి భావరసనా సంపత్తి నానందము
గొంచున్ నృత్యముఁ గాక నర్తకుని వాక్యం గాక నర్తన్ సదా
గాంచన్ నృత్యము చేయుచుందు నని వక్కాణించు సర్వేశ్వరా !

# సంపూర్ణస్వేచ్ఛ సాధ్యమా?

రాబర్ట్ లిండ్

"నిజానికి స్వేచ్ఛ అనేది ఏదేశంలోకూడా సమగ్రతను పొందియుండలేదు. మనుష్యులందరూ దేవతలైతేనే తప్ప ఇకముందుకూడా అట్టిది వస్తుందని తోచదు."

కొన్ని శబ్దాలు ఊహాపరంపరమీద అపరిమితంగా పనిచేస్తాయి కాని అవి అట్టి విట్టి వని నిర్వచించడం మహా అసాధ్యం. "సౌందర్యం" అట్టి శబ్దాల్లో వక టని 'కళ అంటే ఏమిటో' వ్రాస్తూ టాల్‌స్టాయ్ పేర్కొన్నాడు. "స్వేచ్ఛా లేక స్వాతంత్ర్యం" అనేదీ అటువంటిదే ఇంకో శబ్దం. "స్వేచ్ఛ" ఒక పదమూ ఒక వస్తువుకూడా. దాని నిమిత్తం మనుష్యులు శతాబ్దులాదిగా ప్రాణాలు సమర్పిస్తున్నారు. సభ్యతనందిన దేశదేశాంతరాల భాషలలో అత్యంత ఉదారపూర్ణమైన కవితావేశం జనింపజేసిన దీ శబ్దమూ ఈ వస్తువూ. కాని ఏ స్వేచ్ఛా ఉపాసకుణ్ణయినా దానికి నిర్వచనం చెప్పమంటే నూటికి వక్కడైనా సంతృప్తికరమైన జవాబు ఇవ్వగలడో లేడో! చావుకుసైతం తెగింపచేయదగినదని అర్థమిచ్చే పర్యాయపదం దానికేదైనా లభిస్తుందేమో అని "రోజెట్టు" సంగ్రహించిన "తెశారస్" నామక గ్రంథంలో వెతికాను. అక్కడ దొరికిన పర్యాయపదాలు: అపరాధీన, బంధనరహిత, అనిరోధ ఇత్యాదులు. వట్టి శబ్దాలపుట్ట. బైరను, షెల్లీలు గ్రహించినమాదిరి స్వేచ్ఛాభావాన్ని వీటిలో ఒక్కటైనా స్పష్టీకరించదు సరిగదా చాలా మటుకు వ్యతిరేకార్థం వెలిపరచేవి.

## ఆంగ్ల కార్మికుడు

స్వేచ్ఛ అంటే ఏమిటో, దాని సంపాదనకు స్త్రీ పురుషు లింతగా బలికాదగినదని తలపోయుటకు హేతు వేమిటో గ్రహించడానికి ఇంత ముఖ్యావసరమైన సమయం ఇంతకుపూర్వం ఎప్పుడుగాని సంప్రాప్తించి వుండలేదు. ఇప్పుడు ప్రపంచ మంతటా ఎక్కడ జూచినా "స్వేచ్ఛా స్వేచ్ఛా" అని వకటే ఘోష. ప్రజాసత్తాకపు దేశాల్లో సయితం అల్పసంఖ్యాకులైన స్త్రీ పురుషులు—మేధావులైనవారే—ప్రజాసత్తాక స్వాతంత్ర్యానికి విరోధులై అది వట్టి భ్రమాత్మకమైనదని మనలను ఒప్పించగలవాళ్లున్నారు. చేంబర్లేను క్రిందలాగే హెర్ హిట్లరు క్రింద కూడా ఆంగ్ల కార్మికుడు సమాన స్వేచ్ఛా సౌఖ్యాలను గలిగివుంటా డని చెప్పేవాళ్లూ కలరు. ఆంగ్లకార్మికుడు పుంజీదారుల క్రీతదాసుడని వారివాదం. అందుచేత మహాఅయితేతన సంకెళ్లను కోలుపోవడం తప్ప వేరొండు నష్టమేమీ కలుగజాలదు, కాబట్టి ప్రపంచంలోని కార్మికులందరూ ఏకీభవించాలనీ ప్రేరేపిస్తుంటారు. వారల ఈ చర్యమూలంగా ప్రజాసత్తాకం కావించిన మహాకార్యాలను సరిగ్గా గ్రహింపక పోవడమేగాక భ్రాంతిగా అపార్థం చేసుకోవడ మని నా అభి

ప్రాయం. దాన్నే సర్వసాధారణంగా అంగీక రించేయెడల నాగరికతకు మహానర్థం సంభ వింపవచ్చు.

స్వేచ్ఛను ఈలాగు క్రిందుపరిచేవాళ్ల లో చాలామంది అట్లా ఎందుకు చేస్తున్నా రంటే వా రందరూ స్వేచ్ఛావాతావరణం లో పెరిగిన వారు. స్వేచ్ఛ లేకపోవడ మంటే ఏమిటో వారికి తెలియదు. వారికి వాక్ స్వాతంత్ర్యం వుంది, మతస్వాతంత్ర్యం వుంది, గమనాగమన స్వాతంత్ర్యం వుంది, రాజకీయ, ధార్మిక స్వాతంత్ర్యా లున్నాయి. వారి తండ్రులు ఎంతటి త్యాగంచేసి, ఎంత మూల్యం సమర్పించి ఈ స్వేచ్ఛను తమ నిమి త్తం సంపాదించి పెట్టారో వీరు గ్రహించినట్లు కనుపడదు. ఈ ప్రజాసత్తాక స్వాతంత్ర్యం వట్టి బూటకమే అయ్యేయెడల దానికొరకు పెనగులాడినవా రందరూ పూర్వం అనవస రంగా వృథాగా శ్రమపడ్డట్లు తేలుతుం దనే విషయంకూడా వీరు గమనించడంలేదు.

### ఈ హక్కులను పోగొట్టు కొంటే

ఇంగ్లాండులో ప్రజాసత్తాకపు స్వాతం త్ర్యమే లేకుంటే ఏమవుతుందో గమనించండి. ట్రేడుయూనియనులను ఏర్పరుచుకొనుటకు స్వేచ్ఛే లేకుంటే ఆంగ్లకార్మికు లింతటి మంచిస్థితిలో వుండేవారేనా? ఎన్నికలలో ఓటునిచ్చే అధికారమే లేక పార్లమెంటుసభల లోనూ, పురపాలక సంఘాల్లోనూ తమ లాభాలకొరకు కృషి సల్పేవారు లేకపోతే కార్మికు లింత మంచిదశలోకి రాగలిగే వారేనా? జడ్జీలు ప్రభుత్వానికి దూరగులు గాక కార్మికనాయకులను జైళ్ల కంపుతూ ప్రధానమంత్రి ఆజ్ఞ అయితేచాలు—ఆ నాయ కులకు మృత్యుదండన విధించేవారైతే కార్మి కు లింతటి మంచిదశలో వుండగలుగుదురా? వారికి ఇష్టంవచ్చిన రాజకీయ, ధార్మికభావా లను కలిగియుండుటకు స్వేచ్ఛే లేకుంటే వా రింతటి మంచిస్థితిలో ఉండేవారేనా? ప్రభుత్వపు గూఢచారులు తాము మాట్లా డుకునేవాటిని పొంచివుండి విని తమ్మ జైలుకు లాక్కొనిపోతార నే భయం లేకుండా సమస్తవిషయాలనుగురించీ నిరభ్యంతరంగా మాట్లాడుకొనగల స్వాతంత్ర్యమే లేకుంటే వీ రింతటి మంచిస్థితిలో వుండేవారేనా ? నిస్తంత్రిద్వారా విదేశవార్తలను వినగలిగే స్వాతంత్ర్యంలో లేశమాత్రం తగ్గించినా చాలు వారిసౌఖ్యంలో కొంతభాగం పోయి నట్లే.

### భవిష్యత్తుకుగాను పునాది

ఒక ప్రకారమైన స్వేచ్ఛావిధానం — దానిని కోల్పోవడమే సంభవించేయెడల అట్టిదానికొరకు ఆంగ్లేయులలో నే శ్రేణివారు గాని చింతించకుండా వుండగలట్టిది—దొరుకు తుందేమో అని యోచిస్తే అట్టిది వక్కటైనా నాకు గోచరం కావడంలేదు. రోతనుపుట్టించే ముక్కిపదేశాల్లో నివసిస్తూ శక్తికిమించి పాటు పడే పేదరాలైన బిడ్డలతల్లి భాగ్యవంతురా లయిన లాయరు పెళ్లాంతో సమానమైన స్వేచ్ఛను అనుభవిస్తుందిగదా అని నే వనను; కాని ఆమె తన మనస్సులోని సంగతిని ఇరుగు పొరుగు వారితో చెప్పుకోడానికి స్వేచ్ఛలేక, ఇష్టమయినా తన బిడ్డలను నాన్‌కన్‌ఫార్మిస్టు ఆదివారపు స్కూళ్లకు పంపజాలక, తాత్కా లిక ప్రభుత్వాన్ని తొలిగించి వేరొండు సౌఖ్యదాయకమైనదానిని ఏర్పరచుకొనుటకు సహాయపడే ప్రతినిధికి తాను వోటును ఇవ్వ

జాలక ఉంటే—అప్పుడు తాను రెండింతలు బానిస ననుకొంటుం దని నా నిశ్చయం.

ఇంత ఎందుకు—కార్మికుల కున్న రాజకీయ స్వతంత్రత ఇంగ్లండు స్వరూపాన్ని ఇదివరకే మార్చివేసింది. సావకాశంగా, సుఖమయమైన సుందరజీవితాన్ని గడపటానికి వలసిన మార్గా లన్నింటినీ విస్తృతం గావించింది. ఇంగ్లండు అర్హతమమైన సభ్యతను పడయుటకుగాను చేయ వలసింది ఇంకా చాలా వుంది. కాని ఇంగ్లండుయొక్క భావి నిర్మాణము ప్రస్తుతపు స్వాతంత్ర్య శిథిలావశేషాలమీద గాక వాటి ప్రతిష్ఠాపనలమీదే జరగాలి.

నిజానికి స్వేచ్ఛ అనేది ప్రపంచమందలి ఏ దేశంలోనుకూడా సమగ్రతను పొందివుండ లేదు. మనుష్యు లందరూ దేవత లైతేనే తప్ప ఇకముందుగూడా అట్టిది సంభవిస్తుం దని తోచదు. కాబట్టి మనం అపేక్షించ తగిన దంతా ఇతరులకంటే మిన్నయైన స్వాతంత్ర్యం. ఉదాహరణానికి జర్మనీ రష్యాలతో సరిపోల్చుకుంటే ఇంగ్లండకే ఎక్కువ స్వేచ్ఛ వుంది. నిరంకుశాధికారానికి లోబడని స్వాతంత్ర్యం దాసికుంద.

## చేంబర్లేను — స్టాలినులు

ఇంగ్లండుకంటే రష్యాకు ఎక్కువ స్వేచ్ఛవుందని ఒక సమర్థుడైన కమ్యూనిష్టు యువకుడు అంటూవుంటే విన్నాను. ఎందుచేత ననగా స్టాలినుమీద ఇష్టంలేనివారు కారంలోంచి తొలగించగలుగుతారట. కాని అట్టి పరిస్థితుల్లోనే ఆంగ్లేయులు రాగల జనరల్ ఎలెక్షనుకు ముందు చేంబర్లేనును తొలగించాలంటే వారికి న్యాయమైన హక్కు లేదట. కాని రష్యనులు స్టాలినును తొలగించగల స్వాతంత్ర్యం ఉన్న దనుకోవడం వట్టికల. స్టాలినును పదభ్రష్టుని చేయు డని వ్రాసే వార్తాపత్రికను వెలువర్చగల స్వాతంత్ర్యం రష్యనులలో ఎవరికీ లేదు. మాస్కోలోని వకవీధిమూల రష్యావాడు ఒక పెట్టెమీద నిలుచోని స్టాలినును నిందిస్తూ, అతణ్ణి పదభ్రష్టుని గావింప ఉపన్యసించే యెడల ఒక్క క్షణంలో 'ఓగ్పూ' వచ్చి అతణ్ణి పట్టుకొంటారు. అందులకు భిన్నంగా చేంబర్లేనును అతని పదవినుంచి తొలిగించం డని మహసారా ఉపన్యసించడానికీ పత్రికల్లో వ్రాయడానికీ ఆంగ్లేయులకు స్వేచ్ఛవుంది. ప్రజాసత్తాక స్వేచ్ఛ అని మనం పిలిచే వాట్లల్లో ఇదీ వకవిధమైన స్వేచ్ఛ. దీన్ని తొలగించడం ఇంగ్లండులోని కమ్యూనిష్టులకైనా ఎక్కువ సౌఖ్యప్రదం కాదు.

వోటువిషయంలోగల స్వాతంత్ర్యం గతశతాబ్దిలో ఇంగ్లండుకు ఎంతటి సౌఖ్యానికి హేతుభూత మైందో యోచించండి! ప్రచండమైన విప్లవాన్నుంచి దేశాన్ని రక్షించుటకు సహాయపడిన వాట్లలో ఇదీ వకటి. స్వాతంత్ర్యపు సరిహద్దులు విస్తృతములైనది రక్తపాతంవల్ల కాదు, ఎలెక్టర్లు పార్లమెంటుమీద గావించిన వత్తిడివల్ల. అదే మంచి

కాన్ఫరెన్సుల మూలంగా పరిష్కరించుకో వడం జాతీయవ్యవహారాల్లో ఎంత వాంఛ నీయమో అంతర్జాతీయ వ్యవహారాల్లో గూడా అంతే వాంఛనీయం. విప్లవ మంటే అంతర్యుద్ధమే. ప్రజాసత్తాక స్వాతంత్ర్యం అట్టి విప్లవాన్నుంచి ఇంగ్లండును రక్షించింది కాబట్టి దానిపుట్టుక మన జాతీయచరిత్రలోని మహాఘటనాల్లో వక్కటని నేనంటాను.

ఫిన్లాండుమీద రష్యాదాడి

అయినప్పటికీ ప్రజాసత్తాకపు స్వాతం త్ర్యాన్నే గాకుండా జాతీయస్వేచ్ఛనుగూడా చులకనగా పరికించేవాళ్లు ఇప్పు డున్నారు. ఛేంబర్లేను జెకొస్లొవికియానిమిత్తం పోరా డకపోవడమూ, పోలెండునిమిత్తం పోరాడ టానికి వెనుదీస్తున్నాడని సందేహించడమూ జాతీయస్వాతంత్ర్య మని వారు నమ్మినట్లు కనుపడుతుంది. కాని పోలెండుకోసం పోరా టానికి ఛేంబర్లేను సంసిద్ధుడుగా ఉన్నాడని తెలియటంతోటే, బలహీనమైన చిన్న రాజ్యాల హక్కులవిషయంలో వారికిగల ఉత్సాహం యావత్తూ పోయి మీదుమిక్కిలి ఎదురుతిరిగి ఫిన్లాండుమీద రష్యాదాడిని సమర్థించేటంతవరకూ తయ్యారైనారు.

శక్తిమంతు డయిన ఆక్రమణకారినుండి రక్షించుకోటానికి అవసరమైన ఫిన్లాండు తీరాలమీదా,ద్వీపాలమీదా రష్యా ఎందుకు అధికారం స్థాపించుకోగూడదూ అని వీరిప్పు డడుగుచున్నారు. ఇటువంటి యుక్తినే దాన్నే పురాతనకాలపు ఆంగ్ల యూనియ నిస్టులు అయిర్లాండుకు స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను ప్రసాదించే సందర్భంలో ప్రయోగించారు. అయిర్లాండు స్వతంత్రం అయితే ఇంగ్లండుకు క్షేమకరం గాదని వారివాదన. అయిర్లాండు తీరాల్లో నౌకాకేంద్రాలను ఏర్పరుచుకొనే నిమిత్తం ఆధునికధ్వంసకారి ఆయుధాలను ప్రయోగించి, డబ్లినుమీద బాంబులను వేసి, అయిర్లాండునిరోధాన్ని అణగద్రొక్కటకు ఇంగ్లండుహక్కును సమర్థిస్తారా అని రష్యా పాక్షికులైన నా మిత్రులను కొందరిని అడి గాను. కాని తృప్తికరమైన జవాబు రాలేదు. కాని ఆక్రమణకారియైన సామ్రాజ్యవాదపు దృష్టిపథంలో ఇంగ్లాండు ఇట్లా గావించటం న్యాయసంగతమైనదే. సమస్తనాగరిక జాతు లూ స్వాతంత్ర్యం కలిగి వుండాలనే ప్రజా సత్తాకపు సిద్ధాంతాలనుబట్టి చూస్తేనే అట్టి దాన్ని నేర మని మనం నిందించగలిగేది.

ప్రజాసత్తాకానికి ఒక హెచ్చరిక

యూరోపునందలి అధికభాగంలో వై యక్తిక స్వేచ్ఛనేకాదు, జాతీయస్వేచ్ఛను సైతం ధ్వంసమొనర్పగల పరివర్తనలు ఘటి ల్లుతున్నాయని, అందువల్ల ఆబాలగోపాలం జను లందరూ భయకంపితు లవుతున్నారని కొన్ని ఏండ్లకుపూర్వం భావిస్తూ ఉండేవాణ్ణి. కనీసపక్షం అయిర్లాండువారికి ప్రపంచంలోని అయిర్లాండులన్నీ ఒకటినర్వాత వకటి అంత ర్థాన మవుతున్నట్లు కనిపించింది. కాని పాశ్చాత్యు లందరిలోనూ ఈ పరివర్తనలవల్ల ప్రాచీనకాలపు స్వేచ్ఛాభిలాష మళ్లీ రేకెత్తు తున్నదని నా అభిప్రాయం. ఆంగ్ల కార్మి కులు చాలాకాలంనుంచి తమయొక్క

స్వేచ్ఛ కేకాదు, తా మెప్పుడూచూడని విదేశీయులకుగూడా స్వేచ్ఛ కావాలని సమర్థిస్తున్నారు. ఇట్టి ఉదారపూర్ణమైన, స్వార్థరహితమైన అభిలాషతో జ్వలించే హృదయాలుగల యువకనాయకులు బయలుదేరడం మీాదనే ప్రపంచంయొక్క భవిష్యత్తు ఆధారపడివుంది.

ఇంతకూ స్వేచ్ఛను నిర్వచించడానికి సమర్థుడను కాలేదేమో? దానిని కోలుపోవుట అంటే ఏమిటో యూరోపులో ప్రస్తుతం దేశంతరువాత దేశంలో కలిగే పరిస్థితులనుబట్టి గ్రహించుకోవచ్చు. అదివరకున్న స్వేచ్ఛను తేలికగా చూచుకొనక దానిని కాపాడి, బలపరచి, వృద్ధిచేసుకొని మానవ స్వేచ్ఛను విస్తృతం కావించుకొనుటకు తోడ్పడాలని ప్రజాసత్తాకపు జనులకందరికీ అవి హెచ్చరిక నిస్తున్నాయి.

---

# ఆంధ్రపత్రిక

## విక్రమ సంవత్సరాది సంచిక

---

### వ్యాసకర్తలకు విజ్ఞప్తి

ఎప్పటివలెనే విక్రమ సంవత్సరమునకు సంవత్సరాది సంచికను ప్రకటింప బోవుచున్నాము. అందు ఇదివరకువలెనే రాజకీయ, ఆర్థిక, పారిశ్రామిక, సాంఘిక, సారస్వత, చారిత్రకాది విషయములకు సంబంధించిన వ్యాసములు ప్రకటింపబడును.

నేడు ప్రజాజీవనములో ప్రాధాన్యము వహించుచున్న సాంఘిక, సాహిత్య, ఆర్థికాది సమస్యలను గురించి జనరంజకముగా వ్రాసిన వ్యాసములు కావలెను. ప్రతివ్యాసము నేటి జాతీయజీవనానికి సంబంధించినదై, ఆలోచనా మహితమయి ఉండవలెను. దానిలో నేటి జాతీయజీవనమూ, భావిసాంఘిక, ఆర్థికాది పునర్నిర్మాణపద్ధతులూ సూచితమగుట మేలు.

ఆంధ్రదేశపు కోస్తావర్తకము, ఆంధ్రదేశ పారిశ్రామికాభివృద్ధి, నిరక్షరాస్యతను పోగొట్టు మార్గములు, విదేశములందలి వ్యావసాయిక విధాపద్ధతులు, ఆంధ్రదేశ వర్తకవ్యాపారము: ఎగుమతి దిగుమతులు, ఆంధ్రదేశోన్నతి—వీటిని గురించినట్టియు, మద్రాసు ఆంధ్రులదే యని నిర్ధరించునట్టియు ప్రత్యేక వ్యాసములు కావలెను.

భాషాభిమానులు దయయుంచి వెనుకటివలెనే అమూల్యములగు తమ వ్యాసములతో మా సంచిక నలంకరించి మా యుద్యమమునకు తోడ్పడప్రార్థితులు. వ్యాసములు **1940** ఫిబ్రవరి **10** వ తేదీలోపున మా కందునట్లు పంపవేడుచున్నాము.

యస్. శంభుప్రసాద్,
ఆంధ్రపత్రికా సంపాదకులు.

మరొా:—ప్రతి వ్యాసముపైనను 'సంవత్సరాది సంచికకు' అని వ్రాసియుండగోరెదము. వ్యాసములు సాధ్యమయినంత సంగ్రహముగ నున్న మంచిది.

# మహాకపి జాతకము

శ్రీ శిరోమణి సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి

స్మరణమాత్రన సర్వదురితముల్ తూలించు
నమరస్రవంతి యొందవతరించె
ముక్కంటిముంగిటి ముత్యమైనభవాని
ఘనమైన యెవ్వాని కడుపుపంట
దివ్యతీర్థంబు సిద్ధక్షేత్రము నటంచు
నమర్షిబృంద మెచ్చటఁ దపించు
నమరలోకాధివాసము రోసి నిర్జరుల్
శాంతికాంతు రెయ్యెడఁ గాపురింపఁ
గాక యత్త్యుచ్చశృంగసంఘాతమున నె
య్యాభిజాత్యసమృద్ధిఁ బుణ్యానుభావ
సంపదలచే మహోన్నతస్థాన మొంది
యాహిమాలయపర్వతం బలరెఁ బుడమి.

మన బోధిసత్త్వుఁ డొకపరి
ఘనప్రమాణంబు గలుగు కపిరూపమునన్
జనియించి యాతుషారా
ద్రిని వాసముసేయు నొక్కవృక్షమునందున్.

నరులకు నచ్చనిగుణములుఁ
జరిత్రముఁ దితిక్ష గలిగి జగతి గురులకున్
గురువై యుండందగె; వా
నరుఁడే యాతండు? దేవనాథుఁడు గాఁడే?

ఆ వానరేంద్రునడుగుల
సేవించి తరింపఁ దలఁచి చిన్నలుఁ బెద్దల్
వేవేలు వన్యజంతువు
లావృక్షప్రాంతమందె యావాసించున్.

ఆ వనమందలి క్రూరమృ
గావళి హింసకతఁ బాసి యతిసాధువులై
గోవులవలె గొఱ్ఱెలవలె
నై వర్తించును దదీయమగు బోధములన్.

ధరియించి మృగాకృతులను
జరియించు తపస్విగణము సరణిని మృగముల్
పరమప్రశాంతమూర్తులు
నిరస్తమాంసాశనులుగ నెగడెను శుచులై.

ప్రత్యూషంబున నందలి వన్యమృగము
లమరగంగాంబువుల స్నానమాడి వచ్చి
పండి రాలిన తియ్యనిపండ్లఁ దెచ్చి
పేర్మి గురుదక్షిణగ సమర్పించుఁ గపికి.

సతతం బయాచితోప
స్థితమగు ఫలమూలకంద తీర్థంబుల జీ
వితమును నిలుపుచుఁ గర్మ
క్షతికాలం బెదురుసూచు గతి నతఁ డుండెన్.

ఒకదినమున నచ్చోటికి
నికటంబునఁ బటపటధ్వనివిమిశ్రితమై
"అకటకటా! చచ్చితి"నం
చొకకూయి వినంగఁబడియె నుచ్చైస్స్వరమై.

ఆ యార్తాలాపము విని
యా యార్తత్రాత వానరేంద్రుఁ డఱచుచున్
"ఓయీ! వచ్చితినిదె" యని
యాయాశకుఁ బఱుగువాఱె నతివేగగతిన్.

ప్రపతితజీర్ణపర్ణమయి
   పంకిలమై క్రిమికీట పూర్ణమై
ఉపగతపూతిగంధియయి
   యుగ్ర మగాధమునైన యొక్క గ
ర్తపు సలిలంబులన్ విధివి
   ధానమునం బడియున్న మానిసిన్
గపి కరుణాతరంగితమ
   నస్కత గాంచె నతన్ సబాష్పుఁడై.

ధర నరుఁడు బ్రదుకు ధాత్రీ
ధరంబుపైనుండి పడినఁ గతుకఁడేనిం
గఱచిన "ఆయుర్మర్మా
ణిరక్షతి"యటంచు విబుధనివహము వలుకున్.

నరకకూపంబుఁబోని యా ముఱికికూప
మున మునుంగుచుఁ దేలుచుఁ బుణ్యవశతఁ
గాలిఁ దాఁకిన పాషాణ ఖండకంబు
నాఁదుకొని నిల్చె నతఁ డలసాంగకములఁ.

శోచ్యదశనున్న యాతనిం జూడఁ గపికి
నైదుప్రాణంబులును బోయినట్టు లయ్యెఁ
గపినిఁ గాంచిన యతనికి గతములైన
ప్రాణములు వచ్చినట్లయ్యె వాస్తవముగ.

మరియును గపినిం గని యా
పురుషుం డిట్లనియె "నేను భూసురుఁడను నీ
గిరిఁ దిరుగుచు హృతధేనువు
కొఱకై మూన్నాళ్లనుండి కూడొదవమిన్.

ఈ కూపతీరజాత మ
నోకహ మెక్కితినిఁ బండ్లను భుజింపఁగ న
ఱ్ఱాఁకట మాడుచు; దుర్విధి
యాకరణినిఁ ద్రోసె నన్ను నీగర్తమునన్.

విఱుగఁ దరుశాఖ, పడి క్రింద శిరసుచిదుకఁ
జీలి కత్తులబోనొప్పని రాలరాసి
ఱొాడఁగా నెత్రు వఱదలై యొడలినుండి
యవశగతి దొర్లిపడితి గర్తాంతరమున.

ఏ దేవుఁ డంపెనో? నిను
నే దేవుఁడవో? యిఁకేల? యీదుర్గతునిన్
జేదుదువో యొడ్డునకుం,
గాదందువా? యగతికులకు గతి దైవమెకా!

ఏ పాపఫలమొ? యీమల
కూపంబునఁ గూలఁబడితి; ఘోరమయినయిం
కే పాప మనుభవింపఁగ
నీపగిదని బ్రదికినానో? యెఱుఁగఁగనైతిన్.

సిరి పోయి చీడ పట్టిన
కరణిని హృతమయ్యెఁ గోవు; కలిగెను నాకీ
దురవస్థ; యనర్థంబులు
పరంపరగ వచ్చుఁగద! విపత్కాలమునన్.

అనుచును వాపోవు మను
ష్యుని దీనావస్థఁ గాంచి యుఱికెను గర్తం
బున కతని నెత్తఁగాఁ గపి;
ఘనుఁ డార్తత్రాతలెక్కఁగాఁ గొనఁ డొడలిన్.

దుమికియు వానిని స్వస్కం
ధముపైఁ గూర్చుండఁబెట్టి తగ నెగిరి యమాం
తముగాఁ దెచ్చె వెలి; కసా
ధ్యముగల దే? హనుమదన్వయప్రభవులకున్.

అతనినిఁ దెచ్చి యొక చ
ట్రాతిపయిం బండఁబెట్టి ప్రాశింప ఫల
వ్రాత మిడి మానిచెను క్షత
గాత్రంబు వనౌషధిప్రకాండము వలనన్.

దూరాపాతజమైన శ
రీరవ్యథ యుపశమిల్లఁ బ్రిదులంగా దు
ర్భరము కరాపసృతమగు
తీరున నతఁ డొంది యొడలు దెలియనినిద్రన్.

తెలివొందె రెప్ప కంటిని
వలెఁ దన్నుం గాచుచున్న పార్శ్వస్థునిఁ గోఁ
తులతేనిఁ గాంచి "సఖుఁడా!
అలసితినను మోసి నిద్రనందుమ!" యనియెన్.

బడలియుంట నోడలు వానరనాథుండుఁ
గోలఁదికడవుఁ దానుఁ గూర్కఁదలఁచి
యావులించుకొనుచు నా కేకరాక్షుఁడై
కనులు మూసి నిద్రఁ గొనియెఁ బజ్జ.

నిదురం జెందిన యా ప్లవంగముని సా
న్నిధ్యంబునం గూరుచుం
డ దురూహంబు జనించె బ్రాహ్మణుని డెం
దంబందు "స క్రోఁతి క్రో
వ్వి దృఢాంగం బయి యుండె దీనియొడల్
భేదించి మూన్నాళ్లయం
గద దీఱంగ భుజించి మాంసమును నే
గం జెల్లు" నం చిస్సిరో!

అకృతజ్ఞముగద లోకం;
బాకఁ దన్నంబిడ్డదాత కౌఁగి నిదు సున్నం;
బాకరుఁడు నది దాఁటిన తె
ప్పకు నిప్పంటించి పోవుఁ బాపాత్ముఁడై.

బ్రాహ్మణాపసదుఁడు భావించి పైగతి
దానిమేలు మఱచి దయను విడిచి
వంశకీర్తిఁ జెఱచి పాపకవాటంబుఁ
దెఱచె నచట దాని యెఱచికొఱకు.

పెనురాతిబండ నొకదా
నినిఁ గైకొని వాఁడు క్రోఁతినెత్తిని విసరెన్
గనికరమును గొని దూరం
బునఁ బడియది దాని ప్రాణములఁ గాపాడెన్.

ఆ శిలాఘాతజాత మహారవమునఁ
గ్రోఁతి మేల్కాంచెఁ; జచ్చె విప్రుండు సగము
తా నొకండు దలంపంగ దైవ మొకటి
తలఁచు నవియును దుష్టుండు దలఁపఁ డకట!

అదుగకయుఁ గ్రోఁతి యా బ్రాహ్మణాపసదుని
యాస్యమున వ్రేలుచున్న పాపాక్షరములఁ
జదువుకొని రాయినోడువు సాక్ష్యంబు వినియుఁ
దెలిసికొనెఁ దత్కృతఘ్నత కలఁతపడక.

చచ్చినవానిం జంపుట
మెచ్చినపని గాదటంచు మెదలక కపి వా
నిచ్చక చూచుచు నిలిచెను;
ఎచ్చటిచూపో? దహించె నీ బ్రాహ్మణునిన్.

సాధువుల చల్లచూపె యసాధువులను
నిట్టనిలువునఁ గాల్చును నీ యనర్ప
కవనిని "మృదుస్సుతీక్ష్ణ" యటన్న సూక్తి
యర్థమయ్యె నటంచు బ్రాహ్మణుఁడు వగచె.

అంతం బల్కెను వానరుం డిటులు వి
ప్రా! పొందఁగాఁ బోకుమీ!
స్వాంతంబందు భయంబు నావలన; నీ
శైలంబునం దున్న యా
జంతువ్రాతము విన్న నీచెనఁటిచే
ష్టన్ సైఁప; దికాన దా
టింతున్ రమ్మని కాననాంతమున వి
ప్రుం దెచ్చి వానిం దయన్.

పుచ్చె నోడ లెల్ల; నాపాదమూర్ధముగను
ముసరె సీఁగలు; క్రుళ్లెను బురుగులు వడెఁ
బఱవఁ దొడఁగెను జీము నెత్తురులు సతత
మచిరకాలంబున నె బ్రాహ్మణాధమునకు.

ఇలు వెడలించిరి బిడ్డలు;
తొలఁగిరి చుట్టములు; స్నేహితులు పెడ మోమై
తలఁగిరి; దేశబహిష్కృతి
గలిగెఁ గృతఘ్నతఫలంబుగాఁ గుష్ఠగుటన్.

చూడంగాఁ జుట్టంబును
వేఁడంగా వేలుపేని వెలయకయు రుజా
పీడితుఁడై తను రోయుచుఁ
గాడుపడు చత్తుండు పోయెఁ గారడవిఁబడిన్.

ఇడవయ్యెఁ దరులు ఫలముల
నిడవయ్యెను నీళ్లు లేళ్లు; లిరవైనను దా
నిడవయ్యె గుహాలు వానికిఁ;
జెడుగునకు సహాయపడ దచేతనతతియున్.

తుదికి మహాప్రస్థానము
మదినలుసఁగ నిశ్చయించి మరలక చనుచున్
ఎదురైన మొరగలిం బడె
నిదె! ప్రాయశ్చిత్తమనుచు నీ దోసఁగునకున్.

---

# ప్రేమాగ్ని

శారిస్

రాజు —
శశిముఖి — రాజుగారి ప్రియురాలు
వసంత, లలిత — శశిముఖిదాసీలు
జపానందస్వామి — యోగి
చంద్రహాస్ — మునిబాలకుడు

## మొదటిరంగం

[సాయంత్రం ఏడు గంటలు. శశిముఖి మేడ మీదిగది, చాలా వైభవంగా అలంకరించివుంది. అద్దం ముందు శశిముఖి కూచుని కిటికీకేసి చూస్తోంది. ఆమె ముఖంలో గంభీరతా, కోపీ కనపడుతున్నాయి. సన్నని నీలంచీరెలోంచి ఆమె దేహం స్పష్టంగా కనపడుతోంది. చేతుల్లేని నల్లటి మొహమల్ రవిక. తెల్లని భుజాలమీద వుంగరాలు తిరిగిన నల్లని జుట్టు ప[illegible]తోంది. వసంత ఒక్కొక్క ఆభరణమే తీసేసి [illegible]ాకైన హారాలు ఆమె మెళ్లో వేస్తోంది. లలిత ఆ [illegible]ణాలని భద్రంగా పెట్టెలో అమరుస్తోంది.]

వస — దేవీ! యీపచ్చలహారను వుంచనా ?

శశి — (నిర్లక్ష్యంగా) తీసెయ్యి.

వస — ప్రభువులకి చాలా ప్రియమైనది.

శశి — సరేలే, వుంచు.

లలి — అమ్మా! రాణీగారు మిమ్మల్ని దర్శించుకోవాలనుకుంటున్నారు.

శశి — రమ్మను ఒకసారి.

లలి — కాదు దేవీ! తమర్ని అక్కడికి పిలిపించుకోవాలని ఆమెకోర్కె.

శశి —(హేళనగా) ఏమిటీ? ఎవ రనుకుంది నన్ను? సానివకుళమాలని కాదని చెప్పు.

లలి — దేవీ! ఆమెహృదయం ఎంత మృదులమో తమ రెరగరు.

శశి —(విసుకుగా) పోదూ! ఆ ప్రసంగం నాముందు ఎత్తకు.

(ఉత్సాహంగా) వసంతా, ఒకప్పుడు ఈ ప్రదేశంలోనే క్రిష్ణుడు గోపికలతో ఆటలాడుకున్నాడు కాదూ? అకస్మాత్తుగా మాయమై, ఎంత వెతికినా, వేడినా, ఏడ్చినా కనపడక వేధించి ఆనందించే వాడు...దొంగక్రిష్ణుడు.

ఇటువంటి సాయంకాలం నాకు మురళీగానం వినిపించినట్టే వుంటుంది. నిజమో కలో చెప్పలేను. ఆ మేఘంవెనకనించి కనపడే మృదువైన నీలం ఆతని చెక్కిలి కాదు కద అనే ఆలోచనలో వొళ్లు జలదరిస్తుంది.

(ఆలోచనగా)అవి ఒక అపూర్వమైన దినాలు. నావంటి సామాన్యురాలికి లభ్య మౌతుందా ఆ అదృష్టం?

లలి — ఇప్పుడుమాత్రం మీ కేమి తక్కువ దేవీ?

శశి — లలితా! నాకు యిట్లాంటి జీవితంలో ఎక్కువ ఆనందం లేదు. ఏదో ఒక దివాన స్వేచ్ఛగా నా యిష్టం వొచ్చినట్టు, యమునాతీరాన శ్రీక్రిష్ణుడి అడుగులుపడ్డ ప్రదేశాల్లో తిరగడానికి వీలుంటుందా అని కలలు కంటూను. నేనూ ఒక గోపికనై...

కృష్ణుడితో బృందావనిలో క్రీడించాలని— కాదు— తక్కిన గోపికలతో కలిసి అతనికోసం వెతకాలని పిస్తుంది.

వస — ఏమీ! మన ప్రభువులు సాక్షాత్తూ—

శశి — అవును. సాక్షాత్తూ కృష్ణభగవాన్. (గొంతు మార్చి) రూపం వుండగానే సర్వా! గుణమో, వస మో, ఆత్మవిశాలత్వమో—

లలి — కాని రాణీ! భోగాలతో పెరిగినమీరు, కించిత్ తిరస్కారం భరించలేని మీరు సామాన్య గోపికగా యెట్లా మారగలరు?

శశి — ఎన్నే, నాగరత్వమంతా వృత్తమటన. ధిక్కార మనే యీ తెరే కట్టుకోకపోతే, నిలవనిస్తుందా ప్రపంచం నాబోటిదాన్ని?

(కిటికీవేపుచూసి ఉత్సాహంగా) ఇప్పుడీ క్షణాన శ్రీకృష్ణుడు నన్ను కోరి, ఆ మేఘంవెనకనించి ఒక్క దూకుదూకి నావొళ్లో రాలకూడదూ? ఆ తెర తొలిగించి నవ్వులో, నాబాలకృష్ణుడు...

(గుమ్మం తెర తొలిగించి చంద్రహాస్ లోపలికి వొచ్చాడు. శశిముఖిని చూసి సర్వమూ మరిచి నుంచున్నాడు. అందరూ అతనివేపు ఆశ్చర్యంతో చూస్తున్నారు.)

శశి — ఎందుకు వొచ్చావోయ్?

చం — (ఆమెవంక గౌరవంగా చూస్తో) నా ఆత్మ కావ్యాన్ని సమర్పించడానికి.

శశి — (నవ్వుతో) మాలో ఎవరికి?

చం — (తొణకకుండా) మీకు.

శశి — (పరిహాసంగా) రేపు. అందాకా భద్రంగా దాచివుంచు కానుక.

చం — సరే. తెల్లవారే దర్శిస్తాను.

(శశిముఖి బిగ్గరగా పిచ్చిదానిలాగ నవ్వుతోంది. సఖులు బిత్తరపోయి చూస్తున్నారు. చంద్రహాస్ ఆనందంతో గమనిస్తున్నాడు. శశిముఖి నిర్లక్ష్యంగా కాలినున్న మొహమల్ జోడు తీసి తివాసీమీద పడేసింది.

చంద్రహాస్ అదృష్టంవల్ల ఆమె సాయంత్రం వుత్సాహంగా వుంది కాని, లేకపోతే, అతన్ని కిటికీలోంచి అప్పుడే కిందికి పారేయించేది.)

వస — అతని కళ్ల మెరుపు చూశారా, దేవీ!

లలి — ఎక్కణ్ణించి వొచ్చాడో!

శశి — (హేళనగా) ఇతన్ని ఇంటిదగ్గిర దిగబెట్టిరా లలితా పాపం అతని తల్లి ఎంత వెతుక్కుంటోందో.

(సఖులు నవ్వారు. చంద్రహాస్ దిగులుగా ఆమెవంక చూశాడు. ఆమెముఖం గంభీరమయింది.)

శశి — రేపు రమ్మన్నానుకాదూ!

చం — రేపు, రమ్మన్నారా! రేపు నేను రానా! రేపు!

(తిరిగి వెడుతున్నాడు.)

లలి — పాపం, అందాకా ఆగలేడండి.

(చంద్రహాస్ తిరిగి చూశాడు. అతనిచూపుకి లలితనవ్వు ఆగింది. ఒకసారి శశిముఖివంక చూసి త్వరగా వెళ్లిపోయినాడు.)

## రెండో రంగం

[సాయంత్రం యమునానదితీరాన. వసంతా లలితా నుంచుని మాట్లాడుతున్నారు.]

వస — ప్రతి సాయంత్రమూ యిక్కడే కి[illegible] చూస్తో తదేకదీక్షగా కూచుంటాడని చెప్పాడు, పల్లెవాడు.

లలి — సరిగా అమ్మగారు స్నానం చేసేచోటనే.

వస — మరి యేమైనాడో!

లలి — వాళ్లవాళ్లకి తెలిసి ప్రాయశ్చిత్తం చేసి వుంటారు.

వస — ఎట్లా తెలుస్తుందేం!

లలి — కలవరించాడేమో! కళ్లలో ఆ ప్రమత్తత గమనించలేదా నువ్వు?

వస — అతని చూపుల్లో ఆ ఆకర్షణ గమనించావా?

లలి — వొప్పుకోరుగాని, దేవికి విరహం అపరిమిత మనిపిస్తుంది నాకు.

వస — ఆమె గానం విన్నావా? ఆ మూర్ఛనలలో తీవ్రత! ఆమార్దవంలో అగ్ని!

అదుగో!... పిలవనా?

లలి — ఏమిటా బాధ!

వస — పాపం!

లలి — ఏం చెబుతావు?

వస — దేవిసందేశం! మునీ! మునీశ్వరా!

లలి — యోగిపుంగవా! బాలసుకా!

(చంద్రహాస్ వాళ్ల కెరగనట్టు చూస్తున్నాడు.)

లలి — అప్పుడే మరుపా?

వస — అంత గర్వమా?

లలి — ఇంత టక్కరి పని తలచలేదు.

వస — భయపడ్డావా? బ్రాహ్మడే!

చం — ఏమిపని నాతో!

లలి — దేవిగారు అడగమన్నారు 'ఇదే నా వాగ్దాన' మని!

చం — నే నేమీ వాగ్దానము చేయలేదే!

వస — అయితే - నీకావ్కనేం చేసుకున్నావు?

(చంద్రహాస్ సిగ్గుపడుతున్నాడు)

చం — అపవిత్రమైన దని గంగానది ప్రవాహంలో నిర్మల మాతుందని లోతుగా పడేశాను.

వస — అపవిత్రప్రదేశానికి అగ్రజుడివి ఎందుకు ప్రవేశించావు?

చం — సుందరప్రాకారాల్ని చూసి, భ్రమించి, గర్భాలయంలో దివ్యతేజోదర్శనానికై వొచ్చాను.

లలి — వొచ్చి —

చం — శిలాహృదయప్రతిమని చూశాను. పూజార్ల నానైరితివాన్ని హేళనచేశారు.

లలి — ఈ సాయంత్రం, ఆపూజార్లే మోకరించి వేడుకుంటున్నారు భక్తుణ్ణి.

వస — భక్తసందర్శనం లేక దేవిమానసం విహ్వలమయిందని—

చం — ఈ విశ్వమే విశాలదేవాలయ మని — యీ భక్తుడు క్షుద్రదేవతని ఆరాధించలేలచుకోలేదని— చెప్పండి.

(వెళ్లాడు.)

వస — ఏమిమదము!

## మహా జో రంగం

[సాయంత్రం. శశిముఖి మేడలో ముందుగది. ఎవరూ లేరు. లోపల్నించి శశిముఖి వీణాగానం వినపడుతోంది. చంద్రహాస్ వొచ్చాడు. తెల్లటిచొక్కా, జరీఅంచు ధోవతి కట్టుకున్నాడు. నుదుట సన్నటితిలకం. చేతులో పువ్వులు పట్టుకుని సిగ్గుతో నుంచున్నాడు. పాట వింటున్నాడు. శశిముఖి పాట నాపి తొరగా వొచ్చి ఆనందంతో అతనిచేతులు పట్టుకుంది.]

శశి — వొచ్చావా, ఆఖరికి!

(అతన్ని సోఫాలో కూచోపెట్టి, తను పక్కనే కూచుంది.)

నిన్నటికన్నా ఎంత మారిపోయినావో చూడనీ... చంపలు రక్తంతో చిందుతున్నాయి. అదంతా కోపమే. నిన్న చెలరేగినజుట్టు, ఇవాళ దువ్వివుందా? ఇంకా ఏంమారావు? ఏంలేదా? మనసులోనూ మార్పు లేదా?

చం — నేనేకాదు మారింది.

శశి — నీసంగతి చూడనీ ముందు.

చం — నిన్న నేను మిమ్మల్ని ప్రేమించాను.

శశి — (కొంచెం భయంతో) ఈవాళ?

చం — మనిద్దరం ఒకరినొకరం ప్రేమిస్తున్నాము.

శశి — ఊహూ—ఇంకా.

చం — ఏమీ లేదు.

శశి — చెప్పవా? అప్పుడే కోపమా?

చం — నిన్న స్వేచ్ఛావర్తిని. ఈవాళ అజ్ఞానబంధితుణ్ణి... నిన్న కీదమునిబాలకుణ్ణి... యీవాళ హృదయాధిచక్రవర్తిని... చాలదూ?

శశి — అబ్బా! ఎంత కవిత్వం! ఎవరు నేర్పారు?

చం — మురువుగారు.

శశి — ఓహో మీ గురువుగారు యీ కవిత్వ పండి తులా?

చం — ఆయన్నేమీ అనవొద్దు. హేళన ఆయన మహిమమందు అపచారము.

శశి — ఎవ రాయన?

చం — జపానందస్వామి.

శశి — జపానందస్వామివారా? అపరాధిని. ఎంత అదృష్టవంతుడివి.

చం — (గర్వంగా) నే నాయనకి ప్రియశిష్యుణ్ణి.

శశి — అయితే మ విట్లా రావడం అంగీకరించరే!

చం — అదే నాభయము, ఆయనని౦చి దాచలేను. తెలిస్తే ఆయన ఆగ్రహిస్తారు.

శశి — మరి ఎందుకు వొచ్చావు?

చం — ఎందుకు పిలిపించావు?

శశి — అసలు మొదలు మొన్న —

చం — చపలచిత్తేత .. నిగ్రహాలోపంవల్ల .. ఎప్పుడు ధ్యానంలో కూచున్నా, సచ్చిదానందమే మాయ అని, నీవే నీసౌందర్యమే సత్యమని, మనోవికల్పం నన్ను నీ వాకిలికి తెచ్చింది. నీవు తప్ప యీశ్వ రుడు వేరని నమ్మలేకపోయినాను.

శశి — నేనా? నేను యీశ్వరుడా? (అతన్ని బుజ్జగిస్తోంది) కాకపోయినా, నాలో యీశ్వరు డున్నా డనే అంటారుకద!

(అతని చేతులు పట్టుకుని) ఎంత చిన్న చేతు లో! ఎందుకు పనికి వొస్తాయి యివి మొగవాడికి నీకు?

చం — నన్ను ప్రేమించే స్త్రీ విలాసానికి.

శశి — ఇదికూడా మీ గురువుగారు.....తప్పు...నేను కూడా ఒకపటువునై, యమునాతీరాన ఆశ్రమంలో స్వేచ్ఛగా ఆకాశంకింద, మృదుపవనంలో మీ గురుపాదారవింద సేవా భాగ్య త త్పర ను కాకూడదూ?

చం — ఈ భాగ్యభోగ—

శశి — ఇదా! బంగారు పంజరంలో పక్షిని.

చం — నాతో రండి.

శశి — మీగురువుగారు రానిస్తారా నన్ను?

చం — ఆవును రానీరు. కాని మనిద్దరం యమునా తీరాన కుటీర మేర్పరచుకుని వుందాం.

శశి — ఆహా! ఎంత స్వార్థం! నేను కుటీరంలో కాపురమా? కట్టుకుపేందుకా?

చం — అవును. మాధుర్ణీ — మీ లావణ్య తేజస్సు నన్ను ఉచితానుచితాలకి—

(శశిముఖి అతన్ని దగ్గిరికి లాక్కుంటోంది.)

శశి — కాదు, కాదు. నీకై నేను—

(లలిత వొచ్చింది.)

లలి — దేవీ! ప్రభువు!

శశి — (చిరాకుగా) తలనొప్పిగా వుంది వెళ్ల మని చెప్పు.

లలి — కాదు దేవీ —

శశి — (కోపంగా) వెళ్లు.

(లలిత వెళ్లింది)

అబ్బా! భరించలేను ఈజీవిత మింకా. నీ కుటీరం ఇంకా ఎప్పటికి సిద్ధ మౌతుంది?

చం — మనిద్దర మే నిర్మించుకోవాలి.

శశి — ఆకాశవనాలలోనా?

(లలిత వొచ్చింది.)

లలి — దేవీ! ఒక్కనిమిషం దర్శనంచేసి వెళ్లిపోతా రట.

శశి — (రూఢిగా) వీల్లేదు వెళ్లు.

(అంటో వుండగా రాజు వొచ్చాడు. శశిముఖి లేచి నంచుంది.)

శశి — మామూలు మర్యాదలు పాటించ నవసరం లేనంత చులకనైనా నను కోలేదు, ప్రభువులకి.

రా — (వినిపించుకోక)

దాసీ! నా డెసడో తైటికి పంపి—

శశి — వీల్లేదు.

(లలిత అతన్ని సమీపిస్తుంది. శశిముఖి అతనికి అడ్డమొస్తుంది.)

శశి — వీల్లేదు.

రా — (లలితతో) నా ఆజ్ఞ.

(లలిత దిగులుగా శశిముఖివంక చూస్తుంది. చంద్రహాస్ మాట్లాడకుండా తలవొంచుకుని వెళ్లిపోయినాడు. శశిముఖి వెనక వెళ్లబోతోంది.)

శశి — చంద్రా!

(రాజు ఆమెని పట్టుకు ఆపాడు. వెనక లలిత వెళ్లింది, భయపడుతో. శశిముఖి అతన్ని చంప మీద గట్టిగా కొట్టింది. రాజుకి కోపం వొచ్చింది కాని అణుచుకున్నాడు.)

రా — నీచెయ్యి కందిందా?

శశి — ఈ ధూర్తవేషాలు చాలా పురాతనా లని తెలీదు కాబోలు?

రా — అవును. అధికారవిస్ఫురణాలే నవీనసంప్రదాయాలు. కానీ...

శశి — ఏంచేస్తా రతన్ని?

రా — అతే వెవరు? కల. మరిచిపో.

శశి — చంపుతారా?

రా — అతను లేడు, వుండడు. సంశయం మనసులోంచి తొలిగించుకుని నిశ్చితంగా సుఖించు.

శశి — నేనే పిలిపించా నతన్ని. అతన్ని వొదలండి. (మోకరించింది.)

రా — ఇప్పుడు యముడినించి ఆహ్వానం వొచ్చింది. నీకు తెలిసేలేదా?

శశి — వినాశనం. బ్రహ్మహత్యాపాతకం చుట్టుకుంటుంది.

రా — ఆపాతకంచుట్టూ నీచేతులు.

శశి — బ్రహ్మహంతకుడు వేశ్యకికూడా అస్పృశ్యుడు.

రా — అతని ఐశ్వర్యం —

శశి — (దీనంగా) నన్ను బాధించవొద్దు.

(ఏడుస్తోంది అతను ఆమెతల నిమురుతున్నాడు.)

రా — ఏడవకు. మరిచిపోతావు.

శశి — అతను, ఏమెరగని చిన్నిపాప! యీపాటికి— అతనితల్లి యెంత యేడుస్తుందో! పాపిని—నేను అంగపాపిని.—

(లలిత వొచ్చింది.)

లలి — ప్రభూ! సేవకులు —

రా — రమ్మను.

(భటులు వొచ్చారు.)

రా — ఏం?

(నోట మాటరాక వొణుకుతున్నారు.)

రా — కాలేదా ?

. . . . .

(కోపంతో లేచాడు.)

వొదిలారా ?

(శశిముఖి ఆశతో చూస్తోంది.)

భటు— ప్రభో! రక్షించాలి. యమునానది వొడ్డున నిలుచోపెట్టి, నరకబోతూవుండగా, స్వామిగారు చూసి—

రా — ఏస్వామి ?

భటు— జపానందస్వాములవారు —

రా — చూసి—

భటు— మావంక చూశారు. మా చేతులు కత్తులతో గాలిలోనే నిలిచాయి — బాలుని — కాదు — ఆ నేరస్థుణ్ణి తీసుకుని వెళ్లారు.

రా — ఊఁ.

(ఆలోచిస్తున్నాడు, శశిముఖి స్థిరంగా నవ్వుతోంది.)

రా — మూడువందలమందిని యీ ప్రాసాదంచుట్టూ నిలపెట్టి, అనిమిషులుగా కావలికాయమని దండనాధుడితో నాఆజ్ఞ.

భటు— చిత్తం.

(వెళ్లారు.)

రా — వాడీపైపునకు వొచ్చాడా వాడికి మరణమే.

శశి — అవును.

## నా లు గో రం గం

[పొద్దున్న యేడుగంటలు. యమునానదీతీరాన్న జపానందస్వామి ఆశ్రమం. వనంలో పొగడచెట్టుకింది అరుగుమీద చంద్రహాస్ కూచునివున్నాడు. జుట్టు తడిగా వేళ్లాడుతోంది. మొహాన విభూతి. చేతులో పుస్తకం. మనసు స్వప్నాలలో. చూపులు శూన్యంలో. అతని నల్లనిజుట్టుమీద పొగడపూలు నక్షత్రాలలాగ రాలుతున్నాయి. జపానందస్వామి వొచ్చాడు.]

జ — (శిష్యుడి తలమీద చెయ్యివేసి) చంద్రా!

(చంద్రహాస్ వులిక్కిపడి గురువుని చూసి నమస్కరించాడు.)

ఏమి టీబాధ?

(చంద్రహాస్ మాట్లాడకుండా తల వొంచుకున్నాడు.)

ఉదంతం నాకు తెలిస్తే మంచిదేమో!

చం — ఏంలేదు.

జ — (దయగా) చెప్పు నాయనా!

చం — స్త్రీ.

జ — (చప్పున కోపంగా) ఎవరూ? స్త్రీ!

(చంద్రహాస్ వొణుకుతాడు.)

జ — (నెమ్మది తెచ్చుకుని) ఎవ రది చంద్రా? భయపడకు.

(చంద్రహాస్ పక్కన కూచుని తల నిమురుతున్నాడు.)

చం — ఆమె—రాజుగారి ప్రియురాలు. కృష్ణాష్టమి ఉదయాన ఆమెని యమునాతీరాన చూసినప్పట్నించీ నా హృదయం ఆమెకోసం తపించింది. మీరు యీశ్వర దర్శనంకోసం చేసే యోగతీవ్రత కన్నా అధికమైన తపన నన్ను కాలుస్తోంది.

(జపానందస్వామి కళ్లు మూసుకున్నాడు నిదానంగా)

చం — ఆమెని చూడగానే వెయ్యిసూర్యులు వెలిగినట్లు సహస్రదేవతా దర్శనమైనట్లు ఆనందం కలిగింది నాకు.

జ — ఎంత నీచవ్యసనానికి లోనైనావోయీ! ఛీ! రాజ ఉచ్ఛిష్టాన్నా నువ్వు కోరింది? — నువ్వు — నా శిష్యుడివి! అగ్రవంశసంజాతుడివి, తపోవనవాసివి, బ్రహ్మచారివి, వేదాధ్యయనపరుడివి. ఇంత తుచ్ఛబంధనానికి లోను కావాలని వాంఛిస్తావా?

(చంద్రహాస్ దిగులుగా తల వొంచుకుంటున్నాడు. గురువు ప్రేమతో, జాలితో అతని తల నిమురుతున్నాడు. ఎట్లా సహాయపడాలో తోచక.)

జ — నాకు తెలుసు ఎంత కఠోరమో యీ ఆశ్రమదీక్ష. కాని నీ ఆదర్శం మరిచావా? విశ్వసౌందర్యాన్నే అందుకోగలిగే యత్నంలో, యీ అల్పతృప్తి కోసం చేతులు జాచి, దోవ తప్పావా?

చం — నా కామె విశ్వసుందరి. ఆమే నా హృదయానికి దీప్తి. ఆమె కాక ఇంక అర్థం లేదీ ప్రపంచానికి.

జ — కాని, మృదువైన పెదవులు, కలకంఠరావం, స్నిగ్ధబాహువులు, చివరికి ఆర్ద్రహృదయం — యివన్నీ నీ గర్భశత్రువు ఎరువు తెచ్చుకున్న మాయాలంకారాలుసుమా!

చం — కాదు. ప్రేమలో జ్వలించే హృదయం మాయను కాల్చేస్తుంది. ఆమె సౌందర్యాన్ని మించిన వాస్తవికత కనపడదు. ఆమె ఆరాధనలోనే నేను సాధిస్తాను ప్రపంచరహస్యాన్ని.

జ — అగ్నిని ప్రేమించి దరిచేరితే కాల్చడం మానుతుందా? వికసించి ఆకర్షించే పద్మంచుట్టూ బురద, జలగలు, పాములు.

చం — ఓ....భయపడడం ఆధ్యాత్మిక విద్యార్థుల లక్షణం కాదు.

జ — ఆధ్యాత్మికరాజ్యాన్ని సాధించి పట్టాభిషిక్తుడు కావా లని ప్రయాణమైన నువ్వు, ఎంత సుందరమైతే నేం, ఆ అల్పప్రదేశంలో ఎంతకాలం తామసించగలవని? నీ విశాలాన్వేషణానికి ఏం తృప్తి నిస్తుంది స్త్రీ సుందహాసం?

చం — అనుభవించి తెలుసుకోనీండి.

జ — వెర్రివాడా! ప్రాసాదంచుట్టూ భటుల్ని పెట్టారు.

చం — పెకితేనేం? నేను వెర్రైతేనేం? నా హృదయంలో వెలిగే శశిని ఏ మేఘాలు దూరం చెయ్యగలవు?

జ — కాని, నీ గురుచోదిత న్యాయపక్షంనించి పతితుడివై, తపస్సు కందని దూరమైనావా,— నిరాశను పశ్చాత్తాపాన్ని భరించగలవా? నాయనా!

చం — నిరాశా ప్రేమ భయంకర పర్యవసానంలో భస్మమైతేనేం?

జ — ముందు నా కోపాగ్నిలో భస్మం చేస్తాను. అల్పుడా, నాతపశ్శక్తిని, నా అమూల్యమైన కాలాన్ని, యీతుచ్ఛకాముకుడికోసమా ధారపోసింది?

చం — వొద్దు. ఒక్కసారి ఆమెపరిష్వంగస్నాతకుణ్ణయిన తరవాత తమయిష్టానుసారం దండించండి.
(జపానందస్వామి ముగ్ధుడై చూస్తున్నాడు.)
ఏం చెయ్యను? ఎంత గాయపరిచానో తమ అపారానుగ్రహాన్ని. స్వామీ! మీకు అర్థం కాదు. తమ రామెను చూడలేదు.

(జపానందస్వామి అతిదీనంగా చూస్తున్నాడు. ఆయనకు కోపం పోవడం చూసి, చంద్రహాస్ చకితుడైనాడు.)

స్వామీ! యీ దౌర్భాగ్యుని వొదిలివెయ్యండి నరకద్వారంవద్ద. నరకమే నాస్వర్గాన్నిగా ప్రేమిస్తున్నాను.

జ — ప్రేమా! ఆధ్యాత్మిక బోధనాలయంలో గురువు శిష్యుడి కిచ్చే ప్రేమలో ఆ స్త్రీకై నీ ప్రేమేమిటి? నూర్గురు కొడుకులు చచ్చినతల్లి కడపటి ఒక్కడిమీద చూపుతుందే ఆ ప్రేమకి అతీతం. నిన్ను—చంద్రా! నిన్ను విడవడం నాతరమా? మాయాదేవి హస్తాల్లోంచి నిన్ను రక్షించగల నాకు, నీ శశిముఖి అసాధ్యమా?
చంద్రా! సౌందర్యానికా ఆశిస్తున్నావు? చూడూ, ఈగాలి, యీ అవకాశం, యీకాంతి-యిదంతా సౌందర్యం. మనోనేత్రాన్ని తెరు.

(అతని గుండెలమీద చెయ్యి వేశాడు. చంద్రహాస్ కళ్లు మత్తుగా సగం మూతలుపడ్డాయి.)

(రహస్యస్వరంతో) ఇదంతా యీశ్వరలీల. సచ్చిదానంద స్వరూపుడివి. ప్రపంచసౌందర్యాలకి చక్రవర్తివి. క్షణభంగురమైన మాంసచర్మాలలో అతి సూక్ష్మంగా సంక్రమించిన సౌందర్య కళలానికై భ్రమించిపోతావా? మూర్ఖంగా!

(చంద్రహాస్ అట్లానే కూచున్నాడు వినవట్టు. గురువు లేచాడు.)

జ — (చిరునవ్వుతో) జయించాను.

(దూరంగా వెడుతున్నాడు చెట్ల వెనకాలకి. దూరంనించి శిష్యులగానం వినపడుతోంది.)

## అయిదోరంగం

[మర్నాడు తెల్లవారుజామున ఇంకా చీకటిగానే వుంది. చంద్రహాస్ స్నానంచేసి నిలుచున్నాడు ఆశ్రమంలో. అతని వెతుక్కుంటూ వసంత వొస్తోంది. చంద్రహాస్ ఆమెని చూసి తల తిప్పుకున్నాడు.]

వస — మీతోటనిండా పూలే!

చం — ఆశ్రమంలో స్త్రీలకి ప్రవేశార్హతలేదని తెలీదో?

వస — అంతఃపురాలలోకి పురుషులకీ లేదు.

చం — అవును. అపరాధమే, ఇంక జరగదు.

వస — చంద్రహాస్! ఆశ్రమంలో గురువుగారి చాటున నీహృదయాన్ని పదిలపరచగలిగావుగాని, మాదేవిగారికి ఆ నేర్పరితనం చాతకాలేదు.

చం — అజ్ఞానం.

వస — ఓహో! ఎదీ చూడనీ.

చం — ఏమిటి?

వస — మూడోకన్ను ఉద్భవించిదేమోనని.

చం — నువ్వు వెళ్లు. స్త్రీ లిక్కడ వీల్లేదని చెప్పలేదూ? గురువులఆజ్ఞా.

వస — గురువుగారికి భయమా, గొప్ప వైరాగ్యమేం?

చం — శిష్యుల రక్షణకోసం—

వస — కాని శిష్యులు పరిసరాల్లో హృదయాలు

దొంగిలించి, ఆశ్రమంలో దాక్కోవొచ్చు? ఏం గొప్పధర్మం! స్త్రీహృదయాలు తాత్కాలిక వినోదహేతువులనా మీగురువుబోధన?

చం — నువ్వు వెళ్ళవా?

వస — నువ్వు దేవిగారికి ఆపూలు నీచేత్తో కోసి యిస్తే, తీసుకుని వెడతాను. ఆసాయంత్రం నువ్విచ్చినపూలు వాడి యింకా ఆమెమెళ్లో బాధిస్తున్నాయి.

చం — నన్ను క్షమించమని మీ దేవిగారితో చెప్పు.

వస — నిన్నెట్లా క్షమిస్తుంది? నీవల్ల అపరాధం ఆమె అంగీకరించందే! చంద్రహాస్! మీ ఆశ్రమంలో ఆపదుద్ధారణ బోధించరా?

చం — ఎవరికి ఆపద?

వస — దేవిగారికి!

చం — ఏమి?

వస — నిన్నంత ప్రేమించిందీ, ఆమె నిన్నాహ్వానిస్తుంది? ఇంక నీవు కనపడకపోతే, ఆమె. . .

చం — ఆమె...

వస — ఏంచెప్పను? కృశించి అక్కడే నశిస్తుందో, లేక —

చం — లేక —

వస — నిలవలేక ఇక్కడికేవొచ్చి నీపాదాలముందే -

చం — వొద్దు . . . నేను వొచ్చి ఏం లాభం? ఈ హృదయంలోంచి మోహాన్ని కాల్చివేశాను.

వస — ఎందుకు?

చం — మోహం అంధకారం.

వస — కొత్తగా నేర్చుకున్నావా?

చం — గురువుగారు ప్రభువుగారు ప్రసాదించిన నూతనజ్యోతి యీ తుచ్ఛబంధనాల్ని భస్మం చేసింది.

వస — పోనీ, దేవిగారికి జ్ఞానబోధన చేసి, ఆమె మనోవికల్పాన్ని నయంచేయకూడదా? శాశ్వత నీదికాదా!

చం — నువ్వు వెళ్ళు.

వస — నువ్వు వొస్తానంటే.

చం — ఊఁ. వెళ్లమరి.

వస - కాని నువ్వొక్కడివీ ఎట్లా వొస్తావు! నిన్ను...

చం — అవును. ఎట్లా?

వస — నేను చెప్తానుగా. నావెంట ముందు నా యింటికి రా.

## ఆ రో రం గం

[సాయంత్రం అయిదుగంటలు. మేడమీద చివరి గది. ఎడమపక్కన గోడకి పెద్ద అద్దాల కిటికీ మూసి వుంది. దాంట్లోంచి నది కనపడుతుంది. శశిముఖి సోఫాలో కూచుని నదివేపు చూస్తోంది. చిక్కిపోయి దిగులుగా దీనంగా వుంది. నిట్టూర్పువిడిచి తల చేతులతో గట్టిగా అదుముకుంది. మళ్లా తలెత్తి కిటికీలోంచి చూసింది.

పువ్వులు పట్టుకుని ముందు వసంత, వెనకాల ముసుగువేసుకుని ఆడవేషంలో చంద్రహాస్ వొచ్చారు. వసంత పువ్వులు బల్లమీద పెట్టింది. శశిముఖి తలెత్తికూడా చూడదు.]

వస — అమ్మా, పువ్వులు!

శశి — ఊఁ.

వస — పువ్వులు అక్కర్లేదా? యమునానదీతీరాన వున్న ఆశ్రమంలో పువ్వులు.

శశి — (ఆమె ఆశను నిరాశ మింగేసింది.) ఎక్కడివైతేనేం?

వస — ఎంతో ప్రయాసంమీద మీకోసం తీసుకొచ్చాను!

శశి — (చంద్రహాస్ ని చూసి) ఎవ రది?

వస — మా చెల్లి.

శశి — ఎందుకు? పొమ్మను.

(పువ్వులు చూసి విచారంలో మునుగుతుంది. చంద్రహాస్ భరించలేక ముందుకు పరిగెత్తాడు.)

చం — శశీ!

(శశిముఖి అతన్ని గుర్తించింది. ఆమె ప్రేమని అణుచుకుని కోపం తెచ్చుకుంటోంది.)

శశి — ఎందుకు వొచ్చావు? ఎవరు రమ్మన్నారు నిన్ను?

(చంద్రహాస్ ఆమెచేతుల్ని పట్టుకుని మాట్లాడుతున్నాడు. వసంత వెళ్లిపోయింది.)

చం — శశీ! నా వాగ్దత్తం నిలుపుకోడానికీ, అంతకన్న—

(ఆమె అతని చేతుల్ని విదలించేసింది.)

శశి — తెలిసింది నీ సంగతి! కృష్ణుడికన్నా ధూర్తుడివి.

చం — అవును. నీ హృదయాన్ని దొంగిలించి కృష్ణుడికి అర్పించడానికే వొచ్చాను.

శశి — (వింతతో) ఎందుకూ?

చం — చెబుతాను. ఆవేశం అణుచుకో ముందు.

శశి — ఎట్లా అణుచుకోను? చంద్రా, చంద్రా ... నిన్ను నాముందు చూస్తో...

(అతన్ని కౌగిలించుకుంది. అతను వొదిలించుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. కాని ఆమె గమనించదు.)

శశి — ఎన్నిదినా లయింది! ఎన్ని రాత్రులు, ఎన్ని పగళ్లు? ఎందు కింతబాధ? మనకి ఏమిటి సంబంధం?

చం — నేను చెపుతాను. ఈ మోహమే బాధ! నేను యీ వియోగాన్ని మాన్పి, నీనేత్రాల్ని అత్యద్భుత అనంత ఆనంద ధామాలకి తెరుస్తాను.

శశి — (అతన్ని అర్థం చేసుకోక) అదే నేను కోరేది! కాని ఎట్లా?

చం — నువ్వు బైటికి వొచ్చెయ్యి.

శశి — ఎట్లా?

చం — నాతో వొచ్చెయ్యి. నేను నువ్వనుకుంటున్నంత అసహాయుణ్ణి కాను.

శశి — ఎట్లా రాను—కావిలి!

చం — ఇట్లా రా.

(కిటికీ దగ్గిరికి తీసుకువెళ్లాడు.) నేనూ వసంతా అంతా ఏర్పాటు చేశాము. ఆవావ చూడు. ఒక్క తాడుతో సులభంగా దిగుదాము.

శశి — సరే లే. ముందు నిన్ను చూడనీ. నువ్వు కల కావు కద! ఇంక నిన్ను చూసే అదృష్టం పడుతుందనుకోలేదు నిజంగా చెరనించి విముక్తి కలుగుతుందా నాకు?

చం — నిజంగా చెరలాగే వుంది కద! నా ప్రోత్సాహమేమో అని భయపడుతున్నాను.

శశి — నిన్ను చూడకముందు ఇదే స్వర్గ మనుకున్నాను. ఇప్పుడిది బంగారు పంజరమయింది.

(వసంత వొచ్చింది.)

(చంద్రహాస్ శశిముఖీ తలుపుగడియ లాగుతున్నారు. ఎంతకీ రాదు అది.)

చం — ఇంత బిగుసుకుపోయిందేం?

శశి — పదిహేనేళ్లయింది ఆతలుపు తెరిచి.

(చంద్రహాస్ తలుపుగడియ లాగుతున్నాడు.)

శశి — అదృష్టం మనపట్ల లేదు.

వస — అమ్మా! యీకిటికీల అద్దం పగలకొట్టరాదూ?

చం — అవును.

(అద్దం పగుల కొట్టాడు)

శశి — ఎంత శుభదినం!

చం — తొరగా —

శశి — తొందరేం? కడసారి నావైభవాన్నంతా చూసుకోనీ. ఇంక నీతో చింపిబట్టలూ, పూరిగుడిసలేకదా! కాని కాని చంద్రా నిజంగా నన్ను ప్రేమిస్తున్నావా? మోసం కాదుకదా! ఎన్నడూ నన్ను వీడవుకదా! మాట్లాడవేం? నీ బంధువులు, గురువు...

చం — చూడు. నిన్ను నా ప్రేమనించి నాకన్న విశాలమైన ప్రియుడి హస్తాల్లో లీనం చెయ్యడానికని —

శశి — ఆఁ! ఏమిటి? (కోపంగా) ఎవ రనుకున్నావు నేను? ఛీ పాపీ .... కాదు. వేళాకోళం చేస్తున్నావు. వుండు- ఛీ! అట్లాంటిది నేను నమ్మలేను నీవిషయమై.

చం — విను. నీహృదయాన్ని ఈశ్వరుడి కర్పితం చేశ

శశి — అదా! కాని ఈశ్వరుడు నాకెందుకు? నువ్వు కావాలిగాని

చం — నేను వుంటాను. ఏమవుతాను. కాని మానవ ప్రేమ సంకుచితం.

శశి — అదంతా యేమిటి? నీ యీశ్వరుడు నాకఖ్ఖర్లేదు. వెళ్లు — వుండు — నువ్వు వెళ్లకు. విడిచే ఎట్లా బతకను, ఎందుకు బతకను? వుండు చంద్రా! ఆలోచించవే. నన్ను ప్రేమించవా?

చం — ప్రేమిస్తాను. కాని...

శశి — అదుగో యేదో వుంది. నేను రాను—వొస్తాను. పోనీ నాకు కనపడుతో వుంటే చాలు. నువ్వు నన్ను—లాభంలేదు వెళ్లు. కనపడకు. తొరగా పో. (ఏడుస్తో కిందపడ్డది. చంద్రహాస్ ఆమెవిచారాన్ని చూడలేక, ఆమెసౌందర్యానికి వశ్యుడై, ఆమె పక్కన కూచుని లేవతీసి కావిలించుకున్నాడు. వసంత వెళ్లిపోయింది)

నిజమా? నన్ను ...

చం — అవును.

శశి — నీ యీశ్వరుకన్నా?

చం — పోనీ.

శశి — గురువు?

చం — పోనీ.

శశి — మరి నేనే నీకు అందరికన్న ఆధిక్యమేనా?

(లలిత వొచ్చింది, వెనక వసంత)

లలి — దేవీ! ప్రభువు వొచ్చారు.

శశి — ప్రభువు! ఈవాళ ఎట్లా వొచ్చారు? చంద్రహాస్! దాక్కో.

చం — ఎందుకు దాక్కోవాలి? రానీ.

శశి — అయ్యో! ఎట్లా చెప్పను? ... వసంతా! ఆగది సద్దెయ్యి లలితా! యీ మాట వెరు.

(తివాసీయెత్తి, రహస్యమైన తలుపు తీస్తారు)

ఒక్కనిమిషం. నాకోసం. చంద్రా! వ్యవధిలేదు. నీ శశికోసం (చంద్రహాస్ దిగాడు. మూసేశారు) కమ్మనా...వుండు...ఆకెటగదిలోకి తీసుకురా.

లలి — అనుమానపడతారు.

శశి — సరే. ఇక్కడికే రానీ...

(లలితా వసంతా వెళ్లారు)

ఏం చేస్తావో యీశ్వరా!

(శశిముఖి మొహం సంతోషంగా ప్రేమగా మారుస్తోంది. రాజు వొచ్చాడు. ఆమె యెదురు వెళ్లి మెళ్లో పూలవేసి కావిలించుకుని తీసుకొచ్చింది.)

శశి — వొచ్చారా! శశిముఖి బెంగపడుతుం దనా యింత తొందరగా వొచ్చేశారు?

(రాజు అనుమానంగా గదిచుట్టూ చూస్తున్నాడు. ఆమె అతనిరొమ్ముమీద తల వానించి గోము చేసి, అతను తనవంకనే చూడాలని తంటాలు పడుతూంది.)

శశి — పాపం! చాలాదూరంనించి వొచ్చారు. అలిసి వుంటారు. పాపాత్మురాలిని నించోపెట్టాను మిమ్మల్ని.

లలితా!

(లలిత వొచ్చింది.)

ఫలహారం యేర్పాటు చెయ్యి.

(లలిత వెళ్లింది.)

రండి, పడదాము. కొంచెం ఫలహారంచేసి ...

(రాజు కదలడు.)

శశి — రారేం? నన్ను విడిచి యిన్ని దినాలు యెట్లా వుండగలిగారూ?

(లోపల వసంత పాడుతోంది.)

పోనీ, పాట వినండి...ఏమిటి అట్లావున్నారు? నామీద కోపమా? నన్ను వొదిలేసి, తరిమేస్తావని చెప్పడానికని వొచ్చారా? కాని మిమ్మల్ని చూసిన కొద్దీ నాకు ఎంతప్రేమ కలుగుతూం దనుకున్నారు? లలితా!

(లలిత వొచ్చింది)

ఫలహారాలు యిక్కడికే తీసుకురా.

(లలిత వెళ్లింది.)

మీ వొళ్లు సరిగా లేనట్టుంది, ఏంచెయ్యను?

రా — వుండు. అబద్ధాలవల్ల ప్రయోజనం లేదు.

శశి — అబద్ధాలా! ఏం అబద్ధాలు?

(రాజు ఎక్కడ ఏ ప్రకారం ప్రారంభించాలా అని యోచిస్తున్నాడు. లలిత ఫలహారాలు పెడుతోంది బల్ల మీద.)

శశి — ఏవో లేనిపోని అనుమానాలతో గోలపడుతున్నారు.

రా — (శాంతగా తల వొంచుకుని) ఒకసారి అనుమానం నిజమయింతరువాత, ప్రతిదీ అనుమానంగానే కనపడుతుంది.

శశి — మీ శశి మీదగ్గరే వుందిగా! ఇంకేం అనుమానం?

(గ్లాసులో షర్బత్ పోసి తను కొంచెం రుచిచూసి అతని కిచ్చింది. అతను పరధ్యానంగా గ్లాసు తీసుకున్నాడు.)

రా — రాత్రింబవళ్లు అనిశ్చాపం నామనసుని తినేస్తోంది. దోవపొడుగునా, ఘోరమైన దృశ్యాలు తోచాయి. ఎప్పుడో యీబాధ భరించలేక నిన్ను చంపేస్తానని భయం.

శశి — చంపెయ్యండి. దానికింత యోచనెందుకు?

రా — చంపి...తరవాత...

శశి — రండి, కొంచెం యీహల్వా తినండి. నా చేతులతో చేశాను.

రా — నాకోసమేనా?

శశి — ఇంక నేను భరించలేను.

రా — ఎవరూ రానేలేదా?

శశి — లేదు.

రా — ప్రమాణం చెయ్యి...

శశి — ప్రమాణం.

రా — అబద్ధమైతే...

శశి — నన్ను నరికెయ్యండి.

రా — అది చాతకాకేకదా! అయితే...

(గది చుట్టూ చూస్తూ) ఆ అద్దం యెందుకు పగిలింది?

శశి — అద్దమా? అది వసంతచేసిన పొరపాటుపని.

రా — ఏమిటి అంత దళసరి అద్దం—

శశి — (తేలికగా నవ్వి) అసలు సంగతేమిటంటే, ఒకపడవవాడికీ దానికీ పరిచయం. వాడు నావని గోడకి కట్టి కూచుంటాడు పైకి చూస్తూ. అదుగో చూశారా ఆనావ...

రా — ఓహో శరేలే. ఎక్కడ దాచావు!

శశి — దాచడ మేమిటి?

రా — ఇంకెందుకులే! చెప్పెయ్యి.

శశి — ఈచాదస్తం వొదలదా?

రా — టక్కరిదానా! నన్ను మోసపుచ్చగలవా?

(అలమారులూ గూటలూ వెతుకుతున్నాడు. శశిముఖి చలనంలేకుండా నుంచుంది. రాజు తివాసీ లాగాడు. చంద్రహాస్ తనంతటే బైటికి వొచ్చాడు ధైర్యంగా)

రా — వొచ్చావా, మృత్యుగృహంలోకి?

(శశిముఖి రాజుని బల్లమీది రాతిపీటతో కొట్టింది. రాజు పెద్దకేకవేసి పడిపోయినాడు. శశిముఖి చంద్రహాస్‌ని కావిలించుకుంది.)

శశి — రా, ఇంక తొరగా రా పోదాము.

చం — వుండు ఏంచేశావు?

శశి — అంటే?

చం — నీమాటలు విన్నాను.

శశి — ఏంమాటలు?

చం — నీ అబద్ధాలు, నీ నటనలు...

శశి — నీకోసం.

చం — ఎవరికోసమైతేనేం?

శశి — ఎంతకఠినుడివి? క్షమించు పోనీ.

చం — క్షమాపణా! నే నెవర్ని?

శశి — రా పోదాం.

చం — నీ మీద ప్రేమ లేదు నాకు.

శశి — నిజమా?

చం — నిజం...

(లోపల కోలాహలం)

శశి — భటులు! తొరగా పో దూకు. బైటికి దూకు.

చం — ఎందుకు?

శశి — నా బాబుకదూ. తొరగా!

చం — పోను. నిన్ను యీ అధోగతికి తెచ్చిన పాపానికి పరిహారం కానీ!

(భటులు వొచ్చి యిద్దర్నీ పట్టుకున్నారు.)

అయిపోయింది.

# సుందరమైన చర్మమునకు జాగ్రత్త అవసరము...



ప్రొద్దస్తమానము బయటతిరుగుటవల్ల మీ లేతనైన ముఖచర్మము గాలి, దుమ్ము, ఎండలకు వాడిపోవును. మీచర్మము మీకు తెలియకనే మొద్దుబారియుండుటయు, కళాహీనముగాను వికారంగాను ఉండుటను చూడడముతోనే మీకు దిగులుకలుగును. సుందరమైనచర్మము స్త్రీకి మెప్పును, ప్రీతియు తెచ్చును. అతిశ్రద్ధతోను, పాలమృదుత్వము పొందియున్న ముఖచర్మమును ఎంతచూచినను తక్కువరే. స్త్రీయొక్క చర్మమునకు జాగ్రత్త అవసరము. అందులో వట్టికడుగుటతో చాలదు. పాండ్సు క్రీమ్ రంధ్రములలోనుండు మురికిని, మాసినశేషమును తీసి అతిశ్రద్ధముగా నుంచును.

పాండ్సు క్రీమ్ సీసానుకొనుడు; మీవ్రేళ్లచివరలతో క్రీమును, మీచర్మముమీద రాయుడు. మృదువైన గుడ్డతో తుడుపుడు. మరియు కొద్దిగావేరే క్రీమును, తేలికగాపూసి, రాత్రింతయు ఆ నాణ్యమైనపొరను ఉంచుడు. ఈ మోస్తరుగ పదిహేనురోజులు రాత్రులయందు వాడుడు. అప్పుడు మీచర్మము మృదువుగా లేతగా అవుచున్నట్టు మీకు తెలియగలదు.

పగలు, గాలి, దుమ్ములనుండి రక్షించుటలో శ్రేష్టమైనది
**పాండ్సు వ్యానిషింగ్ క్రీమ్.**




పాండ్సు క్రీములు అన్నిగొప్ప స్టోర్సులలో దొరుకును లేక **పాండ్సు**, పి. ఒ. బాక్సు 144, బొంబాయికి వ్రాయుడు

# పాండ్సు క్రీమ్

# కాటకం*

శ్రీ చిలుమామిళ్ల విజయపార్థసారథి

( అనువృత్తము )

శ్రీ

కోరినంత బలమ్ము గలవని
కోరడుభూములు పగులదున్ని
వేలావివేలకు మోజుపడి
జేరనులు కట్టించి

చుట్టుప్రక్కల చెఱువుమెరకలు
కట్టుబడికై దొరపొగాకును
వేసిలాభము తీయనెంచి
మోసపోవుటచే

తిండిధాన్యము గొడ్లగవుతము
తీయకూరలు పప్పుగింజలు
కొనగవలసెను డబ్బుపోసి
కొరతగల్గుటచే

కాపువారల క్లిష్టదశకై
కాపువేతురు సాహుకారులు
పగనుపట్టిన కోడెత్రాచై
పట్టికాటందన్

సం, సార మీదట యన్న పెద్దలు
సంద్ర మీదుట యనుచు పోల్చిరి
ఆటుపోటు తుపానులకును
ఆరితేరవలెన్

ఇంతఅంతో యిచ్చుకుంటూ
మంచిచెడ్డలు సాగిపోవలె
కండ్లుకానని ఆడుపులి సం
సార మంటేను

తనకుభార్యకు తోడుపీడలు
తమినిమీరగ యింటిలోపల
వ్రతము లుద్యాపనము చెప్పగ
వచ్చియుండగను

పూలతంగెడుపోలె మేనను
భూషణమ్ములు దాల్చితిరి గడి
బందుగులనందడి గృహమ్మున
క్రందుకొనియుండన్

ప్రొద్దురాగా నెత్తిపైకి
భోజనా లైనంతలో పది
మందితోటి యిష్టగోష్టిలో
పంచపాళీలో

వచ్చుచుండ జవానుతోటి
ఇచ్చియుండిన మారువాడి
పూచికత్తుతో నైన విడువక
తెచ్చివారంటు

ఏమివచ్చి ఏమిపడునో
ఏమికర్మము మూడునో అని
ముందుచూచిన మారువాడికి
మూఛముతప్పింపన్

---

* దీని పూర్వభాగము 1939 - వ సంవత్సరపు [illegible]

చూచిచూడక ముందెలేచి
దిడ్డిదాటి దూరె గోపన
కయ్యలవతలి యింటివెనుకటి
కందిచేలల్లో

ఊరు వెళ్లెనో పొలము వెళ్లెనో
ఉండ రాదా తొందరేమి
ఉంటె కనుపడదా యటందురు
ఊరకట్టెము

గోపికొరకై మూకువాడి
గొందుసందులు వెదకి వెదకి
జాడచిక్కక దోవపట్టెను
జప్తుచేయించన్

అన్నపానీయమ్ములన్ని
చేనిలోపల తెచ్చియిచ్చి
మాటమంతి వెంటనే యజ
మాని కందిస్తూ

కాడిగట్టున మిరపతోటకు
కందికలసిన జొన్నచేనికి
పిట్టకావలిచేస్తు రోశయ
మంచపైనుండి

మూడువేలా చేబదుళ్లు
ముడుపుతీర్చను మిరపతోటని
కోర్కెపడగ ముదతతోటి
కొరివికూలపడెన్

ఎండచూపిన పసరుటాకులు
పండబారిన పచ్చిమిరపలు
ప్రకృతి మాంగల్యమ్ముకూర్చు
పసుపుకుంకుమము

ఎరిగియుండిన ఊరిజనము
ఎగాదిగా చూడసాగిరి
యదాయదలై హృదయుక హారము
ఎదోవిధమయ్యెన్

ఒట్టుపెట్టినయట్లు గోపికి
పుట్టదాయెను చిల్లిగవ్వ
పరువుమర్యాదలు నశించుక
పరపతి నశింపక

తలకుమించిన తాటిలోతై
దరిద్రోవ గానకుండి
నిండుఏటను పడవమాదిరి
నుండెజీవితము

చలియె లేదు సిండమునిగిన
వ్రతము చెడిన సుఖము దక్కదు
పాలవంటి కులమ్ములో పా
షాణమే కలియున్

అనుచు చింతన చేసిచేసి
ఆత్మధైర్యము చిక్కబట్టి
ముందుఎత్తులో గొడ్డుగోదను
వదల మొదలిడెను

దుక్కిటెడ్లను దూడపసరము
దొడ్డిలోపల ఆలమందలు
బరికివేసి సొమ్ముచేసెను
వచ్చినంతటిలో

కోర్టువారు కనికరించి
కోరినట్లుగ వాయిదాలను
ఇచ్చియుండ వసూలుకొంత
తెచ్చియిచ్చుటచే

ఒక్కమారుగ బాకిదారులు
ఒత్తిడిని చేయంగ గోపన
ఊడ్చిపెట్టె చరస్థిరాస్తులు
ఉన్నయంతటిలో

తాతముత్తవ దాచియుంచిన
పాతబంగారమ్ము కాక
పెండ్లిలో చేయించిపెట్టిన
పెద్దపస్తువులు

తొలి, కారులోన చెంగలించి
తొడలులోతున గడ్డిఁబెట్టెడి
బీటిభూముల నమ్మికట్టెను
బోర్డుసర్కార్జి
కాల్వచేరువ తూముమొగిలో
ఖండ ముక్కటి ఆరుకత్తులు
విడిచిపెట్టుచు కండ్లవెంట
విడిచె బిందువులు
కాగితముపై వ్రాలుచేస్తు
కంటిచుక్కలు రాల్చెగోపన
ముదముపొందిన మారువాడి
ముఖము విప్పారెన్
"తడిసితడిసి గుడిసెకప్పక
తారుమారై చెప్పుచుంటిని
ఆచివేచి చూచివేయుడి
అడుగులో అడుగు
వెన్నపూసా వంటిమనసు
వెనుకముందర పారచూడుడు
బుడుతనైనను చూచిపిడికిలి
బిగువుపట్టండి"
అనుచు నెత్తిన నోరుపెట్టుక
అనునయించి చెప్పె రోశయ
అన్నయట్లే జరిగె సర్వము
ఎన్నిరోజులలో
భాగ్యవైభవ ప్రాభవము సౌ
భాగ్యభోగ్యము లన్నియుండి వి
వేకమున్నా తోడుపడవలె
విధివిధానమ్ము

౬

వానజాలుల పొర్లుతోటి
వాగుమడుగులు నిండితొణుకును
వనధియుంకిన తెచ్చిపెట్టె
వనరులెన్నెన్ని
అప, కారబుద్ధి లేకయుండి
అంతొయింతో పెట్టిపోసి
ఆదరించుటచేత గ్రామము
అండ చెడకుండెన్
యావదాస్తి పోగ మిగిలెను
యాభదెకరము పొలము యిల్లు
తట్టలోనిది కాపురమ్ము
బుట్టలో నిమిడెన్
ఎండకన్న వానకన్న
ఎరుగని సుకుమారి చేటికి
మంచిచెడ్డకు తనకుతానై
పాటుపడవలసెన్
తీరిపోయెను ప్రాప్తకాలము
తొలగిపోయెను నాటి విభవము
పువ్వు లమ్మిన వీథిలోపల
బొగ్గు లమ్మినటు
నృతమే మొదలంటకూలిన
పక్షులన్నియు లేచిపో రో
శయ్య మేస్త్రీతనముపో దే
శమ్ము కాకయ్యెన్
పొలి, మేరమీది గ్రామమునకు
పోయెడి రహదారిపడవను
నెలకయిదు రూకలకును స
రంగుగా కుదిరెన్
ఊతకోలకు తాడుచుట్టి
ఊపుకొరకై బుజముపెట్టి
నడుమువంచి గట్టుఅంచున
పడవలాగుచును
గడల కందని లోతునీళ్లలో
తెడ్డు వేసి పయిరగాలికి
రోశయ్య తెరచాప వదలి
పట్టుచుక్కాని

ముసురుపాటున నిండువరదలో
ముప్పు మూడగనున్న పడవను
లంగరొడ్డుకు పట్టిడింపును
భంగపాటునను

పాయ లన్నియు వట్టిపోగా
బాటలన్ని బయటపడ రహ
దారిపడవలు మెరకపట్టగ
తాను యిలుపట్టుక

౭

పగటిభోజన మయిన పిదపను
బయలుదేరిరి ఊరిపెద్దలు
రాశిబీటిలో భాగలబ్ధము
రాళ్లు వేసుకొనగ

కలసి కుశలము తెలసికొనిరి
కాలవిపరీతమ్ము అనిరి
మేలెజరిగెను కీడులో అని
మైత్రియజమాని

రాశిబీడులో భాగమునకు
రాయి కరణము పాతవచ్చును
పోయివత్తము రోశయా హాం
సాయిచూపించగ

అంతుపంతూ తెలియువాడవు
హద్దుపద్దూ లెరుగువాడవు
భుక్తముండిన యంతమట్టుకు
గుర్తుపెట్టించు

కొలతలన్ని పూర్తిచేసి
కొండమీది దేవునికిని
పానకము వడపప్పు అని పది
మంది అనుకొనిరి

లి, కాపుచేసి దేవునికిని
పూజద్రవ్యము సిద్ధపరపుమ
స్వామిగొల్వగ వత్తుమని ఆ
చార్యతో చెప్పి

పెరు, మాళ్లసేపకు గట్టుపైకి
పెద్దలంతా చేరబారిరి
కాపులూ కరణము పటేలు
కడకురోశయ్య

ఊరిపెద్దలు గుంపుచేరి
ఉబుసుపోకకు చెప్పుకొనిరి
స్థలమహాత్మ్యము చుట్టుచూచుచు
తమలో తామంతా

గట్టుక్రిందుగ సిల్లుతొణికెడు
చట్టుసోరియలో తుంగచాటుగ
మొసలిసంతానమ్ము తోటి
మసలుపట్టులను

కాలపరిధుల గాలిసోకుడు
కృష్ణవేణీ అలలతాకుడు
నిబ్బరించీ నగము నేటికి
నిలిచియుండినది

పౌరలమాటుగ పలకలందున
తెలుగుచరిత్రము దాచుకొన్నది
యుగయుగమ్ముల సంపుటమ్ముల
నగలుపెట్టుకొని

అమృతతుల్యము జీవతటికిని
ఆణిముత్యపు కంఠహారము
తెలుగుతల్లికి కృష్ణవేణికి
తేజమింపొందెగ

ఎదుటిఒడ్డున యామ్యదిశను
ఇసుకతిన్నె సమీపధాత్రిని
భరద్వాజాశ్రమాహార్యము
పాపహరమౌచు (సశేషము)

# బదరీనారాయణయాత్ర

శ్రీ మంత్రిప్రగడ నరసింహం

## మొదటిభాగము

శ్రీ పరమేశ్వరుడు సృజించిన జంతుజాలములో పశుపక్ష్యాదులకంటె మనుష్యునకు బుద్ధిని అధికముగా నిచ్చెను. ఆ బుద్ధిని సరిగా నుపయోగించుకొని, యీ సంసారసముద్రమునుండి తరణోపాయమును వెదకి కొనవలయును. అట్లు చేయనిచో భగవంతు డిచ్చిన బుద్ధి నిరర్థక మగును.

తరించుటకు మార్గములు మనశాస్త్రములయం దనేకములు చెప్పబడినవి. అందులో ముఖ్యములు భక్తి, కర్మ, యోగము, జ్ఞానము. వీటి కన్నిటికినీ ముఖ్యసాధనము చిత్తశుద్ధి.

యాత్రలవలన చిత్తశుద్ధి కలుగును. హిందూమతమువారే గాక, యితర మతస్థులును యాత్రలకు ప్రాముఖ్యము నిచ్చిరి. పూర్వము క్రైస్తవులు యేసుక్రీస్తుయొక్క జన్మస్థానమునకు యాత్రచేసెడివారు. ఇప్పటికినీ వారిలో కొన్ని తెగలవారు పోవుదురు. భక్తిపరులగు మహమ్మదీయులు అరేబియాలోని మక్కా, మదీనాలకు యాత్రచేయుదురు. బౌద్ధులు గౌతమబుద్ధుడు తపస్సుచేసి జ్ఞానోదయము నొందిన బుద్ధగయకును, బుద్ధుడు ప్రథమమున బోధచేసిన కాశీకి సమీపమునన్న సారనాథ్ అనే ప్రదేశమునకును, చైనా, జపాన్ మొదలగు దూరదేశములనుండి కూడా యాత్రకు వచ్చెదరు. హిందువుల కన్ననో, మనదేశమున తీర్థయాత్రాక్షేత్రములు వేనవేలు కలవు. అనేకులు తీర్థయాత్రలు సేవించుచునే యున్నారు. వేలకొలదిగల యీ క్షేత్రములలో, నాలుగు ఉత్తమ క్షేత్రము లని చెప్పబడినవి. వీటినే హిందీభాషలో "చార్ ధామ్" అని చెప్పుదురు. అనగా నాలుగు ధామములు—భగవచ్ఛక్తి యత్యధికముగా వ్యక్తమగు నాలుగు ప్రదేశము లని యర్థము. ఇవేవి యనగా:—

ఉత్తరమున శ్రీ బదరీ నారాయణ క్షేత్రము, తూర్పున శ్రీ జగన్నాథము, దక్షిణమున శ్రీ రామేశ్వరము, పశ్చిమమున శ్రీ ద్వారకాపురి. ఈనాల్గింటిలో శిరోభూషణమువంటిది శ్రీ బదరీనారాయణక్షేత్రము.

"ఉత్తర ఖండయాత్రలు" అని పేరొందిన యాత్ర లన్నియు హిమవత్పర్వతములలో నున్నవి. అందులో ముఖ్యములు, (౧) గంగోత్రి (గంగానది పుట్టిన స్థలము), (౨) యమునోత్రి (యమునానది పుట్టిన స్థలము), (౩) కేదారము, (౪) బదరీనారాయణము, (౫) కైలాసగిరి. వీటిలో మొదటి నాలుగు యాత్రలు ప్రారంభించుటకు ద్వారము హరిద్వారము (మాయాపురి). ఈ యాత్రలకు కల దూరము ముందు వివరింపబడును.

యమునోత్రి, గంగోత్రియాత్రలు బహు కష్టమున్నా, చాలా దినములుకూడా పట్టును. వీటికంటె తక్కువ కష్టమైనది కేదారయాత్ర. బదరికి కేదారనాథంగుండా పోయినచో యింకా సుమారు దెబ్బది మైళ్లు యెక్కువ యుండును. కేదారమువద్ద శీతలము కూడా బదరీకంటె అధిక మని చెప్పుదురు.

ఉత్తరదేశయాత్రల మహిమ స్కందపురాణములో కేదారఖండమున చెప్పబడినది.

కైలాసగిరియాత్ర బహు కష్టతమమైనది. మధ్య మార్గములో వంటచేసుకొని తినుటకు "చట్టీ"లైనను యుండవట. "చట్టీ"లనగా, ఉత్తరఖండయాత్రా మార్గమున యాత్రికులు మకాంచేసి వంట చేసుకొని విశ్రమించుట కేర్పడిన ప్రదేశములు. కొందరు దుకాణదారులు గవర్నమెంటు, లేక తెహరిరాజ్యము (**Tebri state**)వల్ల లైసెన్సులను పొంది, యాత్రామార్గములలో దుకాణములను పెట్టి, యాత్రికులు బస

చేయుటకు దుకాణములను చేర్చి మట్టికొట్టడములను కట్టియుంచుదురు. యాత్రికులు తమకు కావలసిన భోజనపదార్థములను దుకాణదారులయొద్ద కొనినచో, వారికి బసయును, వంటచేసుకొనుటకు పాత్రములను యిచ్చెదరు.

“చార్ ధామ్” (నాలుగుధామములు) లోను శ్రీబదరీనారాయణము మొదటిగా గణింపబడుచున్నది. ఈ యాత్రకు హిందూదేశములోని యన్నిరాష్ట్రముల నుండియు ప్రతిసంవత్సరమును వేలకొలది జనులు వచ్చుచుందురు. వేరు వేరు దుస్తులు, వేరు వేరు భాషలు, ఆచారములు, అభ్యాసములు గలిగియుండియు, అనేక రాష్ట్రములనుండి వచ్చెడు హిందూ మాతయొక్క పుత్రులు, పుత్రికలును, శ్రీ బదరీనాథునియందు గలభక్తి పారవశ్యముచే, అనేకకష్టముల కోర్చి, మంచుకొండల నడుమ ౧౦,౫౦౦ అడుగుల యెత్తునున్న యీ చిన్ని గ్రామమున నొకేపర్యాయము సమావేశమగుట బహు చిత్రమగు దృశ్యము. పంజాబు, రాజపుత్రస్థానము, కాశ్మీరము, నేపాళము, బొంబాయి, వంగదేశము, బీహారము, సంయుక్తపరగణాలు, దక్షిణహిందూస్థానము, మున్నగు సకలదేశములవారిని యేకసమయమున మనము బదరీనారాయణములో చూడగలుగుదుము. ఇట్టి సమ్మేళనమును మన మే యితర పుణ్యక్షేత్రమునందును జూచుట తటస్థించదు. నానా దేశీయుల యీ సమ్మేళనములో, మన దక్షిణహిందూస్థానపు ప్రజల సంఖ్యయే బహుస్వల్పమని చెప్పట కొంతయు చింతించవలసియున్నది. ఈ యాత్రికులలో పురుషుల సంఖ్యకంటె స్త్రీలసంఖ్య యధికము. దీనినిబట్టి సర్వసామాన్యముగా పురుషులకంటె స్త్రీలకుదైవభక్తియధికమనియు,మదరాసు రాష్ట్రీయులకంటె, ఉత్తరహిందూస్థానీయులకు భక్తియధికమనియు, నొప్పుకొనకతీరదు. ఉత్తరహిందూస్థానమునుండి వచ్చెడు స్త్రీలలో అనేకులు వయోవృద్ధలు. ౭౦ సం. దాటిన వయస్సు కల వారు కూడా ఉందురు. యాత్రకు వచ్చిన వారిలో కొందరు సాధువులను, గ్రుడ్డివారిని, కుంటివారినికూడా చూచితిని. ఇట్టి వృద్ధులు, వికలాంగులు కాలినడకనే యీదుమ్ముకాలమున యాత్రచేయుచుండగా, యింద్రియ పటుత్వము గలవారు నరవాహనముపై యాత్రచేయుట లజ్జాకరముగా కాన్పించును. నేను కలసి మాట్లాడిన యిరువురు వృద్ధస్త్రీల విషయము మచ్చుగా మూడవ భాగమున వివరింపబడినది.

## బదరీ నారాయణం

శ్రీ బదరీ గ్రామము హిమవత్పర్వతముల నడుమ, సముద్రమట్టమునకు సుమారు ౧౦,౫౦౦ అడుగులఎత్తున, నరనారాయణపర్వతములు రెంటికిని మధ్యనున్న కోనలో నొక చిన్నగ్రామము. హిమవత్పర్వత పంక్తి హృషీకేశమువద్ద ప్రారంభ మగును. హృషీకేశము హరిద్వారమునకు ౧౫ మైళ్లలో నున్నది. బదరీక్షేత్రము గంగానది కుపనదియగు అలకనందానదీతీరమున నున్నది. అలకనందానది పుట్టుక బదరికి సుమారు యిరువది మైళ్లలో నున్నది. ఈ ప్రదేశమున నరనారాయణు లిరువురున్నూ తపస్సుచేసి రని పురాణగాథ కలదు. సమీపమున నున్న పర్వతములలో నొకటి నర పర్వతమనియు, నింకొకటి నారాయణపర్వత మనియు, యిప్పటికినీ పిలువబడుచున్నవి. ఆలయమున విష్ణు పంచాయతనము గలదు. వివరముగా : నడుమను బదరీనాథుడు ; స్వామికి యెడమవైపున లక్ష్మి, నర, నారాయణులు ; కుడిప్రక్కను కుబేరుడు, గణనాథుడు, గరుడుడు ; క్రింద నారద ఉద్ధవులు.

ఈ గ్రామమున కిరుప్రక్కల నున్న నరనారాయణపర్వతములు సదా మంచుతో నిండియుండి,సూర్యరశ్మిలో స్వచ్ఛమగు తెల్లని కాంతులతో, వెండి కొండలవలె బహు రమణీయముగా కాన్పించుచుండును. ఈ గ్రామములోని యాలయము, అన్ని గృహములూ, సంవత్సరమున కారుమాసములు, అనగా నవంబరునెల మొదలు ఏప్రియల్ నెలాఖరువరకూ, పూర్తిగా మంచుతో కప్పబడియుండును. ఇండ్ల కప్పులమీద చాలా యెత్తువరకూ మంచు కప్పుటచేత, గ్రామ మెక్కడ నున్నదీ యానవాలైనమూ తెలియకుండునట్లు, ఒకటే పెద్ద మంచుగడ్డ మాత్రము కాన్పించుచుండునట. నవంబరులో మంచు తీవ్రముగా పడుటకు ప్రారంభించినది మొదలు, వీధులు కనుపడకుండా మంచుతో నిండిపోవుచుండగా,

దుకాణదారులు, యితర కాపురస్థులు, తమతమ సామగ్రులను తీసుకొని, యిళ్లు ఖాళీచేసి తాళములు వేసుకొని, దిగువను ౧౯ మైళ్ల దూరమున నున్న జోషీమఠము అను గ్రామమునకు వెడలిపోవుదురు. అక్కడ నిలుచుట కికవీడదట సాధ్యము కాదని తోచువరకు స్వామికి అర్చన జరుగుచుండును.

స్వామిని ముట్టుకొని అర్చన, అలంకారము చేయుటకు అధికార మొక్కరికే కలదు. ఆయనకు "రావల్ సాహేబు" అని బిరుదు. వీరు మలయాళ దేశపు బ్రాహ్మణులు. వీరిని తిరువాన్కూరు, టెహరీ రాజ్యముల ప్రభువులు నియమింతురు.

ఆఖరురోజున అర్చన అయిన తరువాత, స్వామియొక్క యలంకారము లన్నియు తీసి భద్ర పరచి, గర్భాలయమున, నేతితో నొక జ్యోతిమాత్రము వెలిగించి పెట్టి, ఆలయముతలుపులు తాళంవేసి, "రావల్"గారును, "టెహరీ" సంస్థానము తరఫున నొక ప్రతినిధియు, యిరువురును వారివారి ప్రత్యేకపు సీళ్లు వేసి, వెడలిపోవుదురు. అప్పటినుండి గ్రామమున నొక మనిషియైన నుండడు. ఆరునెలలు పూర్తిగా మంచు క్రింద కప్పబడియున్న గ్రామము, సుమారు ఏప్రియల్ ఆఖరుకు, సూర్యునివేడిమిచే మంచు కరిగి బయలు పడుటకు ప్రారంభించును. అప్పుడు గ్రామవాస్తవ్యులును, పనివాండ్ర సిబ్బందియును వచ్చి, యిండ్ల నుండియు, వీథులనుండియు మంచును తొలగించి శుభ్రపరచుకుందురు. మంచువలన చాలా యిండ్లకు నష్టము కలిగి మరమ్మతులు చేసుకొనవలసియుండును. ఇండ్లు తిరిగీ వాసయోగ్యము లైనతరువాత, దుకాణదారులును, ప్రజలును తిరిగీ గ్రామమునం బ్రవేశింతురు. ఆలయము తెరచుట కొకదినము యేర్పాటు చేయబడును. ఆ రోజున "రావల్"గారును, టెహరీసంస్థానపు ప్రతినిధియు, దేవళం మేనేజరు మొదలగువారును స్వామిని, జ్యోతిని ప్రథమదివసమున దర్శించుటకు వచ్చిన యాత్రికులయెదుట, సీళ్లను తనిఖీచేసి, బద్దలు కొట్టి, తాళములు తీయుదురు.

## జ్యోతి

ఆలయము తలుపులు తాళములు వేసి సీళ్లువేయు సమయమున, ఆలయములో నొక జ్యోతి వెలిగించబడు నని చెప్పి యుంటిని. సుమారు నాలుగైదు సేర్ల నేతిని, విశాలమగు మూతిగల గిన్నెలోపోసి, దట్టముగా పేనబడిన లావుపాటి వత్తినందులో నుంచి వెలిగింతురు. తర్వాత తలుపులు మూసి, తాళములు సీళ్లు వేయుదురు. ఆరునెలలు ఆలయ మెక్కడ నున్నదీ గుర్తె లేకుండా మంచుచే కప్పబడియుండును. ఆయారుమాసములు స్వామియర్చన దేవతలు చేయుచుందురనియు, అందుచేత తిరిగీ తలుపులు తెరచినప్పుడు జ్యోతి వెలుగుచుండు ననియు చెప్పబడుచున్నది.

ఆలయము తెరవబడు ప్రథమదివసమునకు బదరి ముందుగాం జేరియుండిన యాత్రికులు, తలుపులు తెరచునప్పటికి జ్యోతి వెలుగుచున్నదీ లేనిదీ, ప్రత్యక్షముగా చూడగలుగుదురు. ఆనాటికి యింకా రస్తాయందును, బదరిగ్రామమునందును మంచు మిక్కుటముగా నుండును గనుకను, ప్రథమదిన స్వామిదర్శనమునకు వెళ్లెడు యాత్రికుల సంఖ్య బహు తక్కువగా నుండును భీతిచేతను, నేను ప్రథమదివసమున, బదరిలో సిద్ధముగా నుండుటకు సాహసించలేదు. కాని, ప్రత్యక్షానుభవము గల కొందరితో ముచ్చటించితిని. దేవళము మేనేజరుగారితో యీ విషయమై ప్రసంగించగా, ఆయన ప్రతి సంవత్సరము తలుపులు తెరచునప్పటికి జ్యోతి వెలుగు చుండుటం జూచుచున్నామని చెప్పిరి. ఈయన జీతము, అలవెన్సు సహితముగా నెలకు రూ ౨౦౦ లు పుచ్చుకొనుచున్న అధికారి. ఈయనకు అబద్ధమాడవలసిన యగత్యము కాన్పించదు. అయినను, వీరు దేవళపు అధికారి యగుటచే వీరిమాట యటుండనిండు. ఈ సంవత్సరము, ప్రథమదినమునకే, దేవళద్వారములు తెరచునప్పటికి బదరిచేరి సిద్ధముగా నుండిన, సేలం జిల్లా వాస్తవ్యులు, ఉన్నతకుటుంబమునకు చెందినవారును నగు నొక గృహస్థును విచారించితిని. ఈయన యింగ్లీషువిద్య నభ్యసించినవారగుటచే, యిట్టి యలౌకిక విషయములు స్వయముగా చూడనిదీ, నమ్మునట్టి స్వభావము కలవారు కారు. జ్యోతియొక్క నిజానిజములు స్వయముగా కనుగొనుటకే వీరు ప్రథమ దివసమునకు బదరి చేరిరి. ఈయన చెప్పిన

"రావల్" గారును, తెహరీ సంస్థాన ప్రతినిధియును, తాళముల పైసీళ్లను పగులగొట్టి, తమతమ యొద్ద నున్న తాళపుచెవులతో తాళములను తీసి, తలుపులు తెరచు నప్పుడు తాను దగ్గరనే యుంటి ననియు, లోపల జ్యోతి వెలుగుచుండుట యథార్థ మనియు, అది చూడగా తనకు దేహము పరవశమాయె ననియు, వెలుగుచున్న జ్యోతిని రావల్‌గారు వెలుపలకు తీసుకొని వచ్చి యుంచగా, చేరియున్న యాత్రికు లందరూ నమస్కరించుచూ సంతోషముతో "బదరీనాథ్ విశాల్ కీ జై!" అని పెద్దరవము చేసి రనియు, జ్యోతి వెలిగింపబడిన గిన్నెలో యింకా కొంతనెయ్యి మిగిలియున్నదనియు చెప్పిరి. నాలుగైదు శేర్ల నేతితో వెలిగించబడిన జ్యోతి, కొద్ది రోజులలో పూర్తిగా ఆ నేతిని గ్రహించి యారి పోవునుగాని, ఆరుమాసములు వెలుగుచుండుట సాధారణముగా నసంభవము. మరియు, పూర్తిగామంచుచే గప్పబడియుండు యింటిలోనికి వెలుపలనుండి ప్రాణవాయువు ప్రవేశింపజాలదుగనుక, జ్యోతి యారుమాసములు వెలుగుచుండుట ప్రకృతిశాస్త్ర సూత్రములకు విరుద్ధ మనియు, పలువురు తలంచవచ్చును. ఇట్లు తలంచెడివారు తమజ్ఞానము పరిపూర్ణ మైనదనియు, తమకు తెలియని విషయములు సర్వశక్తిమంతుడగు భగవంతుని సృష్టిలోనే యుండుటకు వీలులే దనియు, భ్రమించుచుండెడి అహంభావపూరితులని చెప్పవచ్చును. ఇప్పటి కాలపు శాస్త్రవేత్తలు, తమ శాస్త్రజ్ఞానముతో సమన్వయించుటకు సాధ్యపడని విషయముల కెన్నిటిని మనము చూచుచుంటిమి! కణకణలాడుచున్న పెద్ద నిప్పులగుండములో నెమ్మదిగా నడువగలసామర్థ్యము గలవారు కొందరు గలరు. ఇట్టివారి నొకరి నీనడుమ, యింగ్లాండులోని శాస్త్రవేత్తలు, అగ్నిలో నడిపించి తీవ్రమైన పరీక్షచేసి, యేమియు మోసములేదని స్థిరపరిచిరి. కాని, అరికాళ్ల కేమియు వేడిమి తగులకుండా అట్లు నడువగలుగుటకు కారణములను మాత్రము కని పెట్ట లేకపోయిరి. ఈ నడుమనే ఒకయోగి, కొన్ని గంటలవరకు భూమిలో కప్పెట్టబడి, తర్వాత భూమి త్రవ్వి ఆయనను పైకితీయగా సజీవుడై యుండెననియు, కొంతసేపటికి సమాధినుండి లేచెననియు వార్తాపత్రికలలో జూచియున్నాము. ఇట్టి యలౌకిక సంభవములను యేశాస్త్రజ్ఞులు తమ జ్ఞానముచే సమన్వయింప గలరోకనుక, జ్యోతినిగురించి, తత్ప్రదేశమునకుబోయి, ప్రత్యక్షముగా నిజానిజములను విచారింపకయే, స్వయముగా చూచితిమని చెప్పినవారి వాక్యము లబద్ధములని, దూరమునుండియే నిరాకరించుట బుద్ధిమంతుల లక్షణము కాదు. ఆ ప్రదేశమున, నేమిమహిమ యున్నదో కదా, యని యూరకుండుటయే యుక్తము.

## తప్తకుండము

పరమేశ్వరుని సృష్టివైచిత్ర్యము చూడుడు! నీరు మంచుగా గడ్డకట్టుకొనిపోవు నాదుర్గశిలల మధ్యస్థమున నొక తప్తకుండము గలదు. ఈ యుష్ణోదకమునకు ఊట, కొండల మధ్యనుండి ఎక్కడ నున్నదో కాని, రేయుంబవళ్లు నిరంతరముగా వేడినీటి ప్రవాహము, ఆలయమున కెదురుగా కొద్దిగజములలో వచ్చుచుండును. యాత్రికుల సౌకర్యమునకుగాను, ఈయుష్ణోదకమున కొక పెద్ద గచ్చుకుండము కట్టబడినది. ఆ కుండములో సుమారు ౩౦మంది, ఒక్కసారిగా దిగి స్నానము చేయవచ్చును. ఆ కుండములో దిగి స్నానము చేయుటకు వీలుగా, రత్తి అడుగుల లోతుమాత్రము నీరు నిలచియుండునట్లును, యెక్కువజలము వెలుపలకు పోవునట్లునూ, తూములు కట్టబడియున్నవి. నిరంతర ప్రవాహ ముండుటచే, జనులు కుండములో దిగి స్నానము చేసినను, జలము శుభ్రముగానే యుండును. జలముయొక్క ఉష్ణము ౧౨౦ డిగ్రీలుండుటచే, చేతితో స్పృశించినప్పుడు మిక్కిలి వేడిగా కనపడినను, కుండములోనికి దిగి నొక్కమునుగు వేసినతర్వాత, ఆ వేడినీటిస్నానము బహుసౌఖ్యకరముగా నుండును. కుండములో దిగుట కిష్టములేనివారు, దానిలోని ఉష్ణోదకమును బిందెలతో తమ బసలకు గొని పోవుదురు. గ్రామమంతయు పూర్తిగా మంచుచే గప్పబడియుండు శీతకాలములో సహితము, యీకుండ మొకటియే మంచుయొక్క సంపర్కములేక, మంచు నడుమ కనుపడుచుండును.

## బ్రహ్మకపాలము

ఇది బదరిని చేరియే, అలకనందానదియొడ్డున నున్నది. దీనిని గురించి పురాణగాథ యేమనగా:

శివుడు పూర్వము బ్రహ్మయొక్క అయిదవశిరస్సు ఖండించినపుడు, దానివలన కలిగిన పాతకముచే, ఆ శిరస్సు శివుని హస్తములో నంటుకొనిపోయెను. ఎన్ని విధములఁ బ్రయత్నించినను అది శివుని చేతినుండి ఊడిపడినది కాదు. అనేక పుణ్యక్షేత్రములకుఁ బోయినను ప్రయోజనము లేకపోయెను. తుదకు శివుడు బదరికాశ్రమమునకు రాగా, దోషనివారణమగుటచే అక్కడ అలకనందానదీతీరమున శివునిచేతినుండి బ్రహ్మకపాలము క్రిందను పడిపోయెను. ఇప్పటికినీ ఆ ప్రదేశమున, కొంచెము కపాలాకృతిగల పెద్ద శిల కలదు. యాత్రికు లిక్కడ, తమ పితృదేవతల నుద్దేశించి పిండశ్రాద్ధము చేయుదురు. బ్రహ్మకపాలములో పితృదేవతలకు పిండములు వేసిన తర్వాత, గయా, ప్రయాగ మొదలగు క్షేత్రములలో పిండములు వేయ కూడ దనియు, తర్వాత పితృకార్యములు పెట్టకూడ దనియు శాస్త్రములలోను, పురాణములలోను కల దని చెప్పుదురు. ఎందుచేత ననగా, బ్రహ్మకపాలములో పిండముల నందుకొన్న పితృదేవతలు, పితృలోకము నుండి విముక్తులై మోక్షము నొందుదురు. అట్టివారికి సాంవత్సరిక శ్రాద్ధములు పెట్టుటచేతను, అన్యక్షేత్రములలో తిరిగి పిండములు వేయుటచేతను, వారిని తిరిగి ఆవాహన చేయుట యగును గాన, వారు పతితు లగుదు రని పురాణములలోఁ జెప్పబడినది.

## శతోపంథ

పాండవులు స్వర్గమునకుఁ బోవునపుడు బదరికాశ్రమమునకు వచ్చిరనియు, నక్కడనుండి ౧౫ మైళ్ల దూరములో నున్న శతోపంథ యను ప్రదేశమున స్వర్గారోహణముఁ జేసిరనియు, స్థలపురాణము గలదు. ఈ శతోపంథ బహుదుర్గమ మైన ప్రదేశము. బదరి నుంచి యిక్కడకు యేర్పడిన మార్గమే లేదు. కొండలలోను, రాళ్లలోను, మంచులోను, బహు జాగరూకతతో కష్టముమీద పోవలసియుండును. యాత్రికు లక్కడకుఁ బోవుటకు సాహసించరు. నేను నూ అట్టి ప్రయత్నము చేయలేదు. కాని యీ ప్రదేశము రమణీయ మైన దని చెప్పుదురు. శాశ్వతముగ మంచుతోఁ గప్పబడి, వెండికొండలవలె నుండు గొప్ప పర్వతముల నడుమ, సుమారు ౧౩ మైళ్లు వైశాల్యము గల గొప్ప సరోవరము కలదు. పర్వత శిఖరములనుండి జారెడు భయంకర పరిమాణము గల మంచుగడ్డలు (**Avalanches**) క్రిందపడి, ఛిన్నభిన్నములగుచు కలిగించెడు భీకరారవము మేఘగర్జనము వలె పర్వతపార్శ్వములనుండి యనేక ప్రతిధ్వనులను గలిగించుచు మృదంగము వాయించుచుండ, కొండ చరియలనుండి స్రవించెడు జలధారలు నిరంతర మంద స్వరముతో శ్రుతివేయుచుండ, ప్రచండమారుత మతి వేగముగా వీచుచు, పర్వతగుహాముఖములనుండి, మురళీగానముఁ జేయుచుండ, ప్రకృతిదేవి తన సహజ సౌందర్యముతో వికట నాట్యమాడుచున్నదా యనునట్లుండును.

## పంచప్రయాగలు

రెండునదుల సంగమప్రదేశమును ప్రయాగ యని చెప్పుదురు. బదరికాశ్రమమునకుఁ బోవుమార్గమున పంచప్రయాగలు గలవు.

హరిద్వారమునుండి ౫౮ మైళ్లదూరమున దేవ ప్రయాగయను మొదటిప్రయాగ గలదు. ఇక్కడివరకూ మోటారుబస్సులు, కారులు వెళ్లుటకు, కొండపార్శ్వమున నొక మోటారు రోడ్డు కలదు. ఇక్కడ అలకనందానది భాగీరథిలో చేరును. అసలు గంగోత్రినుండి వచ్చునది భాగీరథి. అలకనంద దానిలో చేరు ఉపనది. ఈ రెండునదుల సంగమము మొదలు దిగువకు ప్రవహించునది గంగానది యను పేరునఁ బిలువబడును. గంగోత్రికిఁబోవు యాత్రికు లీ గ్రామమునుండియే భాగీరథియొడ్డుననున్న మార్గమునఁ బోవుదురు. కేదారనాథం, బదరికిఁ బోవువారు, అలకనంద యొడ్డునఁ బోయెదరు. రెండవది రుద్రప్రయాగ. ఇది యలకనందా, మందాకినీనదుల సంగమప్రదేశము. కేదారనాథం పోవువా రిక్కడనుండి మందాకినీతీరమునఁ బోవుదురు.

మూడవది కర్ణప్రయాగ. ఇచట పిండారిగంగ యను నది, యలకనందలో సంగమించును. తర్వాతఁ గొంతదూరమున నందప్రయాగయొద్ద, మందాకినీనది యలకనందలోఁ జేరును. ...

దూరమున విష్ణుప్రయాగ గలదు. అచట, విష్ణుగంగ యలకనందలోఁ గలియును. ఈ యైదు ప్రయాగల యందును, నదుల సంగమప్రదేశమున యాత్రికులు స్నానము చేయుదురు; లేక సంప్రోక్షణము చేసుకొని యాచమనముతో సరిపుచ్చుకొందురు.

## మార్గము

హరిద్వారమునుండి బదరికి దూరము ౧౭౩ మైళ్లు. హృషీకేశమువరకూ (౧౫ మైళ్లు) మంచిరోడ్డు కలదు. అక్కడ నుండి దేవప్రయాగవరకూ కూడా (౪౪ మైళ్లు) రోడ్డు కలదు, కాని, యిది పర్వతము యొక్క పార్శ్వభాగమును బ్రద్దలుకొట్టి, చదునుగాఁ జేసి క్రొత్తగా తెహరీప్రభుత్వము వారివల్ల వేయబడిన రోడ్డు అగుటచే, యిప్పటికినీ, యిది మూడవ క్లాసు రోడ్డుగానే యున్నది. ఈరోడ్డుమార్గ మంతయు, గంగానదియొక్క పశ్చిమ గట్టున నున్నది. ఇప్పుడు, హృషీకేశమునుండి దేవప్రయాగవరకూ అయిదు మోటారు బస్సులున్నూ, నాలుగు టాక్సీ (Taxi) లున్నూ మాత్రమే లయిసెన్సులు పొంది తిరుగుచున్నవి. హరిద్వారము నుండి హృషీకేశము వరకూ, అనేక బస్సులు, కార్లు పగలు సర్వకాలములయందు, యిటూ అటూ తిరుగుచుండును. కాని, హృషీకేశము నుండి దేవప్రయాగకు క్రొత్తగా వేయబడిన కొండమార్గ మగుటచే, యిప్పుడు "యేకదిశామార్గము" (One way road) గా జరుగుచున్నది. అనగా, ఉదయం ౧౦ ఘంటలకు బస్సులు, కార్లు హృషీకేశములో బయలుదేరి, సాయంత్రము నాలుగు, అయిదుఘంటలనడుమ దేవప్రయాగలో చేరును. ఆ కాలములో యెదురుగా, హృషీకేశము వైపునకు బస్సులు, కార్లు పోవుటకు వీలులేదు. ఎందుచేత ననగా రోడ్డు ఒక్కకారు పోవుటకే తగినవెడల్పు కలదియును, కొండలలో చాలావొంపులు కలదియు అయియున్నది. కావున, సాయంత్రమునకు దేవప్రయాగ చేరిన మోటారు బండ్లు, రాత్రికి అక్కడ నిలచియుండి, మర్నాడుద యమున ౫ గంటలకు బయలుదేరి, ౧౦ గంటల లోపున హృషీకేశము చేరవలయును. దేవప్రయాగనుండి యిరువది మైళ్ల దూరముననున్న శ్రీనగరమువరకూ కూడా తెహరీరాజ్యమువారు మోటారుబండ్లు పోవుటకు రోడ్డు తయారు చేసినారు. రాబోవు సంవత్సరమునుండి మోటార్లు శ్రీనగరమువరకూ పోగలవని చెప్పు చున్నారు.

కాలినడకమార్గము, హరిద్వారమునుండి హృషీకేశమువరకున్నూ, యింకా ముందు నాలుగుమైళ్ల దూరముననున్న "లక్ష్మణఝూలా"వరకున్నూ, మోటారు రోడ్డు వెంబడినే యున్నది. కాలిబాటను బోవువారు లక్ష్మణఝూలావద్ద వంతెన దాటి, గంగానది తూర్పు ఒడ్డునకుఁ బోవలయును. అక్కడనుండి బదరివరకూ మార్గము గంగానది యొక్కయు, అలకనంద యొక్కయు, తూర్పుఒడ్డుననే పోవును. నదికి పశ్చిమపు ఒడ్డుగ్రామములు తెహరీరాజ్యములో జేరి నవియు, తూర్పుఒడ్డు గవర్నమెంటు యిలాకావి అయియున్నవి. ఈమార్గము, పర్వత పార్శ్వము తెగగొట్టబడి చదునుగాఁ జేయబడిన దారియై యున్నది. సాధారణముగా నిది నాలుగు అడుగులు వెడల్పు గలదిగా నుండును. కొన్నికొన్ని ప్రదేశ ములయందు మూడు, రెండు అడుగుల వెడల్పు మాత్ర మే కలిగియుండును. యాత్రికు లట్టిచోట్ల బహు జాగరూకతతోఁ బోవలసియుండును. కుడివైపున ఆకాశము నంటెడు కొండ యుండును. ఎడమ వైపున అగాధమగు లోతున గంగ ప్రవహించుచుం డును. నదీప్రవాహము కాలిదారికి ౨౦౦ ల అడు గులు మొదలు ౨౦౦౦ ల అడుగుల లోతున, నిరంతర శ్రావ్యముతో, రాతిపడకపై పారుచుండును కొన్ని చోట్ల నది రెండున్నతపర్వతముల నడుమ సన్నగిలి, సర్పాకృతితో ప్రవహించునప్పు డా సౌందర్యము వర్ణ నాతీతముగ నుండును.

## వాయుయానము

ఢిల్లీనుంచి గాని, హరిద్వారమునుండి గాని, బదరీ మార్గమునకు నడుమనున్న "గౌచారము" (Gowchar) అనే గ్రామమువరకూ వాయువిమానములపై (Aeroplanes) ప్రయాణము చేయవచ్చును. కాని యిది యంత సౌకర్యమని తోచదు. ఏలననగా, గౌచా రమునుండి బదరికి ౭౩ మైళ్లదూర ముండును. గౌచార

మునుండి యీ డెబ్బదినూరు మైళ్లు కాలినడకనే పోవలసి యుండును. నడువలేనివారి కచ్చట డోలీలైనను దొరకవు. గౌచారమువద్ద యాత్రికుల బసలకు తగిన వసతులుకూడా లేవు. గౌచారమువరకైనను వాయువిమానము లిప్పుడు పోవుట లేదని వినుచున్నాము. గౌచారము కెదురనే, వాయువిమానములు దిగుటకు విశాలమైన బయలు ప్రదేశము గలదు. ఇందు విషయమై తెలిసికొనగోరువారు: (**Himalaya Air Transport Ltd , Hardwar**)కు వ్రాసి తెలుసుకొనవచ్చును.

## వసతులు

యాత్రికు లందరు సర్వసామాన్యముగా, హరిద్వారమునుండి దేవప్రయాగవరకు మోటారుమీద పోయి, యక్కడనుండి కాలినడకను పోవుదురు. అట్లు చేసినచో, సుమారు ౧౨౫ మైళ్లు మాత్రము నడువవలసియుండును. నిరుపేదలగు బైరాగులు, సాధువులు మున్నగువారు హరిద్వారమునుండియే కాలినడకను బోవుదురు. నడచిపోవుటయే యెక్కువ సౌఖ్యముగాను, దేహమున కారోగ్యముగాను ఉండును. ప్రారంభమున నొకటి రెండురోజులు పిక్కలలో నొప్పి పెట్టును కాని తర్వాత నభ్యాస మగుటచే నేమియు కష్టముగా తోచదు. పురుషులేకాక, యనేకులు స్త్రీలు, వృద్ధులు, బాలురు, బాలికలు కాలినడకనే బోవుదురు. యాత్రకుఁబోవుచున్న దాక్షిణాత్యకుటుంబమువా రొకరు, దేవప్రయాగలో మాతోఁ గలసిరి. అక్కడనుండి వారును మేమును కలసి, యేకపార్టీగా, యాత్ర ముగించుకొని, హరిద్వారము వచ్చువరకు, ప్రయాణముఁ జేసితిమి. వారిలో యిరువురు, యెప్పుడును నడకప్రయాణము నెరుగని సుకుమారస్త్రీ లుండిరి. వారును, మొదట కొంచెము కాళ్లనొప్పులతో బాధపడినను, తర్వాత సునాయాసముగా నడువగలిగిరి.

ప్రయాణికులు తెల్లవారుజామున ౫ గంటలకు పూర్వమే నడచుట కారంభింతురు. అప్పుడు చల్లగాను, నిశ్చలముగాను, ఉండుటచే, శ్రమ యనిపించక, నడచుట కుత్సాహకరముగా నుండును. ఒకరి నొకరు కలుసుకొనునప్పుడు "నమస్కారము", "సలాం", "గుడ్‌మార్నింగ్", అనువాక్యములకు బదులుగా "బదరీనాథ్ విశాల్‌కు జే" యని హెచ్చరించుకొనుచుందురు. ఈవాక్యములు కొంతవరకు శ్రమనివారణఁ జేసి, నడచుటకుఁ బ్రోత్సాహముఁ గలిగించుచుండును. భగవన్నామోచ్చారణలో నంత శక్తి గలదు. సుమారు ౯ ఘంటల కొకబసకుఁ జేరి, వంట చేసుకొని భుజించి, సాయంకాలము ౪ గంటలవరకు విశ్రమించి తిరిగీ నడక ప్రారంభించి, రాత్రికి యింకొక బసకు చేరుదురు మార్గము రెండు కొండలకు నడుమ నుండుటచే, కొండలనుండి వచ్చెడు వేడిమివలన, మొదటి నాలుగైదు దినములలో, ఉష్ణము బహు తీక్ష్ణముగా నుండును. కావున, ఉదయము ౯ ఘంటల లోపుననే బసకు జేరుట మంచిది; మరియు సాయంత్రము ౪ గంటలలోపున ప్రయాణ మగుట మంచిదికాదు. కొన్ని ప్రదేశముల నుండి మేము సాయంత్రము ౫ ఘంటలవరకు, ఉష్ణాధిక్యముచే బయలుదేరలేకపోతిమి.

శీతోష్ణములను లక్ష్యపెట్టని సాధువులు రోజుకు ౨౦ మైళ్లు అవలీలగా నడువగలరు; కాని, నా యనుభవమునుబట్టి, సామాన్య గృహస్థులు, స్త్రీలు ఉదయము ౮ లేక ౧౦ మైళ్లును, సాయంకాలము ౪ లేక ౬ మైళ్లును నడువవచ్చును. కొన్ని ప్రదేశములం దున్నతమగు కొండలెక్కి, మరల యెంత యెత్తు యెక్కితిమో అంత పల్లమునకు దిగిపోవుట కలుగుచుండును. ఉదకమండలము (**Ooty**), కొడైకనాల్ (**Kodaicanal**) కున్న పోవు రోడ్లు యెక్కుట ప్రారంభించినామంటే, గమ్యస్థానము చేరేవరకు నొకటే యెక్కుడు కాని, రోడ్డుమార్గము దిగుచు యెక్కుచుండుట సంభవింపదు. కనుక, ౩౦ మైళ్ల రోడ్డు ప్రయాణముతో, సముద్రపు మట్టమునకు ౭,౫౦౦ ల అడుగుల యెత్తున కెక్కుదుము. ఈ బదరీమార్గ మట్లు కాదు; కొన్ని ప్రదేశములలో రోడ్డు పూర్తిగ చదునుగా నుండును; మరికొన్ని ప్రదేశములలో, కొండ యెక్కి, మరల

కలుగును. విష్ణుప్రయాగ యను మశోలీవరకూ మార్గ మిట్లుండుటచేత, ౧౬౬ మైళ్లు ప్రయాణము చేసినను, సముద్రపుమట్టమునకు ౫,౩౫౦ అడుగుల యెత్తునకు మాత్రమే చేరుదుము. మిగిలిన ౧౬ మైళ్ల ప్రయాణములో ౫,౩౫౦ అడుగులనుండి ౧౦,౫౦౦ యడుగుల యెత్తునకు చేరుదుము గనుక, ౫,౧౫౦ అడుగులు యెక్కవలసి యుండును. కావున యీ అంచీ బహుకష్టమైనది. ఆఖరు నాలుగు మైళ్లలో, రోడ్డుమీద చాలా ప్రదేశములు మంచుతోకూడా కప్పబడి యుండును.

నడువలేనివారికి మూడు విధములగు యేర్పాట్లు కలవు: (౧) దండీ లేక డోలీ, (౨) ఖండీ, (౩) పోనీ (గుర్రము).

దండీ లేక డోలీ: ఇది (canvas) గుడ్డతో చేసిన పడకకుర్చీవలె నుండును. దీనికి, అడ్డముగా కర్రలుకట్టి, ముందు యిద్దరు, వెనుక యిద్దరు, మొత్తం నలుగురు కూలీలు మోయుదురు. ౨౦౦ పౌనుల బరువుగల స్థూలకాయులు, డోలీమోయుటకు ఆరుగురు కూలీలను పెట్టుకొనవలసి యుండును. ఇది సదుపాయముగానే యుండును. డోలీలు యేర్పాటు చేసుకొను వారు, కూలీలను యేర్పాటు చేసుకొనుటయేగాక, డోలీ వొకటి ఖరీదుకు కొనుక్కోవలసి యుండును. పెద్దతిరుపతియొద్ద నున్నట్లు, మోసుకొనిపోయే కూలీలు, డోలీసప్లయి చేయరు. డోలీఖరీదు సుమారు రూ ౧౫ లుండును. ఇది యుపయోగించుటయైన తర్వాత దానిని స్వల్పఖరీదుకు యితరుల కమ్ముట గాని కూలీలకో లేక యితరులకో ఉచితముగా నిచ్చివేయుటగాని, జరుగును. దేవప్రయాగవరకూ మోటారులో వెళ్లి, అక్కడనుండి డోలీప్రయాణము ప్రారంభింతురు. డోలీలను, కూలీలను స్థిరపరచుకొనుటమాత్రము హరిద్వారములో గాని, హృషీకేశములో గాని, దేవప్రయాగలో గాని చేసుకొనవలెను. ఇవి సప్లయి చేయుటకు తెహరీ దివానము తరఫున యేజంట్లు కలరు. "ఉత్తరఖండం ట్రాన్సుపోర్టు ఏజన్సీ" అని ఇంకొక కంపెనీయునూ కలదు. వీరిరువురి ద్వారా కాకుండా స్వయముగా కూడా యేర్పాటు చేసుకోవచ్చును. ఛార్జి కొంచెము యెక్కువ యయినప్పటికి, యేజంట్ల ద్వారానే యేర్పరచుకొనుట మంచిది. ఎందుచేత ననగా, కూలీల ప్రవర్తనకు యేజంట్లు జవాబుదారులుగా నుందురు. కూలీల మంచిచెడ్డలు మనకు స్వయముగా తెలియవు. డోలీకి కావలసిన నలుగురు కూలీలకు, సగటు సుమారున రూ ౧౦౦/ లు ఛార్జీ యగును. యాత్రికులు తక్కువగా నుండు ప్రారంభదినములలో కూలీరేట్లు తక్కువగా నుండును. రానురాను, యాత్రికులసంఖ్య వృద్ధినైనకొలది, యీరేట్లు పెరుగును. డోలీలు కావలసినదీ, యక్కరలేనిదీ దేవప్రయాగనుండి బయలుదేరక ముందే నిశ్చయించుకొనవలెనుగాని, మధ్యమార్గములో డోలీ యేర్పాటు జరుగదు. మోయుటకు కూలీలు దొరకవచ్చును గాని, డోలీలు సాధారణముగా దొరకవు. అవసర మగుచో, మధ్యమార్గములో పెద్దగ్రామముల యొద్ద, ఖండీలుగాని, గుర్రములు గాని దొరకును.

ఖండీ: ఇది యొక్క మనిషిచేతనే మోయబడును. ఇది యొకవిధమైనబుట్ట. కొంచెము పేము కుర్చీ యాకృతిగలిగియుండును. యాత్రికుని దానిలోకి కూర్చుండబెట్టి, ఖండీవాలా ఖండీని వీపుపై వేసుకొని నడచును. ఇది యంత సౌకర్యమైనది కాదు. నడువలేని నిరుపేదలుమాత్రము దీని నుపయోగింతురు.

పోనీ: (గుర్రము). చిన్న గుర్రములు బాడిగకుదొరకును. వీటిని, సవారు చేయుటకు గాని, సామానులు మోయుటకు గాని, యేర్పాటు చేసుకొనవచ్చును. దేవప్రయాగ నుండి బదరికిపోయి వచ్చుటకు, ఒకగుర్రమునకు ౩౦ లేక ౪౦ రూపాయ లగును. ఈ గుర్రములు, చిన్నపరిమాణము గలవియు, బహు సాధుజంతువులును అయి యున్నవి. ఇవి నెమ్మదిగాను, బహుజాగరూకతతోను నడచును. కొండ యెక్కునప్పుడు, దిగునప్పుడు, యీ గుర్రములు మిక్కిలి నేర్పరితనముతో అడుగుతీసి పెట్టుచుండును. వీటిపై స్త్రీలుకూడా ప్రమాదములేక సవారీ చేయుదురు.

కూలీలు: డోలీమీద పోవువారికినీ, కాలినడకను పోవువారికినీకూడా సామానులు మోసుకొని వచ్చుటకు

కూలీ లవసరము. డోలీలు, బరువులు మోయుట కభ్యాసపడిన కూలీలు ఘూర్కా జాతివారు నేపాళ రాజ్యమునుండి వచ్చి, యాత్రాదినము లారుమాసము లున్నా హరిద్వారము, హృషీకేశము, దేవప్రయాగల యొద్ద నుందురు. ఒకొక్కొక్క కూలిమనిషి కొంచెము హెచ్చుతక్కువగా ఒక మణుగు బరువుగల సామాను లను మోయునని నియమముకూడ గలదు. ఎందరు కూలీలు కావలసియుందురో తెలుసుకొనుటకు తూనిక వేయ బడును. కూలీలకు సామాన్యపురేటు మణుగు పక్కాం టికి, మైలునకు రెండణాలు. దేవప్రయాగనుండి రానూ పోనూ, ఒక్క కూలిమనిషికి రూ. ౩౧/లు అగును. యాత్రికులు తక్కువగా నున్నరోజులలో యింతకంటె తక్కువ మొత్తమునకే దొరకుదురు. నేను, మనిషి యొక్కంటికి రూ ౨౮/లు ఇచ్చితిని. తిరిగీ దేవప్రయాగ వచ్చువరకూ కూలీలు, మనతో నుండి, వాళ్ల భోజనపు టేర్పాట్లు వాళ్లే చేసుకొందురు. దీనికి అదనముగా నివ్వవలసిన పనిలేదు. కూలీలు మధ్యమకొనములలో అంట్లు తోముట, బట్టలుతుకుట, కావలసిన నీళ్లు తెచ్చిపెట్టుట, మొదలగు సహాయములు చేయుట వాడుక కలదు.

## బసలు

చట్టీలు: యాత్రికులు మార్గమధ్యమున బసచేసి పండుకొనుటకునూ, రాత్రులయందు విశ్రమించుట కునూ, యేర్పడిన ప్రదేశములు 'చట్టీలు' అనబడును. సాధారణముగా ప్రతి రెండు, మూడుమైళ్లకూ చట్టీలుం డును. అక్కడక్కడ రాధారీబంగాళా లుండును కాని అవిదుకాణములకు దూరముగా నుండుటచే సదు పాయముగా నుండవు. మరియు అవి యుపయోగించు టకు ముందుగా అధికార్లకు వ్రాసి ఆర్డరు పొందవల సియుండును. సామాన్యముగా నందరూ చట్టీలే యుప యోగింతురు. ఈ చట్టీలపేర్లు, దూరములు, యితర వివరములు తెలుపుపట్టిక రెండవభాగమున సమకూర్చ బడినది. దానిలో (ఏ) అని గుర్తింపబడిన ప్రదేశముల యందుమాత్రము చట్టీలు గ్రామములను జేరియున్నవి. ఇతరచోట్ల గ్రామములకు జేరియుండవు. రోడ్డుప్రక్క ను రెండు, మూడుదుకాణములుమాత్రమే యుండును. ఈ

దుకాణదారులు సర్కారువల్ల లైసెన్సులను పొంది రోడ్డుప్రక్కను దుకాణములను కట్టుదురు. తమ దుకా ణములకు చేర్చి, యాత్రికుల బసలకై చావడులను కట్టుదురు. తమదుకాణములలో సరకులను కొనువారి కుచితముగా బసయిచ్చుటయు, వండుకొనుటకు పాత్రలను సప్లయి చేయుటయూ వాడుక.

ఈ చట్టీలు మనవైపువ నున్న సత్రములవలె నుండు నని భ్రమించరాదు. ఇవి సాధారణముగా రెండంతస్తులు కలిగియుండును. పైన, క్రింద కూడా బాటసారులు బసచేయవచ్చును. నేల, గోడలు మట్టితో అలకబడియుండును. ప్రత్యేకపు గదు లుం డవు; తలుపులు, ద్వారబంధములు అవసరము లేదు. మూడువైపులా మాత్రము మట్టిగోడ లుండును. పొడు గుగా నుండు నొకవైపంతయూ యాత్రికులు వచ్చి, పోవుటకు ఖాళీగా నుండును. రెండు, మూడు గజ ముల దూరమున కొకొక్కొక్క పొయ్యి వేయబడి యుండును. ఈ క్రింది పటము వాటి యాకృతిని కొంచెము సూచింపవచ్చును.



పొయ్యి పొయ్యి పొయ్యి పొయ్యి పొయ్యి

జాతి, మత భేదములు లేక బాటసార్లొకరిప్రక్క నొకరు పండుకొని భుజించి, విశ్రమించవలసియుండు ను. పండుకున్నచోటనే భుజించి, దానికి ముందరనే విశ్రమించవలయును. పైన వ్రాయబడిన పటములో అయిదుసరు వొకరిప్రక్క నొకరు పండుకొనుటకు యేర్పాటు కలదు. బాటసారులు విస్తారము లేకపోయి నచో, పైచట్టీలో నొకపార్టీ వారుగాని లేక రెండు పార్టీలవారుమాత్రమే విడిసియుండవచ్చును. జన సమ్మర్దము యెక్కువగా నున్నప్పుడు, కొన్ని చట్టీ లలో మేము వైరాగులకు ప్రక్కనే బసచేసి పండు కొనవలసివచ్చినది. కొన్నిచోట్ల ఖాళీగా నుండి, చట్టీ యంతయూ మేమే యుపయోగించుకొనేవారము.

సదుపాయమునుబట్టి చట్టీలు ఏ. బి. సి. క్లాసు లుగా విభజింపబడి, పట్టీలో చూపబడినవి అఖరుతరగతి చట్టీలు ...

నన్ని చట్టీలలోనుకూడా ఈగలబాధ బహుదుర్భరముగా నుండును. ఈగలు వేలకొలది కలవని చెప్పవచ్చును. అనుక్షణము విసనకర్రతోగాని, గుడ్డతోగాని యీగలను కొట్టుకొనుచూ కూర్చొనవలసినదే కాని, ఒక్కనిముషమైనను విశ్రాంతిగాకూర్చొనుటకుగాని, పరుండుటకుగాని సాధ్యపడదు. రాత్రి దోమలబాధలేదు, కనుక దోమతెరలు రాత్రి యవసరముండవు; కాని, యీగలబాధనుండి తప్పించుకొనదలచినవారు, పగలు దోమతెర తప్పక నుపయోగించవలయును. నేను, పగలు వ్రాతపని వగైరాలు దోమతెరలోనే చేయుచుంటిని.

చట్టీలవద్ద దుకాణములలో బియ్యము, ఉప్పు (తెల్లనికొండఉప్పుగడ్డ), పప్పు, చెడ్డరకమునెయ్యి, గోధుమపిండి, పాలు, పెరుగు, బంగాళాదుంపలు, వంటచెరుకు, అక్కడక్కడ అరటికాయలు, చింతపండు ఖరీదుకు దొరకును. ధరలు యెక్కువగా నుండును. పెద్దగ్రామములలో వంకాయలు మొదలగు యితర కూరలుకూడా దొరకును. కొన్నిచోట్ల, అడవులలోను, గ్రామముల సమీపమునను, మామిడిచెట్లను మామిడికాయ లుండును. దేవప్రయాగమొదలు కొన్నిమజిలీలవరకు, అడవిలో మంచి కరివేపాకు దొరకును.

కొన్నిచోట్ల బాబా "కాలికంబలీవాలా" ధర్మశాలలు కలవు. ఇవి చట్టీలకంటె యెక్కువ సదుపాయముగా నుండును. ఈ ధర్మశాల లున్నచోట్ల వాటిలో బసచేయుట మంచిది. "కాలికంబలీవాలా" యనగా నల్లనికంబళీ ధరించినవాడని యర్థము. ఈయన విశుద్ధానందజీ యని పేరుగల యొకసాధువు. ౧౮౮౦-వ సం॥ ఈయన బదరియాత్రకు పోయినప్పుడు, మార్గములో తగిన బసలులేక యాత్రికులు పడుచున్న బాధలు చూచి, దేశమంతయు తిరిగి, గొప్పచందాలు వసూలుచేసి, ఉత్తరఖండయాత్రా మార్గములలో చాలా ధర్మశాలలు కట్టించి, యితరవసతులనుకూడా యేర్పరచెను. ఈస్వామి పరమపదించినతర్వాత, బాబా రామనాథజీ యనువారును, వారితర్వాత బాబా మణిరామ్ అనువారును, వీటిని చాలా వృద్ధిపరచిరి. ఈసంస్థకు కేంద్రస్థానము హృషీకేశము. అక్కడ పెద్ద ధర్మశాల కలదు. మరిన్ని యీ ధర్మశాలయొద్ద ప్రతిదినము యెందరు సాధువులు వచ్చినను సరే, రొట్టెలు, పాలు, పంచి పెట్టుదురు. మధ్యాహ్నము సాధువుల కివిపంచిపెట్టునప్పుడు చూచుటకు బహు ఆనందకరముగా నుండును. అనేకమంది సాధువులను చూచుట లభించును. మధ్యమార్గములో వీరి ధర్మశాలలలో సాధువులకు సదావర్తులకుగాను, హృషీకేశములోనే చీట్లు యిచ్చెదరు. ఈసంస్థను చేరి కొన్నిచోట్ల గోశాలలును, ధర్మవైద్యశాలలును కూడా కలవు.

చట్టీలవద్ద గవర్నమెంటు ఆరోగ్య శాఖవారు చేసిన యితర యేర్పాట్లేమనగా:

మంచినీళ్ల వసతి: ప్రతిచట్టీయొద్దను, గొట్టముల ద్వారా పరిశుభ్రమైన మంచినీళ్ల సప్లయికి యేర్పాట్లు చేయబడినవి. కొండలలో మంచినీళ్లబుగ్గ (**Spring**) యెక్కడ నున్నదో కనిపెట్టి, యక్కడనుండి గొట్టముల (**Pipe lines**) ద్వారా చట్టీలయొద్దకు నీరు కొనిపోబడును. గొట్టములలోనుండి నీరు నిరంతరము ప్రవహించుచుండును. జలాధారముల నప్పుడప్పుడు పరిశీలించి, వాటిలో క్రిమినివారణ మందులను (**Disinfectants**) కలుపుచుండుటకుగాను, ఆరోగ్యశాఖ యినస్పెక్టర్లు గలరు. యాత్రికులు యీ జలమునే యుపయోగించవలెను కాని కొండలలోనుండి పారుచుండెడి ఊటజలమును త్రాగకూడదు. ఈయూటనీరు బహుస్వచ్ఛముగా కనబడుచు త్రాగుటకునో రూరించుచుండును. కాని ఆ పచ్చినీరు త్రాగుటచే జబ్బుచేయును. నీళ్లవిరేచనములు, రక్తగ్రహణి కలుగును. కొండప్రదేశములలో కలుగు యీ వ్యాధులకు **Hill diarrhoea, Hill dysentery**, అని పేర్లు. ఇవి బహు తీవ్రవ్యాధులు. కనుక, గొట్టములలోని నీరు సహితము, కళపెళ కాచి చల్లారబెట్టినదే యుపయోగించవలెను.

పాయఖానాలు: చట్టీలయొద్ద రోడ్డుకు చేరికగా అడవిలో కొంతభాగము పాయఖానాకు నిర్దేశింపబడియుండును. చిన్నచిన్న పొదలుతప్ప వేరే మరుగుండదు. స్త్రీలకు ప్రత్యేకస్థలము, పురుషులకు వేరుస్థలము నియమింపబడియుండును. ప్రతిచట్టీయొద్దను, పాయ

ఖానాలు ఖాళీచేసి శుభ్రముగా నుంచుటకును, రోడ్డుమీద పెంట ఊడ్చుటకును హెల్తుడిపార్టుమెంటుచే నియమింపబడిన స్వీపర్లు కలరు.

ఔషధాలయములు: మధ్యమార్గములో పెద్ద గ్రామములయొద్ద గవర్నమెంటు ఆసుపత్రులు, ఔషధాలయములు కలవు. ఇతరచోట్ల, బాబా కాళీకంబళీవాలా యొక్కయు, యితరసంస్థలయొక్కయు ధర్మౌషధాలయములు కలవు. ఇవి యెక్కడ నున్నదీ రెండవ భాగములోని పట్టీలో వివరింపబడును.

పోస్టు, టెలిగ్రాం ఆఫీసులు: మార్గములో యే గ్రామములయొద్ద యీ ఆఫీసులు కలవో, పట్టీలో చూపబడినది.

## యాత్ర కుచితమగు కాలము-దూరము

| మార్గము | దూరము |
|---|---|
| 1. హరిద్వారమునుండి నిదానముగా బదరీక్షేత్రమునకు | ౧౮౩ మైళ్లు |
| 2. హరిద్వారమునుండి, కేదార్‌నాథం మార్గమున బదరికి | ౨౫౫ మైళ్లు |
| 3. హరిద్వారమునుండి యమునోత్రి, గంగోత్రి, కేదారనాథం మార్గమున బదరికి | ౪౩౪ మైళ్లు |

బదరీ యాలయము సుమారు మేనెల మధ్యను తెరువబడును. యమునోత్రి, గంగోత్రి పోవువారు ఏప్రియల్ నెలలోనే హరిద్వారమునుంచి బయలుదేరవలెను. తిన్నగా బదరికిగాని, కేదారనాథంమార్గమునగాని పోవువారు మేనెల ప్రారంభమున హరిద్వారమునుండి బయలుదేరవలెను. ప్రథమ దినముననే బదరిలో జ్యోతిని దర్శింపదలచినవారు, దేవళము యెప్పుడు తెరువబడు నని ముందుగా "రావల్ సాహేబు" గారికి వ్రాసి తెలిసికొని, ఆ తేదీకి అనుగుణముగా బయలుదేరవలెను. దేవళము తెరుచువరకూ, రావల్‌గారి మకాం "జోషీమఠం" అను గ్రామము, ఘుర్వాల్ జిల్లా, ఉత్తరఇండియా.

జూన్ నెల నడుమనుండి హిమవత్పర్వతములలో వర్షములు ప్రారంభించును. వర్షాకాలములో హిమవత్పర్వతయాత్ర చాలాకష్టముగా నుండును కనుక జూన్ ౧౫-వ తేదీ లోపల యాత్ర ముగించుకొని హరిద్వారము చేరుట మంచిది.

ఉత్తరహిందూస్థాన మంతయు హిందీభాష యగుటచే, హిందీలో కొంతవరకైనను మాట్లాడగల శక్తి యత్యావశ్యకము.

ప్రజలు : హిమవత్పర్వతములలోని ప్రజలు బహుపేదలు, అమాయకులు, నాగరికతారోపము సోకనివారున్నూ అయియున్నారు. వీరి ముఖ్యజీవనము వ్యవసాయము. స్త్రీలు, పురుషులుకూడా పొలములలో పనిచేయుదురు. మనము మార్గమునఁబోవునపుడు, పర్వతపార్శ్వములలో బహు యెత్తుప్రదేశములయందుకూడా చిన్న చిన్న గ్రామములున్నూ, వాటి చుట్టూ వ్యవసాయమున్నూ కానవచ్చును. వీరిదుస్తులు, ముఖ్యముగా పురుషులదుస్తులు, యెప్పుడున్నూ ఉదకస్పర్శనము నెరిగియున్నట్లు కనుపించవు. పెక్కులు అతుకులతో బహుమాలిన్యముగా నుండును. పెద్దదియగు బదరీగ్రామమున సహితము బట్ట లుతుకుటకు చాకలివాండ్రు లేరు.

స్త్రీలు, పురుషులు, బాలురును, ఆరోగ్యముగాను, దారుఢ్యముగాను ఉందురు. స్త్రీలలో కొందరు బంగారువంటి శరీరచ్ఛాయ గలిగి, నాగరికత లేకపోయినను, సహజసౌందర్యము గల విగ్రహములు గలిగి యుందురు. వీరికి సూదులు, దారము బహుప్రీతి. బట్టలు కుట్టుకొనుటకు ఆ ప్రాంతమున సూదులు, దారము దొరకవుకాబోలును! బాటసారులను స్త్రీలు మార్గములో కలిసినప్పుడు, "సూయీ, తాగా, దో మహారాజ్" (సూదీ దారము యివ్వండీ బాబూ) అని యడుగుదురు. కొందరు "బిందు" (మెరయు చుండేడి చెమికీబొట్టు) కూడా అడుగుదురు. ఈ వస్తువులను బాటసారులు తమవెంట గొనిపోయి, వారి కిచ్చినచో చాలా సంతోషింతురు.

## తీసుకొనవలసిన జాగ్రత్తలు

ఆహారము : తేలికగా భుజించవలెను. అజీర్ణము చేయుపదార్థములు, దుకాణములలో నమ్మబడు యీగలువాలిన జిలేబీ మొదలగునవి, మిగులమాగినపండ్లు

బాగుగా పండనివి తినగూడదు. పగటిపూట భోజనమున్నూ, రాత్రి గోధుమరొట్టె తినుట ఆరోగ్యకరముగా నుండును. రాత్రి భోజనము మానలేనివారు లఘువుగా భుజింపవలెను.

నీరు : గొట్టముల నీరు (**Pipe water**) బాగుగా కాచుకొని త్రాగవలెను. నడచునప్పుడు, శరీరము అలసటచెందియుండగా, నీరు త్రాగకూడదు. దాహము పట్టలేనియెడల, కొంచెము సేపు కూర్చొని, యలసట తీర్చుకొని త్రాగవలెను. కాచి చల్లార్చిననీరు, నీటిబుడ్డి (**Water bottle**) లో పోసి కూడా నుంచుకొనుట మంచిది. నడచునప్పుడు దాహమైనచో కలకండ కొంచెము బుగ్గనుంచుకొని ఊటమ్రింగుచుండిన కొంతవరకు దాహశాంతి యగును. కావున కలకండ కూడా ఉంచుకొనవలెను.

స్నానము: ప్రయాణమునకు ముందుగా గాని, బసకు చేరి కొంత సేపు శ్రమతీర్చుకొన్న తర్వాత గాని స్నానము చేయవచ్చును. పైపునీటితో స్నానము చేయవచ్చును. చెర్వులకు, నది సాధారణముగా నందుబాటులో నుండదు.

కలరా కాపుదలమందు : ప్రయాణ మగుటకు ముందు, కలరా మాదిమందు ( **Anti Cholera inoculation**) గాని, **Bili vaccine** గాని పుచ్చుకొనుట మంచిది.

## వెంట నుంచుకొనతగ్గ వస్తువులు

దుస్తులు : విస్తారము తీసుకువెళ్ల నక్కరలేదు. ౨ జతల ధోవతులు, ౨ జతల షర్టులు లేక హాఫ్‌షర్టులు, ౨ బనియనులు, ౨ తువ్వాళ్లు, ౨ దిట్టమైన రగ్గులు, ౨ ఉన్ని స్వెట్టర్లు, కోక ఉన్ని మెడపట్టీ, ఉన్ని మేజోళ్లు, ఒక ఉన్నిటోపీ చాలును.

ధోవతి కట్టుకొని నడచుటకంటె, పొట్టిలాగులు ( **Shorts** ) ధరించిన, నడచుటకు యెక్కువ సదుపాయము.

జోళ్లు : కాళ్లకు జోళ్లు అత్యవసరము. బరువు జోళ్లు, పాదములు కరచేవి, తొడగవద్దు. చెప్పుల జోళ్ల జత, రబ్బరు అడుగు గల కాన్వసు జోళ్లు, (**Canvas shoes with rubber soles** ) ఉపయోగముగా నుండును.

చేతికర్ర : నడచునప్పుడు స్త్రీలకు, పురుషులకుకూడా చేతికర్ర యవసరము. సన్నని మొనగల యినుప పొన్ను వేసిన కర్ర యెక్కువ యుపయోగముగా నుండును. ముఖ్యముగా మంచుమీద నడచునప్పుడు, చేతికర్ర యత్యవసరము. ఇట్టి కర్రలు హరిద్వారములో వెలకు దొరకును.

కిలుసుగుడ్డ: ( **Oil cloth** ) మార్గము లో వర్షము వచ్చినచో సామానులు తడిసిపోకుండా కప్పుట కుపయోగించును. బట్టలు ఉతుకుకొనుటకు, సన్‌లైటుసోపు ( **Sun light soap** ), గొడుగు, లాంతరు, టార్చిలైటు, త్రాడు ( సామానులు కట్టుటకు, బసలో బట్టలు ఆరవేయుటకు ), దోమతెర ( ఈగల బాధకు), కాచిన నీళ్లు వెంట గొనిపోవుటకు నీళ్ల సీసా ( **Water bottle** ) తీసికొనివెళ్లవలెను.

మంచినెయ్యి, పోపుదినుసులు, ద్రాక్ష, కిసిమిస, కలకండ, ఊరగాయలు, అప్పడములు, వడియములు కూడా ఉంచుకొనుట మంచిది.

మందులు : కలరా, రక్తభేది, నీళ్ల విరేచనములు, జ్వరము—వీటికి మందులు ; ఐడోఫారం, లింటు, జాంబకు (**Zambuk**), యుకలిప్టసు ( **Eucaliptus** ) దగ్గర ఉంచుకొనవలెను.



# ఆర్థిక దుర్వ్యయము*

శ్రీ గణపతిరావు

దేశము ఇంత పెద్దది. సహజసంపత్తి గలది. విస్తారమానవబలము గలది. ఇక సంపద కేమి కొదువ! కాని మన దేశములోని అపారదారిద్ర్యము చూస్తే గుండె పగిలిపోతుంది. ఇంత ప్రకృతి సంపదతో ఇంత దారిద్ర్యమునకు కారణ మేమి యని మన మడుగవచ్చు. ముఖ్యముగా ఇందుకు కారణములు రెండు: మొదటిది, దేశములోని సహజసంపత్తును సంపూర్ణముగా అనుభవించే ఉత్పత్తిశక్తిసామర్థ్యములు జనులలో తక్కువగా నుండుట. రెండవది, చేయబడిన ఉత్పత్తి అయినను అత్యంత నష్టభూయిష్ఠమై యుండుట. మన దేశములో సహజ సంపత్తుకు తగ్గ ఆర్థికాభివృద్ధి లేకపోవుటయే గాక చేసిన ఉత్పత్తివిధాన మంతలోను, ఆర్థికవ్యాపార మంతలోను, ఎంతయో అనవసరమైన నష్టముంది.

ఒక్కసారి మన మన ప్రత్యేక, సాంఘిక జీవితాలలో వుండే పద్ధతి, మన ఉత్పత్తి మార్గము, మన ధనవిభజనవిధానము, ఇవన్నీ సింహావలోకనం చేస్తే వాని యన్నిటిలో వుండే అపరిమితనష్టం బాగా బోధపడును. ఈనష్టం మన ప్రత్యేకకుటుంబాలలో వుంది; మన సాంఘికజీవనంలో వుంది; వ్యవసాయములో వుంది; పరిశ్రమలలో వుంది; గ్రామాలలోవుంది; పట్టణాలలోవుంది; దేశమంతా వుంది; ఇంకా బాహుళ్యంగా చూస్తే ప్రపంచమంతటను గూడా వుంది.

ఆర్థిక దుర్వ్యయ మంటే ఇంగ్లీషులో 'వేస్టు' (Waste) అన్నమాట. 'వేస్టు' అంటే ఇది యని చెప్పుట బహుకష్టము. ఒకవిధముగా మితవ్యయమునకు వ్యతిరేకమని చెప్పవచ్చు. కాలముయొక్క వృథాయాపన, ధనముయొక్క వృథావ్యయము, సహజ సంపత్తుయొక్క నిరుపయోగ్యము, మానవ బుద్ధియొక్క దుర్వినియోగము — ఇవన్నీ నష్టమే. అయితే మనము ముఖ్యముగా గమనించవలసినది ఆర్థికనష్టము. దీనికిని మన ప్రజల దారిద్ర్యమునకును ఎక్కువ సంబంధ ముంది.

ఆర్థికదుర్వ్యయ మంటే కొంచెం ఉదాహరిస్తాను. ప్రజల ఆహారార్థము ఏబియ్యమో, పప్పులో పండించవలసిన పరిస్థితులలో ఏ నల్లమందో పొగాకో మరి ఏ యితర విషవస్తువో పండిస్తే అది నష్టము. ఒక మనిషి చేయగలిగిన పనిని పదిమంది కూడి చేస్తే నష్టము; పదిమంది కలిసి గాని చేయలేని పనిని ప్రత్యేకంగా ప్రతిమనిషీ తల పెడితే నష్టము. అడవులను సరికి పంటచేలకుగా ఉపయోగిస్తే నష్టము. కాల్చి పారవేస్తే మరింత నష్టము. విహారార్థము వేటకు వెళ్లి అడవిలోని జంతువు లన్నింటిని చంపితే అది నష్టము. అల్పవిషయమునకు అధిక

* ఆల్ ఇండియా రేడియోవారి ఉపన్యాసము, వారి అనుమతితో

ప్రయత్నము చేస్తే — అంటే కొండను త్రవ్వి ఎలుకను పడితే — అది నష్టము. నిరుద్యోగము నష్టము. సోమరిపోతుతనము నష్టము. శక్తి కలిగియు శ్రమపడ నిష్టము లేక ఇతరుల కష్టముమీదను, ఇతరుల దానము మీదను ఆధారపడి బ్రదుకజూసే 'పరభృతులు' సంఘానికి ఘోరనష్టము.

ఈ ఆర్థికనష్టము అనేక విధములుగా వుంది. మొదట ఉత్పత్తివిధానము చూస్తే— ఉత్పత్తికి కావలసిన అంగములు నాలుగు. ప్రకృతిశక్తులు, మానవశ్రమ, ధనము, నిర్వాహణశక్తి ఇది ప్రతివస్తువుయొక్క ఉత్పత్తిలోను కనబడును. వీనిని ఉపయోగించుటలో ప్రస్తుతము ఎంతో నష్టమున్నదని స్పష్టముగా తెలియును. ప్రకృతిసంపద నంతను మనము బాగా అనుభవించుచున్నామా? ఇంకా ఎంత భూమి సాగుకాకుండా ఉన్నది? ఎంత అడవి నిష్ప్రయోజనముగా నున్నది? ఎన్ని గనులు భూగర్భములో దాగియున్నవి? ఎన్ని నదులు వ్యవసాయసాధనముగా లేకుండ నున్నవి? ఎన్ని జలపాతములు వృథాగా పోతున్నవి? ఇట్లు ఉపకరంగా చేయనివి గాక, ఉన్నవానిలో ఎంతోనష్టము గలదు. అమెరికా దేశములో నే భూమిమీదకి వచ్చిన ప్రతిటన్ను బొగ్గుకి ఇంకొక టన్ను వృథాగా పోతున్నదట. అట్టిస్థితిలో మన దేశములో సహజసంపత్తును ఉపయోగించుటలో వుండేనష్టము ఊహించనే లేము. ఇక మనుష్యశక్తిని గురించి ఎంతమంది నిరుద్యోగులై, నిరుత్సాహులై యున్నారు? ఎంతమందిశక్తి దుష్పథాలను బట్టినది? ఎంతమంది మంచి లాభకరమైన న, తిలేక పొటపోసికొని బ్రదకడంకోసము ఏదో చిన్నవృత్తిలో కాలక్షేపము చేయుచున్నారు? ఆర్థికంగా చూస్తే ఇదికూడా ఒక మోస్తరు నిరుద్యోగమని చెప్పకతీరదు. ఇదిగాక కార్మికుల సమ్మెలు ఈ మధ్య క్రమముగా ఎక్కువగుచున్నవి. సమ్మెయంటే పనివాండ్రకు, వారి యధికారులకు, పరిశ్రమలకు, యావత్తూ మొత్తముమీద అందఱకు గూడ నష్టమే. ఇంక ధననష్టమునకు మేరయే లేదు. మనకు ధనమును ఉపయోగించుటే తెలియదంటే అతిశయోక్తి గాదు. ఎంతధనమున్నను, ఇనుపపెట్టెలో దాచి, రోజూ లెక్కపెట్టుకొని సంతోషించువారే కాని పరిశ్రమలలోగాని, వ్యవసాయమునకుగాని, తుదకు దానధర్మములకైనను ఖర్చుపెట్టేవారు బహు తక్కువ. ఇంక ప్రజలలో డబ్బు యెట్లు తిరుగును? వస్తువులను కొని యనుభవించుటకు సామర్థ్య మెక్కడ? అదిగాక మన స్త్రీల మెడలలో వుండే నగలు ఆర్థికంగా చూస్తే యెంతనష్టం! వానివల్ల వచ్చే ఆర్థిక లాభమేమైనను వున్నదా? ఉత్పత్తి ఏమైనా దేశములో వృద్ధిపొందునా? మరికొందఱు మనుష్యులు జీవించగలరా? మరికొన్ని పరిశ్రమలు పుట్టగలవా? దేశములోని దారిద్ర్యమును తొలగించుటకు ఏవిధముగానైనను తోడ్పడగలవా? కాని నేటికిని మనస్త్రీలు పూర్వమువలెనే నగలమీద యెక్కువగా ధనవ్యయము చేస్తున్నారు. ఇంక ఉత్పత్తి విధానములో నాల్గవ అంగము— నిర్వాహణ శక్తి. అంటే పైనచెప్పిన మూడింటిని ఒక చోట చేకూర్చి అనుభవ యోగ్యముగా చేయుట. ఇది యెంతమంది చేయుచున్నారు? చేయుచున్నవారైనను క్రమముగా చేయుచున్నారా? మొత్తముమీద

యీయుత్పత్తి యంతలోను మానవజీవితానికి అవసరమైన వస్తువులకే మానవశక్తి వినియోగపడుచున్నదా? అనవసరముగా కేవలం దుబారాకోసము, విలాసంకోసము, ఎన్నిసరకులు ఉత్పత్తియగుచున్నవి? మానవుల ప్రధానవాంఛలు తీర్చలేని ఉత్పత్తిలో యేమైనను అర్థమున్నదా?

ఉత్పత్తిలోనే గాక దాని విభజనలో గూడా విపరీతనష్టముంది. ఉత్పత్తి అయిన ప్రతివస్తువు దాని పుట్టినచోటనుండీ అనుభవించుటకు మనచేతులలో పడువరకు ఎంతో తంతు ఉన్నది. మధ్య ఎంతమందిచేతులలో మారాలి. ఎంతమందో లాభము పొందాలి. ఉత్పత్తి చేయడానికి అయిన ఖర్చుకంటె మన చేతులలోకి వచ్చునరికి దాని ధర నాలుగురెట్లు పెరిగిపోవును. ఇదంతా ఆర్థికంగా నష్టమనే చెప్పాలి. ఇందులో చాలమంది బాగుపడుతున్నారంటే మనము సంతోషించగూడదు. వీరికి ఈ వ్యాపారము లేనియెడల మరియొక ప్రత్యేకమైన ఉత్పత్తివిధానములోనే ఉందురు. అది మానవశ్రేయోదాయకము. కాని కొంతవరకు ఈ మధ్యవర్తులునూ అవసరమే. పూర్తిగా అనవసరమని చెప్పలేము. ఎక్కడో ఏ దేశములోనో ఏవస్తువో వుత్పత్తి అయితే కేవలము ఉత్పత్తి చేసినవానితో ప్రపంచముయావత్తూ ముఖాముఖి వ్యాపారం చేయుట కష్టము కనుక ఈ మధ్యవర్తులు కొంతవరకు అవసరము. కాని ప్రస్తుత విధానములో అత్యధికసంఖ్యాకులు మధ్యవర్తులుగా నుండుటచే ఎంతో నష్టముంది.

ఇక ఈ ప్రకటనలు ( Advertisements ) చూస్తే మానవశక్తియొక్క దుర్వినియోగమంతా వీనిలో కనబడును. ప్రకటన గూడా కొంతవఱకు లాభము, అవసరమూను. ఏ నూతనవస్తువు యెక్కడ ఉత్పత్తి అయినను ప్రపంచము యావత్తు తెలియడానికి ఇదే మార్గము. కాని హద్దుమీరి అది కేవలం కళగా ప్రతివాదము నేర్పుకుంటె మొత్తముమీద దేశమునకు అనర్థం ఎక్కువయిపోతున్నది. ఎన్నో అనవసరమైన వాంఛలను సృష్టించుచున్నారు. ఎన్నో అనవసరమైన వస్తువులను మోసగించి కొనిపించుచున్నారు. పరిశ్రమలలోవలెనే ప్రకటనలలోగూడా అమెరికా దేశము అద్వితీయముగా నున్నది. అక్కడ అన్నితరగతుల విద్యాభ్యాసమునకును ఖర్చుపెట్టబడుచున్న ఒకవంతు ధనమునకు రెండువంతులు ఈ ప్రకటనలకై ఖర్చగుచున్నదట. ఈ ఖర్చు తుదకు సామాన్యజనులు భరించాలి. అదిగాక ఈ 'అడ్వర్టైజుమెంటు'లే నిజమైతే మనము భూలోకసుఖ మనుభవిస్తూ ఉందుము. రోగు లుండరట; వృద్ధు లుండరట; దరిద్రు లుండరట; అనాకారు లుండరట; అవివేకు లుండరట ఈ ప్రకటనకళ గారడీవిద్యను అతిక్రమించుతోంది.

అదిగాక ఉత్పత్తి అయిన వస్తువులను జనులకు అందచేయుటలో అపరిమితమైన నష్టమున్నది. అంటే 'మార్కెటింగు' అని ఇంగ్లీషులోను, 'విపణము' అని తెలుగులోను వాడెదరు. ఈ నష్టం తగ్గించుటకు, దేశములో ఉత్పత్తి అయిన వస్తువుల నన్నింటిని నలుమూలలకు ఆయా ప్రదేశాలలోని ప్రజల అవసరాలను బట్టి అందచేయుటకు మనప్రభుత్వము ఒక మార్కెటింగుశాఖను యేర్పాటు చేసినారు.

ర్గులో మన దేశములో ఒక్క కోడిగుడ్ల అమ్మకపు విధానములోనే యెన్నో లక్షల రూపాయిల నష్టం ఏటేటా కనబడుచున్నట్లు తెలియపరచినారు. ఇలాంటినష్టము ఉత్పత్తి అయ్యే వస్తువు లన్నిటిమీద యెంత వుండు నో ఊహించగలమా ?

ఇక ప్రపంచవ్యాపారపద్ధతిలోని నష్టము కావలసినంత. ఎగుమతియే కేవలము ఆద ర్శముగా పెట్టుకొని ప్రపంచవ్యాపారము సాగుచున్నట్టు కనబడును. సాధ్యమైనంత వఱకు వస్తువులను స్వదేశీయంగా చేసికో డానికి ప్రయత్నించాలి. ప్రస్తుతము వస్తు వులు అనవసరముగా అత్యంత దూరము నుంచి దిగుతూ ఉన్నవి. ప్రతి చిన్న వస్తువు ఏ అమెరికానుండో, జపానునుండో, జర్మనీ నుండో ఎందుకు రావలెను ? ఈ విధాన ములో యెంతో ఆర్థికనష్ట ముంది. ఈ నష్ట మునకు ఆ దూరవస్తువులను అనుభవించే మన కోటి సామాన్యజనులు భరించాలి. అవి దేశములోనే తయారయ్యే యెడల యెంతో చౌకగా లభింపగలవు.

ఇవన్నియు గాక వస్తువులను మనము వాడుకునే విధానములోకూడా యెంతో నష్టముంది 'వేస్టు' అనేది వైయుక్తికము. ఒకరికి నాల్గవ చొక్కాయే విలాసము. ఇం కొకనికి పదహారవ చొక్కాకూడ అవసర మేను. కాని 'వేస్టు' అనేది కేవలము ఊహా ప్రపంచములో మాటగాదు. మన కందఱకు కొంచెము ఇంచుమించుగా ఒకే అర్థము ధ్వనించును. మనము ఎన్నో వస్తువులను అనవసరముగా కొనుక్కొంటున్నాము. నాగరికవిశేషాలలో పాల్గొనే ఉత్సాహ ములో ... ప్రధానమైనవాటిని

మరచిపోతున్నాము. ముఖ్యావసరములకు డబ్బు లేకపోయినను కేవలం విలాసమున కేమి, డంబమునకేమి, తుదకు జూదమున కేమి లెక్కలేకుండ దుర్వ్యయము చేసేవారు మనలో అనేకమంది ఉన్నారు.

ఇక ఈ 'పేటెంటు'మందులు చూడండి! కొందరు నిజంగా జబ్బు ఉన్నను లేకపోయి నను 'అడ్వర్ టైజుమెంటు'మూలముగా భ్రమ పడి ఈ మందులు కొని పుచ్చుకుంటారు. ఇవి అన్ని కేవలము మంచివే యని చెప్పలేము. ఒక్కొక్కప్పుడు లేనిజబ్బులుకూడా రా వచ్చు. కనుక ఇదంతా వృథా యని చెప్పక తప్పదు.

ఇన్నివిధాలుగా నున్న ఈ ఆర్థికనష్ట మును తగ్గించుటకు మార్గమేమి? ఈ నష్టము ఇల్లాగ వుండినంతకాలము మన దేశముయొక్క దారిద్ర్యము పోదు. అయితే ఈ నష్టము లేకుండా చేద్దామంటే ఏ ఒక వ్యక్తితరమూ గాదు. సంఘములోని జను లంతా పాటు పడాలి. అందఱిలాభము ఒక్కటే యని గుర్తించాలి. ఏకఉద్దేశముతో పనిచేయాలి. ప్రభుత్వముకూడ తన బాధ్యతను గ్రహించి నిర్వహించాలి. దేశము మొత్తముమీద ఈ ఆర్థికనష్ట మంతయు ప్రభుత్వసాహా య్యము లేనిదే తీరదు. దేశములో ప్రకృతి సంపదయుండి, ప్రజలలో భౌతిక, మానసిక శక్తు లుండి దేశము దారిద్ర్యములో మునిగి యుండుట ఎంత శోచనీయము!

అయితే, రాష్ట్ర పాలనములలో కాంగ్రెసువారికి కొంచెముగా స్వాతం త్ర్యము వచ్చిన రోజులలో ఈ ఆర్థిక నష్టము తగ్గించి, ఇల్లుచక్కపెట్టుకొనుటకు కొన్ని ప్రయత్నములు జరిగినవి. ఈ

సందర్భములో అమధ్య స్థాపింపబడి పనిచే యుచున్న 'పారిశ్రామిక ప్లానింగు కమిటీ' మిక్కిలి ప్రశంసనీయము. జాతీయ ప్లానింగు కమిషనుయొక్క అధిపత్యమున పారిశ్రామి కాభివృద్ధి కాగలదు. కాబట్టి పారిశ్రామిక నష్టము చాలవరకు తగ్గుననుటకు సందే హము లేదు. సరియైన పరిశ్రమలను సరియైన స్థలములలో స్థాపించి వృద్ధిచేయుటవలన ప్రత్యేకవ్యక్తులయొక్కయు ప్రత్యేకస్థలముల యొక్కయు స్వలాభాపేక్షవల్ల వచ్చే అన ర్థమునకు తావు వుండదు. దేశములోని సహజ సంపత్తుకూడా ప్రస్తుతముకంటె ఎక్కువగా నుపయోగింపబడును. కనుక ఈనూతనసంస్థ అన్ని విధములా ప్రశంసనీయము.

అదిగాక, వ్యవసాయములోను, పరి శ్రమలలోను కూడ 'రేషనలైజేషన్' (Rationalization) అను పద్ధతిని అవలం బించినయెడల ఈనష్టము చాలవఱకుతగ్గును. రేషనలైజేష నంటే నూతనపారిశ్రామిక పద్ధతు లన్నింటిని అనుసరించి, అనవసరమైన 'వేస్టు' తగ్గించి, మితవ్యయం చేసే పద్ధతి. కొన్ని సంవత్సరాలుగా ఈపద్ధతి పాశ్చాత్య దేశములలో అమలులో వుంది. దానిని మన దేశములో అవలంబించి, దానితో కూడ శాస్త్ర పరిశోధనమును సాగించవలెను. ము ఖ్యముగా వ్యవసాయములోనుండే నష్టమును కొంత తొలగించుటకై అమధ్య కాంగ్రెసు రాష్ట్రముల వ్యవసాయకమంత్రులు కూడ సమావేశమై కర్తవ్యమును చర్చించిరి.

ఆర్థికదుర్వ్యయము సహకారోద్యమము వల్లను చాలవరకు తగ్గును. ఈ ఉద్యమము మన దేశమునకు కేవలము క్రొత్తది కాకపోయినను బాగుగా వర్ధిల్లుట లేదు. ఉత్పత్తిదారుల సంఘములు వృద్ధిపొం దవలెను. అప్పడే అల్పధనికులగు వ్యవసా యదారులు మొదలైన వారికి లాభము చేకూరును. ప్రభుత్వము కూడ ధనసహా య్యము చేయవలెను.

ఏది యెట్లున్నను ఇప్పుడుండే 'కాపిట లిస్టు' విధానములో కొంత నష్టము తప్పదు. ఎవరికి వారే స్వలాభంకోసం ఆర్థికవ్యాపా రము నడిపే పద్ధతిలో నష్టము ఉండితీరును. ఈ పద్ధతి మారకపోయినను, ఉత్పత్తిదారు లలో స్వలాభాపేక్ష మారి కొంచెము దృక్ప థములో మార్పువచ్చినను ఈ నష్టము కొం త తగ్గును. సంఘశ్రేయస్సే ఆశయముగా గ్రహించి ఉత్పత్తి సాగించవలెను.

తుదిమాట ఒక్కటి. దారిద్ర్యము గాని, భాగ్యముగాని కొంతవఱకు మనచేతు లలోనే వుందనిమాత్రం గ్రహించుకోవలెను. మొదట మనప్రత్యేకజీవితాలలోను, కుటుం బాలలోను ఆర్థికదుర్వ్యయము తగ్గించుకో డానికి ప్రయత్నించవలెను. మితవ్యయ మను నదియొక గొప్ప శీల మని ప్రతివాడును, ముఖ్యముగా మన దేశములో, గ్రహించి అనుసరించవలెను. మనలో నెలఒక్కంటికి ౫౦ రూ॥లు మాత్రమే తెచ్చుకొని ధన లోప మనునది లేకుండా సుఖజీవనము చేసే ఆర్థికులు గలరు. వేలు తెచ్చుకొన్నను దరిద్రులుగా నున్న అవివేకులూ ఉన్నారు. కనుక మితవ్యయమును శీలముగా గ్రహించ వలెను. ఈ శీలతారతమ్యమును బట్టి ఎంత సామ్యసంస్థలోనైనను ధనికులు, దరిద్రులు ఉండకతప్పదు. దీనినిబట్టియే వారి భౌతిక సౌఖ్యములోను భేద ముండక తప్పదు.

# ప్రత్యుత్తరము

శ్రీ గుఱ్ఱం సుబ్రహ్మణ్యం

సుప్రియ నీవు నన్నెడని స్రుక్కుచునుందు వటం చెఱింగి సం
తాపము వాపలేమికి నితాంతము వందురు నాయెడంద నూ
హాపరికల్ప్యమానపృథులాపకృతిప్రకరానుమానలే
ఖాపరిఖాప్రపాతగతగా నొసరించుట నీకుఁ బాడియే.

ప్రణయమిథఃప్రసంగతులఁ బర్వమువోలికఁ బ్రత్యహమ్ము వాః
కణముల చాయ రూపములు, క్రమతరంబుగ మీటుచున్ గృహాం
గణమునఁ దన్మయత్వమునఁ గ్రాలు టదొక్క మనోజ్ఞస్వప్నమై
యణఁగినదోటు, నీ వటు భయంపడఁగూడదు దూరముండియున్.

తలఁపులలోన లీనమయి తల్పముపైఁ గన రాకమానినీ
వలపులు గ్రుమ్మరించెడు విభావరులన్, విరివింటిజోదు కే
వల మశరీరుఁడై యతనిబాణములున్ దృగగోచరంబులై
విలసిలురీతి గావలయు వేడుకమై భవదాశ్రయంబునన్.

కైరవనేత్ర, రాత్రములు గాఢమనోవ్యథ కాలవాలముల్
గా రచియింపనేరిచెను గైరవమిత్రము రాత్ర మెట్లు, శృం
గారపరాయణస్ఫురణకారణమూర్తియుఁ దానటే, తృణాం
కూరము మేయు లేడి మెయి గొంటను దద్గుణ మంటివచ్చెనే.

చలియని మానబోక మనశయ్య రచింపుదు వారుబైట, ని
చ్చలు తెలివన్నె వెన్నెలలజాలుబడిం దడి దోఁగఁగోరి, తా
రల తమి చూడఁగోరి, వలరాజసఖద్విజరాజుమ్రోల నం
జలి నిడఁగోరి, యిట్లైనయుఁజాల గవాక్షసమీపమేనియున్.

నిరుపమమైన ప్రేముడికి నిక్కువ జక్కవజంట బోని నీ
యురమును నాయురంబున సముత్సవ మొప్పఁ గదించిగాని ని
ద్దుర నననేర, వే నెఱుఁగుదున్, మఱి మిక్కుటమైన యొంటిపా
టెరియఁగ, రేలు జాగరము లేడ్పులు నూర్పులు నోర్పులై ననున్.

నీ వరుదేరునప్పటికి నిద్దురవోయినయట్లు శయ్యపై
నావలిమోమునై ముకుళితాక్షమునై పవడించియున్న న
న్నో వనజాయతాక్షి, క్షణ మోరఁగఁగన్ మొలకెత్తు నవ్వు వే
వే విరిదోఁట యూను గదవే యధరామృతనిస్రుతంబులన్.

మబ్బులు మిన్ను గప్పుతఱి, మాలతులన్ విరజిమ్ము వాయువుల్
నిబ్బర మూచు వీచుతఱి, నేలయీసంటులపుట్టువేళలన్,
గుబ్బలివాకదూకుతఱి, కోరిక లీరిక లెత్తఁజిత్తమం
దబ్బురమై, పవల్ రజనియై, దివియై భువి, కూడియుండమే.

అంచరవంబులన్ గెలుచునందెలసందడి శారదాగతిన్
గొంచెముసేయు నీనడక, కోమలి నాశ్రుతివీథి నిప్డు పం
చించి, మదీయమానసికసీమ నతంబు దదంకితంబు గా
వించిన దాఁచెలుంగుమ, దవీయసి విస్మృతిప్రేమభూమికిన్.

దయితరో, మల్లెజాజివిరిదండలు పల్లెపడంతులెంతయో
ప్రియముగఁ గొండు కొండనుచు వేడుకొనన్, గృహమందు నీవు లే
కయ పనియేమి వీని కని గ్రక్కున నేఁ దలపోసి, మూల్యమున్
గయి నిడి, వారి మాల్యములఁ గైకొనకే గృహ మేగు దేరుదున్.

వాఁకిట బండినుండి దిగ వారక నా కమరున్ భవన్ముఖా
లోకము గాన లౌక్యవిధులుం ద్వరితంబుగఁ బూర్తిసేసి నే
నాఁకలి గొన్నటుల్ గద గృహంబును జేరుదు, నిప్డు దన్న నా
రాక యలక్ష్యమై పనిదొరంగను మాంద్యవశంవదుండనై.

ఉదయమునన్ భవన్మృదుకరోల్లలసంస్పృశమేలుకొల్పున
న్నఁ, దొలుత దర్శనీయము మనోజ్ఞభవన్ముఖపుండరీక, మి
య్యదనున సోరణాగతసహస్రకరాంశువ మేనిఁదాకుచున్
నిదురఁ దెమల్పఁ,గంటి కతినిర్భరమా వికలాంశుపాంసువుల్.

వలదనుపల్కు వల్లె యనువైఖరి యేర్పడ యాగపద్య మో
లలన, వచోవిలాసపరిలాలిత మాశ్రుతిగ్రేణిసేసి క
న్నులు తలతంత్రమై మెఱసి, నూత్నవధూప్రభుతాపతాకికో
జ్జ్వలరుచి నూపు మోవిపయి వ్రాలఁ, జగించు నినుండలంచెదన్.

కయికయి మోవిమోవి తెలిగన్నులు గన్నులురంబురంబు స
మ్మయిమెయి గొన్ననాటి తొలిమేళనముం దలపోయునాకు ద
వ్వయి, నడిరేయి శూన్యశయనాంతవివర్తన పాలొనర్చి, వి
ప్రియమును సంశయింపఁ దగవే, యెడబాటు సహింపవే ప్రియా.

చక్కనివస్తువుం గనిన శ్రావ్యకల స్వన మొండు సోకినఁ
రెక్కలువిచ్చి నాయెడఁద రివ్వన నిచ్చటు వాసి బర్వు నీ
దిక్కున నో మనస్విని, వితీర్ణవిశాలవిహాయసాధ్వనై
చిక్కని నీదుముంగురుల చీఁకటిలో వలలోన వ్రాలెడిన్.



# హిందూ దేశంలోని వ్యవసాయపు అప్పు

శ్రీ కొండేపూడి సుబ్బారావు

హిందూ దేశంలోని ప్రజలు ౧౦౦-కి ౭౦మంది వ్యవసాయంమీదే ఆధారపడి వున్నారు. ఈవ్యవసాయం కాలమానాన్ని అనుసరించి వుంటుంది గనుకనున్నూ, కాలం ఎల్లప్పుడూ ఒక్కమాదిరిగా ఉండదు గనుకనున్నూ, వీరి బ్రతుకులు కూడా అట్లాగే వుంటున్నాయి. అందుచేత ప్రతిరైతు వ్యవసాయపు దెబ్బవల్ల దండుగలు పడిపోయి, మోయలేని ఋణ బాధతో క్రుంగిపోతూవున్నాడు. పోనీ యిట్లా ఋణపడట మెందుకు? ఈ వ్యవసాయ మెందుకు? ఈ వ్యవసాయం మానివెయ్యకూడదా! అని మీరు ప్రశ్నలు వేయవచ్చును. కాని, అనాదినుంచీ, వంశ పారంపర్యంగా అది తన కులవృత్తి అవటంచేతనున్నూ, వేరే అతను చేయదగ్గ ఇతరవృత్తి లేకపోవుటచేతను, లాభ నష్టాలతో నిమిత్తం లేకుండా, పండినా ఎండినా, రైతు భూమినే అంటిపెట్టుకుని వుంటున్నాడు.

వ్యవసాయపు అప్పునకు కారణములు:—

అతనికి వచ్చే రాబడి స్వల్పం అవటం చేతను, అది ఎంతవస్తుందో అతనికి తెలియక పోవుటచేతను, రైతు పాతబకాయలు తీర్చకుండా వుంటున్నాడు. ఈ బకాయలు క్రమ క్రమంగాపెరిగి అతని కొంపగోడులను మ్రింగి వేసి అతన్ని కూలివాణ్ణిగా చేస్తున్నవి. కొందరు రైతులు తమకువచ్చే రాబడికి మించిన వ్యయమును చేస్తున్నారు. పెండ్లిండ్లకు, ఎక్కువ వైభోగములకు ధనమును ఖర్చు చేస్తూ వుండటమూ, పల్లెటూరులలో సరియగు అద్దె రాకపోయినను, మేడలు కట్టటం, యిత్యాదులవల్ల అతనికి అప్పు మరింత పెరిగి పోతూవుంది. పల్లెటూరిలో మేడలు కట్టడం శుష్కదండుగ. మేడకు అయ్యేకట్టుబడి సొమ్మునకు తగిన అద్దెరాదు. అందుచేత ఆడబ్బుతో అతడు, యింకోపది ఎకరాల కొండ్ర(భూమి) కొనుక్కుంటే హాయిగా సుఖ జీవనము చెయ్యవచ్చును. కొన్నికొన్ని అప్పులు, రైతులు, తాము స్వయంగా చేయక పోయినా, తమ తండ్రి తాతలు చేసిన వాటికి బద్ధులు అగుతున్నారు. ఈ మాదిరి ఋణములు ముఖ్యముగా పాలేళ్ల పద్ధతి లోను, బెంగాలు దేశంలోగల కామయ్యల పద్ధతి(Kamyoti System)లోను కలదు.

రైతు ముఖ్యముగా ఈ క్రింది అవసరాలకు అప్పుచేస్తాడు:—

(౧) తన పశువులు మరణించినప్పుడు క్రొత్తపశువులను తెచ్చుకొనుటకు,

(౨) విత్తనములు కొనుటకు, స్వల్ప వ్యవసాయపు పెట్టుబడులకు,

(3) భూమి మరమ్మతులకు, యిల్లు కట్టుకొనుటకు.

(౪) వివాహములకు,

(౫) తాను ఎక్కువ శిస్తుకు కవులుకు పుచ్చుకొన్న భూమి పండకపోయినయెడలను, పండినపంటకు సరియైనధర లేక శిస్తురూపాయలే రానప్పుడునూ, ఈనాందారునకు శిస్తు చెల్లించుటకు,

(౬) బీహారు పంజాబు రాష్ట్రములలో రైతులు చేసే లాటరీవర్తకములో తిన్నదండుగులకు. ఇవికాక, ముఖ్యముగా షాహుకార్లు ఎక్కువ వడ్డీలతోటి, రైతులరక్తాన్ని పీల్చివేస్తున్నారు.

ఈ వ్యవసాయపు అప్పువల్ల నష్టములు:—

వ్యవసాయదారునకు తనపెట్టుబడిమీద ౧౦౦ కి ౨ మొదలు ౫ రూపాయలవడ్డీ కిట్టుబాటు అయ్యేటప్పటికి బ్రహ్మాండమై పోతూవున్నది. ప్రతి ౫ సం॥లలో, అతివృష్టి, అనావృష్టి కోపములవల్లనో, ఈతి బాధలవల్లనో రైతు క్రుంగిపోతూవున్నాడు. కనుక రైతు ౧౦౦ కి ౯ రూపాయలు మొదలు ౬౬ రూపాయలవరకు వడ్డీచొప్పున అప్పు తెచ్చుకుంటున్నాడు. తనరాబడి ౧౦౦ కి ౫ రూపాయలేనా లేనప్పుడు వడ్డీ రేటు ౯% మొదలు 3౬% వున్నప్పుడు రైతు క్రుంగిపోక ఏమవుతాడు? రైతుబుణ విరామచట్టము వచ్చినతరువాత వడ్డీ రేట్లు నిర్ణయించటముచేత రైతులోకానికి కొంత మేలు చేకూరింది. కాని, ఈ చట్టం చట్టంలాగుననే వుంది. పల్లెటిగ్రామాల్లో లోపాయకారీ వ్యవహారాలు, హెచ్చు వడ్డీలు జరుగుతూనే వున్నాయి. కనుక రైతు తనఅప్పును తీర్చుకొనుటకు తనభూమిని అమ్మివేసో, లేక అది షాహుకారునకు వ్రాసియిచ్చో, బుణబాధ తీర్చుకుని, పక్కలాగుపై గుడ్డతో, ఆకలి మంటతో అల్లాడుతూ, గంపెడు సంసారంతో కూలిపనికి సిద్ధపడుతున్నాడు. కనుక ఈ వ్యవసాయపు అప్పు రైతును పీల్చి పిప్పిచేస్తోంది.

అప్పుయొక్క వివరణ:—

అయితే ఈ అప్పు దేశం మీద ఎంత వుంది? ఈ బుణబాధనుండి రైతును ఎట్లా తప్పించటం? అనే విషయాలను గూర్చి చూద్దాం. రైతును బుణబాధనుండి ముందు విముక్తుణ్ణి చేసేవరకు అతడు తన భూమి యొక్క సత్తువను గూర్చిగాని, మరి యే యితరవిషయాలను గూర్చిగాని ఆలోచించ లేడు.

మనరాష్ట్రము (మదరాసు) లో ఈ అప్పు ఎంతవున్నదో కనుగొనుటకు ౧౮౯౨-వ సం॥లో ప్రభుత్వమువారు సర్ ఫ్రెడరిక్ నికల్సన్ గారిని నియమించారు. వారి నివేదిక ననుసరించి ౨౧ కోటి రూపాయలు తనఖా అప్పున్నూ, ౪౫ కోట్ల రూపాయలు నోట్లబాపతున్నూ, మొత్తము రాజధానిలో ౬౬ కోట్ల రూపాయల అప్పువున్నదని తేల్చారు. ౧౯౦౦ సం॥ నుండి ౧౯౧౦ వరకు కొన్నిజిల్లాల అప్పును తిరిగీ నిర్ణయించుటలో ఈ అప్పు రెండు రెట్లు అయినదని నిర్ణయించారు. అందుచేత ౧౯౧౦ నాటికి ఈ అప్పు ౧3౦ కోట్లు గల దని అంచనా వేయబడింది. ౧౯౧౫ – ౨౦ ప్రాంతములలో పంజాబువాసియగు డార్లింగ్

డార్లింగు దొరగారు తమ లెక్కలను తయారుచేసి వ్యవసాయపు అప్పు, రాష్ట్రమునకు వచ్చే భూమి పన్నునకు ౧౭ రెట్లు అధికంగా వున్నదని నిర్ణయించారు. కనుక, డార్లింగ్ దొరగారు నిర్ణయించినట్లు ఆ సిద్ధాంతమును మనము లెక్కలోనికి తీసుకవచ్చిన యెడల మనరాష్ట్రపు వ్యవసాయపు అప్పు ౧౯౨౦-౨౫ ప్రాంతములలో ౧౦౦ లేక ౧౨౦ కోట్ల వరకు గలవని నిర్ణయించుకోవాలి. ఎందుచేత నంటే అప్పుడు మన భూమిపన్ను ౬ లేక ౭ కోట్ల రూపాయలు అయివుండినది.

కాని, మదరాసురాష్ట్రీయ బ్యాంకువిచారణ సంఘము (Madras Provincial Banking Enquiry Committee) రాష్ట్రీయ అప్పు, భూమి పన్నునకు (Land revenue) ౧౯ రెట్లు వున్నదని తెలియపరచింది. కనుక, వారి అంకెల ప్రకారము ౧౫౦ కోట్లు వున్నదని తెలియవచ్చింది. ఇది ౧౯౨౮-వ సం.పు **మాట.** ౧౯౨౯ లగాయతు ఆర్థిక మాంద్యము (Depression) తటస్థమైనది. మనకు నూతనమైన నివేదిక, కలక్టరుగారగు సత్యనాథన్ గారు ౧౯౩౫-వ సం॥ సెప్టెంబరులో తయారుచేసినదే ఆధారము. వారు ౨౦౦ కోట్లని వ్రాసియున్నారు. ఇందులో నోటినమ్మకాన్ని పుచ్చుకున్నవి, మూజువాణీ అప్పులు, పత్రాలు లేనివి చేర్చబడలేదు. అవికూడా చేర్చిన యెడల ౨౫ కోట్లు అవుతుంది.

మిగత రాష్ట్రీయబ్యాంకులు తమ రాష్ట్రాలలో గల అప్పును గూర్చి ఈవిధంగా తెలియపర్చినవి:—

| రాష్ట్రము | అప్పు |
|---|---|
| అస్సాము | రు. ౨౨ కోట్లు |
| బెంగాలు | ౧౦౦ ,, |
| బీహారు, ఒరిస్సాలు | రు. ౧౫౫ కోట్లు |
| బొంబాయి | ౮౧ ,, |
| బర్మా | ౬౦ ,, |
| మధ్యప్రదేశములు | ౧౮ ,, |
| మధ్యపరగణాలు, బీరారు | ౩౬ ,, |
| పంజాబు | ౧౩౫ ,, |
| సంయుక్తపరగణాలు | ౧౨౪ ,, |
| కొడగు | ౫౫ ,, |

కనుక, మొత్తము బ్రిటిష్ ఇండియాలో ౯౦౦ కోట్ల రూపాయల వ్యవసాయపు అప్పు వుంది. స్వతంత్రరాజ్యాలవారియొక్క నివేదికలు మనకు లభ్యం కావటం లేదు. ౧౯౨౮ నాటికి ౯౦౦ కోట్లు అప్పు వున్నప్పుడు ఈనాటికి రమారమి రెట్టింపైనా పెరిగి వుంటుంది.

లెక్కలు తయారుచేసిన విధములు—

ఈ లెక్కలను తయారు చేయటంలో సరియైన పద్ధతిగాని, ఫక్కీగాని లేదు. ఒక గ్రామాన్ని తీసుకోవటం, ఆగ్రామంలో కొన్ని కుటుంబాల అప్పును తీసుకుని వారి రాబడి ననుసరించి, వారి ఖర్చును చూసుకుని, వారికున్న అప్పును లెక్కవేసుకుని, ఉజ్జాయింపున ఆగ్రామపు అప్పును నిర్ణయించి, అట్లే రాష్ట్రీయ అప్పును నిర్ణయించటం ఒకపద్ధతి. సబ్ రిజిష్ట్రారు ఆఫీసుకు పోయి తనఖా బాకీలు ఎన్నివున్నాయో తెలుసుకుని, దాన్నిబట్టి నోటు బాకీలు ఉజ్జాయింపున అంచనా వేసుకుని, లెక్కలను తయారు చేయటం; సహకార సంఘములకు పోయి అందులో రైతులు ఎంత అప్పు తీసుకున్నారో తెలుసుకోవటం—యిత్యాదులు. కాని ఈపద్ధతు లన్నీ, సరియైనవి కావని అనేక బ్యాంకు సంఘముల నివేదికలు తెలియ

పరుస్తున్నాయి. ఎందుచేతనంటే ఏరైతు దగ్గరకేనా వెళ్లి నీ అప్పు ఆస్తులు చెప్పమంటే "సంసారానికి గుట్టు రోగానికి రట్టు" అన్నట్టు తన సంసారపుగుట్టు బయటపెట్టడానికి యిష్టంలేక సరియైన అంకెలను యివ్వటంలేదు. చాలామంది రైతులకు అక్షరజ్ఞానమే లేదు గనుక, తాను ఎప్పుడు ఎంత అప్పుచేశాడో, ఎంతవడ్డీ అయిందో అతనికే తెలియదు. రిజిష్టరు దస్తావేజులలో వేసిన అంకెలు సత్యములుకావు. చెల్లుబాకీలు యిచ్చినట్టు సరియగు ఆధారములు షాహుకార్లవద్ద కాన్పించుటలేదు. కాని, ఉజ్జాయింపున అంచనావేసిన అంకెలకన్న, ఈ అప్పు యింకా ఎక్కువే వుంటుంది. ఎందుచేతననగా, తాకట్టుమీద మార్వాడీల దగ్గిర రైతులు తెచ్చినఅప్పులు, పాత్రసామానుల మీద తెచ్చుకున్న అప్పులు, కూడా చూసుకున్న ఎడల యింకా ఎక్కువ మొత్తమే తేలుతుంది.

కనుక రైతును ఈ ఋణబాధ నుండి తొలగించటానికి వక్కటే మార్గము ఏమిటంటే, వడ్డీ వ్యాపారస్తులు రిజిష్టరుచేయించుకోవాలని చట్టాన్ని తయారు చేయాలి. మద్రాసు గవర్నమెంటువారు వడ్డీరేటును ౫½% నిర్ణయించుట రైతునకు కొంతమేలు చేకూరిందిగాని, షాహుకార్లు లోపాయకారీ వ్యవహారాలు జరుపుతూనే వున్నారు. వీరు యిట్టి వ్యవహారాలను జరుపకుండా వుండటానికి, సరియగు చట్టా ఆవర్జాలను నిలపవలెనని, అట్లా నిలిపిన గాని వారి బాకీలు కోర్టు కెక్కినప్పుడు చెల్లవని శాసించాలి. రైతు ఋణవిరామచట్టం శాసించారేగాని, రైతులకు చాలినన్ని భూమితనఖా బ్యాంకులుగాని, పంటల అమ్మకంపైని, తక్కువ వడ్డీలకు రైతులకు అదునుకు అప్పులిచ్చే సంఘాలుగాని విరివిగా స్థాపించలేదు, కనుక మనకందరకు తినతిండి, కట్టుకోవటానికి గుడ్డ యిస్తూ వున్న రైతుసోదరులకు మేలుచేకూరాలంటే, తక్కువ వడ్డీపైని, భూమితనఖా బ్యాంకులను, స్వల్పకాలపు అప్పు లిచ్చేటందుకు, స్వల్పకాలపు అప్పుబ్యాంకులను విరివిగా స్థాపించాలి. మద్రాసురాష్ట్ర ప్రభుత్వమువారు ఈ విషయములో ముందంజ వేశారు. మిగతా రాష్ట్రాలవారు కూడా, మమ్మి అనుసరిస్తే, ఈ వ్యవసాయపు అప్పు రైతును బాధించదు. రైతు ఋణబాధనుండి విముక్తుడౌతాడు. రైతు కోలుకున్నప్పుడే జనులు సుఖపడుతారు. ప్రజాసౌఖ్యమే దేశ సౌభాగ్యము. కనుక, ఈ దేశసౌభాగ్యానికి అందరు రైతుసోదరులకు తగినచేయూత నిస్తారని ఆశిస్తున్నాను.



# ఆశ్రమవాసి

శ్రీ ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రి

౧

మధుసూదనశర్మగారి 'నైమిశ' కుటీరం వూరికి మైలుదూరంలో వుంది.

ఊరిలోని శర్మగారి స్నేహితులైన వర్షీయాంసులూ— శిష్యప్రాయులైన నవయువకులూ మధ్యాహ్నం మూడుగంటలు— ఆ ప్రాంతానికి 'నైమిశం'లో చేరి అనేకవిషయాలమీద వేడివేడిచర్చలు సాగిస్తూ వుంటారు.

సాహిత్యం — సమాజం — కళ — వేదాన్తం ఒకటేమిటి సమస్తం ఆ చిన్న పెంకుటింటి పాలగచ్చుసావడి తుంగచాపల మీద అలా అలా వికసించి గిరగిర తిరిగి ఎగిరిపోతుంటాయి.

సుమారు మూడు అవుతుంది. కొంచెం మబ్బు— చినుకుగా వుండడాన్ని ప్రస్తుతం 'నైమిశా'నికి అట్టే 'డిమాండు' లేకపోయినా—గోపాలంమాత్రం 'నైమిశం' ప్రశాంత హృదయాన్ని చెదరగొడుతూ అందుకున్నాడు.

"నేర్చుకుపోయారోయ్— మీరూ— మీ ప్రేమదాహాలూ— విరహ కావ్యాలూ— నీలిమబ్బులూనూ.

ఈరోజుల్లో ప్రతివాడూ— ప్రేమ తిని ప్రణయం తాగుతూన్నట్టు ఉపన్యాసాలు పేలగొట్టేవాడే—

నే నెరుగుదునుగా—ఏ శాంతాఏప్టీయో మాయాబెనర్జీయో — పూలదండలతో కైదండ లిస్తే శృంగార. ఖంగారుతో అంగీకరించాలని మీ ముఠావారి సంకల్పం—

చౌదరీ! ఒక్కటి చెబుతాను విను— పెద్దలు ఏర్పరచిన వివాహసంస్థ బహు దొడ్డది— పెండ్లి విషయంలో — చక్కని సాంప్రదాయం— చూసుకోవాలి గాని ఎందుకోయ్— ఈచదువుకొన్న చిత్రాంగులూ— ప్రేమ పెళ్లిళ్లూ— వాళ్ల ఆకతాయి వేషాలూ—అవకతవక ప్రవర్తనలూ......"

"అపర శంకరాచార్లుగారూ! అక్కడ ఆగండి—" క్రిష్ణయ్యచౌదరి దెబ్బదిన్నతాచులా తిరగబడ్డాడు.

"గోపీ! నీ చూపులో ఏదో గాఢమైన మాలిన్యం ప్రవేశించిందోయ్ — లేకపోతే మధురమైన మానవహృదయాన్ని—మృదులమైన స్త్రీజాతినీ — ఇంత చులకన చేసి మాట్లాడ లేవు —

వేదవిజ్ఞానాన్ని — ఉపనిషదౌదార్యాన్ని—పోగొట్టుకొని, నీచబుద్ధులతో పతితమైన బ్రాహ్మణజాతి 'అహం' అంతా నీలో పేరుకున్నట్టు కనబడుతోంది.

పవిత్రమైన వేదమంత్రాల కర్థం మరిచిపోయి — మేజువాణీలకూ — వియ్యపురాలి లాంఛనాలకు తగువులాడినవాడే నీ

వివాహసంస్థ శిథిలమైపోయింది. పిల్లల శ్రేయస్సు పెరట్లో వుంచి—పెండ్లి అంటే—వర విక్రయం—కన్యాశుల్కాల వీధివేలంపాటగా మారిన వేళనే నీ పెద్దలూ—ఎద్దులూ—సమానం అని తేలింది.

ఈ విషమ సమస్యాకాలంలో—యువతీయువకులు—తమ విచక్షణ ఉపయోగించి తమ రుచులకూ—లక్ష్యాలకూ తగిన వారిని తామే చూసుకోక ఏంచేస్తారు?

నాతరం, నాకు వరప్రసాదముగా ఇచ్చే నవ్యజాగృతిని — ఆత్మవిశ్వాసాన్ని — వద్దని నేను కళ్లు మూసుకోలేను.

ఎన్ని విదేశకావ్య మాధుర్యాలు—ఎన్ని 'నవంనవ' శిల్పసౌందర్యాలు—ఎన్ని అభినవ దివ్యసందేశాలు—నన్ను కొత్త వెలుతురులోకి గెంటివేసినవో నువ్వు గ్రహించగలవా?—

మనిద్దరం బాల్యస్నేహితులమైనా—మానవజీవితంలో ప్రవేశించడంతోనే నీదో త్రోవా—నాదో త్రోవా—అయింది.

నీకు—సంఘం, లౌక్యం—ఉద్యోగం, పిల్లలు మర్యాద, వీటిచాటున భార్య ఒక ఉపకరణం. ఎంత మూర్ఖురాలైతే — అంత మంచిది — అప్పుడు సమాజంలో నువ్వు 'బాగుపడ్డ వాడవు'—

నాకు—నాజీవితవీణమీద సుఖశ్రుతిలో, ఒకతియ్యనిపాటగా — కదలి నృత్యం చెయ్యగలిగిన సుహాసినిని, సహవాసిని — కావలెనని కన్నుచింపుకొని వెదకుతున్నాను.

లాయిడ్' బొమ్మలను చూచి భ్రమపడుతున్నా ననుకోకు—

నాహృదయా న్నంతటినీ ప్రేమమయం చేసి—నాపూజామందిరంలో— హృదయాధిదేవత—మంగళమయి—అయిన శ్రీమధుమూర్తిని పూజచేస్తాను, గాని నీవలె సంఘం ఇచ్చిన కొయ్యబొమ్మను చచ్చినా ప్రేమించలేను—

శరత్కాలపు వెన్నెల్లో మిలమిల మెరిసే లేతచిగుళ్లవంటి నాప్రియురాలి ఎర్రని పెదవులు — చెంపలమీదనుంచి మెడవంపులోకి ప్రవహించే ఆమెలావణ్య కాంతి—కంటె నాకింకో ఉపాస్యదేవత లేదు. వట్టి శాస్త్రీయమనస్కుణ్ణి, 'శ్రీతి నామాపి మధురమ్' అన్న ముసలివాడు ఎంత బుద్ధిమంతుడోయ్ —

ఈ బలవన్నిశ్చయంలో — నాకు నువ్వూ—నీసమాజమూ......

"బాలకృష్ణవత్ — అంతేనా" శర్మగారు లోపలనుంచి నవ్వుతూ వచ్చి నిలుచున్నారు. చౌదరి చలాకీగా "మా గరం గరమ్ ప్రసంగాన్ని నాటకంగా మార్చి ఖుషీగా రక్తికట్టించిన తమ సన్నిధి మాకు ప్రసాదించాలి" అన్నాడు.

"మా వాదానికి మాధ్యస్థ్యం వహించి న్యాయం ఇప్పించాలి — ఇలాదయచెయ్యండి" అన్నాడు ఆహ్వానిస్తూ గోపాలం.

౨

మధుసూదనశర్మగారు వెనక విజయనగరప్రాంతంలో వున్న ఒక కళింగ జమీందారీలో

వంటి సంసారభాగాలను అనుభవించి — జీవితంలోని చేదుపానీయాల నన్నిటినీ చవి చూచి, విసిగి — పింఛను పుచ్చుకున్నారు. ఫూరికి దూరంగా వున్న తమ మామిడి తోటలో 'నైమిశ' మనే పేరుతో ఒక పెంకుటిల్లు వేసుకుని అందులో ముసలి భార్యా తానూ ప్రస్తుతం నిశ్చలమైన వాన ప్రస్థాశ్రమాన్ని నడుపుతున్నారాయన.

బ్రహ్మ సూత్రములను — గీతాభాష్య మును — దశోపనిషత్తులను — వివేకానందా దుల దివ్యసందేశాలను — తరచి చదివి లోతులు గ్రహించి ఆచరణకు దెచ్చిన పక్వహృదయుడు.

దూరానికి అరముగ్గిన బౌద్ధసన్యాసిలా కనపడతారు.

వృద్ధులతోనూ — యువకులతోనూ సాయిలాఫాయిలాగా మాట్లాడి అందరినీ రంజించే ప్రేమమూర్తి.

ఏవిషయాన్నైనా ఎత్తుకుని వివేకంతో చర్చచేస్తూ వుంటే వేదకాలపు ఋషుల ఔదార్యం జ్ఞాపకంవస్తుంది.

3

శర్మగారు గంభీరములైన తన కళ్లనెత్తి మానవజీవితాల వెనుక ఉండే ఏ నిగూఢ రహస్యాలనో చూస్తూ — 'ఈ పత్' నక్వ ఇట్లా వారిప్రసంగంలో పలుకొన్నారు.

"నాయనా, వేడిపాలవలె పొంగులు వారే పడుచు హృదయాలలోని — తీవ్ర వాసనలనూ — ఆత్మాభిమానాలను...అర్థం చేసుకోగలను. కాని —

ప్రపంచంలో నిరంతరమూ ఎగిరే — అసూయా — ద్వేష — స్వార్థ ధూళులు మీ హృదయాలలోని నిర్మలత్వాన్ని మాపి — కుటిలములుగా చేస్తున్నాయి. ఫలితంగా కొందరు వట్టి మితవాదులూ — కొందరు శుష్క అతివాదులూ — అవుతున్నారు.

ఒకవైపు చూస్తే — వేదర్షులు స్వచ్ఛ హృదయాలతో ఏర్పరచిన వివాహమంగళ విధి బుద్ధిహీనశ్రోత్రియులవల్ల ఖిల మైపో యింది. మడిబట్టలూ — దేవతార్చన పెట్టె లూ దొంగస్నానాలూ — చాటున జరిగే ఘోరాలకు అంతు లేదు.

రెండవప్రక్కను చూస్తే — పరదేశ నాగరికతా ప్రభావాలవల్ల — ప్రేమకూ మోహానికీ భేదం తెలియని అజ్ఞానులు ప్రబలి పోతున్నారు.

బుద్ధిమంతుడు అందని తీవ్రకాంక్షల కోసం ఆత్మవినాశాన్ని చేసుకోక జీవితాన్ని నిగ్రహంతో బిగబట్టి ఎన్నో ఉత్కృష్ట కార్యాలకు వినియోగించివేస్తాడు.

నాయనా, ఈ జీవయాత్రలో — ఎన్ని ఆశాభంగాలు — ఎన్ని కాల్చే ప్రతీక్షలు — ఎన్ని అశాంతులు —

ప్రేమ ముందు తరిస్తుంది — పడిపిస్తుంది — తహతహపడినకొద్దీ దూరంగా జరిగిపోతుంది. ఒకనాడు హఠాత్తుగా ఎదురుచూడని త్రోవ వెంట వచ్చి నీ భుజంమీద చెయ్యి వేస్తుంది.

ఇప్పుడు నే నీ అరవై పండ్ల వృద్ధశరీరం లోనుంచి నా పడుచుప్రాయపు పొలిమేరల్లో ప్రవేశిస్తే ఆనాటి హృదయస్పంద నన్ని వే శాలు కొన్ని జ్ఞాపకం వస్తున్నాయి."

పాపం, ఆవృద్ధుని ముడతలుపడ్డ కళ్ల నుంచి రెండు మంచిముత్యాలు జారి చెక్కిళ్ల మీాద కరిగిపోయాయి.

శర్మగారు గొంతు సవరించుకుని చెప్ప డం మొదలుపెట్టారు.

౪

నేను విజయనగరం కాలేజీలో చదువు కొంటూండగా—ఎవరో మాకు దూరబంధు వులు— జగన్నాథయాత్రకు వెడుతూ — ఒకసారి మా కుటుంబాన్ని చూచి వెళ్లవలె నని దిగి మాయింటికి వచ్చారు. అప్పుడు నాకు పద్ధెనిమిదీ — ఇరవై ఏళ్లు వుండ వచ్చు.

మా నాయనగారు వారిని చాలా ఆద రించి ఒక్క వారంరోజులు బలవంతంమీాద మా ఇంట్లో ఆపివేశారు.

వచ్చినవారిలో పదిహేనేండ్ల ఒక అమ్మాయికూడా వుంది.

ఆమె మా యింట్లో ప్రవేశించింది మొదలు అందరితో చనువుగా— నవ్వుతూ పాడుతూ గాలికన్న తొందరగా— లేడికన్న అందంగా మసలడం ప్రారంభించింది. ఎవ్వరితోనూ కొత్తలేదు—నవ్వులబండి— పువ్వులగుత్తి.

ఒకనాడు నేను నా 'స్టడీరూమ్'లో కూచుని ఏదో 'నోట్సు' తొందరగా వ్రాసు కుంటూ వుండగా—ఆమె ఓరగా మూసి వున్న నా గదితలుపు తోసుకు వచ్చి — కట్టున నన్ను చూచి సిగ్గుతో తిరిగిపోతూ- 'దొరగారి ఆఫీసుగాబోలు' (నేను ఖర్మం చాలక 'సూటు' తో వున్నాను) అంటూ నాకు వినపడేలాగనే గొణుక్కుని నవ్వు తూ గదిగుమ్మం దాటుతూ వుండగా — వాళ్లతో వచ్చిన ఒక ముసలావిడ చూచి "సీతా, ఏమిటా వెకవెక? నీబతుక్కి సాయం తల తగలేయించరా అంటే నీ తండ్రివినడు— అనుభవిస్తాడులే" రుంజుకుని వెళ్లింది.

నేను అప్పారావుపంతులుగారి శిష్యుణ్ణి. ఆ గురుదేవు డిచ్చిన కొత్తకళ్లతో అప్పుడే ప్రపంచాన్ని చూడడం ప్రారంభించినవాణ్ణి.

వెంటనే ఆ మాటలు నా కపాలాన్ని బద్దలుకొట్టి—మెదటిలో గుచ్చుకున్నాయి. పక్కగదిలో వెక్కి-వెక్కి ఏడుస్తూన్న మూలుగు వినపడింది.

నే నంతవరకూ—దురదృష్టదేవత జడ లోని ఆ సుందరపుష్పాన్ని తేరిచూడనే లేదు.

అప్పుడా మెను హృదయంలోకి తీసు కొని ఆదరించవలెనని ఎంతో తపించాను— మర్నాడు వారు బయలుదేరి వెళ్లిపోయారు. ప్రయాణసమయంలో సీత అందరితోనూ చెప్పి బండి ఎక్కుతూ నీలికోరింటపూలవంటి కళ్లనెత్తి ఒక్కసారి నావైపు చూచి ముఖం అటు తిప్పుకుని వెళ్ళిపోయింది.

తర్వాతనుంచి మా ఇంట్లో ఏదోదీపం ఆరిపోయినట్టు 'ఫీల' యాను.

నాగదిలో—మా గురుదేవుడు పలికిన 'ప్రేమకలుగక బ్రతుకు చీకటి' అనే వాక్యం కాళ్లు వచ్చి పచారు చెయ్యడం మొద లెట్టింది.

ఇది దుర్లభజనానురాగమనీ— ఈజన్మ మధ్యంలో ఇంక సీత నాకు కనపడదనీ గ్రహించలేనంత మూర్ఖుణ్ణి గాను — కాని యువకహృదయాలను నులిచి తనవైపు లాక్కునే ఏదో ప్రబలశక్తి నన్ను ఉన్మత్తుణ్ణి చేసింది.

తర్వాత కొన్నాళ్లకు నాకు పెండ్లీ— అయింది, పిల్లలూ — పుట్టారు. సంసార చక్రంలో తలవంచుకొని పరిభ్రమించడమూ మొదలుపెట్టాను. కాని—

ఆ సీతకోమలవిగ్రహంమాత్రం చాల రోజులవరకూ నాకళ్లలోంచి జారిపోలేదు.

జీవిత - గాయాల నన్నింటినీ కాలమే మాన్పివెయ్యగలదు.

క్రమంగా నా నేత్రాలలోని సువర్ణ స్వప్నాలూ — నా మనస్సులోతులలోని తియ్యనికోరికలూ— మాసిపోయాయి.

ఒక ఇంటివాడనై ఉద్యోగం చేస్తూ 'నిశ్చింత'గా కాలం గడిపివేస్తున్నాను. మరికొన్నాళ్లకు ఇంకో చిత్రమైన అనుభవం.

*

ఒకసారి నా ఉద్యోగపు హయాంరోజుల్లో కొన్ని ముఖ్యమైన జమీందారీవ్యవహారాలు పరిష్కరించుకోవడంకోసం ఒక పల్లెటూరు 'కమాను' వెళ్లాను. అక్కడ కొన్నాళ్లు మకాం చెయ్యవలసివచ్చింది.

గ్రామ—పెద్దలు, నాకు-వూరికి పక్కగా వున్న ఎలిమెంటరీస్కూల్లో బస ఏర్పాటు చేశారు.

జనసంచారం తక్కువ— చుట్టూ రకరకాలచెట్లు—పూలమొక్కలు— చక్కని గాలి—నావ్యవహారాలు చక్కబెట్టుకోడానికి బహు సదుపాయంగా వుంది.

అక్కడ సుమారు నెలరోజులున్నాను. నాపనిగూడ సలక్షణంగా పూర్తి అయింది. తెల్లవారితే స్వగ్రామం వెళ్లిపోడానికి ప్రయాణం పెట్టుకున్నాను.

పల్లెటూరి రైతుస్నేహితులు రాత్రి చాలావరకూ నాతో గడపి, అంతా దండాలు చెప్పి వెళ్లిపోయారు. పన్నెండుగంటలు దాటుతుంది. పుష్యమాసపువెన్నెల పుచ్చపువ్వులా వికసించి గ్రామసీమనంతటినీ వెలిగిస్తోంది.

నేను అప్పుడే గదిలోకి వెళ్లి పండుకున్నాను. బంట్రోతు వరెండాలో పాత ఈతచాపమీద ఒరిగి అట్టేసేపు కాలేదు.

పెరట్లో మామిడిచెట్లకింద పండుటాకులమీద పడుతూన్న ఏదో అడుగుల చప్పుడు పూర్తిగా నిద్రపోని నా చెవులకు తగిలింది. ఐదు నిమిషాలు గడిచాయి.

వరెండాలో ఏదో సన్నంగా తగ్గించిన గొంతులు వినపడుతున్నాయి.

బంట్రోతు మెల్లగా నాగదిలోకి వచ్చి వణుకుమాటలతో "బాబూ — ఎవరో అమ్మ మీతో — మాటాడవలసిన ... తొందరపని ... వుందట — అరుగుమీద వుండమన్నాను ... సెలవైతే..."

"వద్దు— వెళ్లు— నేనే వస్తు... న్నాను." నాతలలోంచి మెదడు జారిపోయి ఆచోట ఆశ్చర్యం నిండిపోతోంది.

నేను తూలుతూ వెళ్లాను — ఆమె నన్ను చూచి మెల్లగా అరుగుపక్కనుంచి పెరట్లోకి నడుస్తోంది సాభిప్రాయంగా—

తలలోని మల్లెచెండు నడిచేత్రోవను సువాసనతో నింపుతోంది—

స్త్రీజాతి మృదు హృదయాన్ని తిరస్కరించలేని దౌర్బల్యంవల్ల అనాలోచితంగానే ఆమెను అనుసరించాను.

వెళ్లి వెళ్లి ఒక మామిడిచెట్టుదగ్గిర తల వంచుకొని నిలుచుంది. నేను సమీపించాను.

"అమ్మాయీ, యెవరు నీవు? ఇంత రాత్రివేళ నాతో ఏమి...పని వుంది?—"

ఆమెను స్పష్టంగా చూచాను స్వచ్ఛమయిన దంతపుబొమ్మవంటి—శరీరం—తెల్లని చీర— వెన్నెలకాంతిలోని ఆమె ముఖం నిర్మలసరస్సులో తెల్లగలువలా మెరుస్తోంది.

నాతలలో తుఫాను పట్టింది.

ఆ నవనీతమతి మాటలాడలేకపోయింది.

"చెప్పదగినంత పని ఏమీ లేకపోతే... నేను వెళ్లవచ్చు ననుకుంటాను" అతి కుతుకంతో బాధపడుతూనే.

"...ఈ సాహసానికి...మన్నించండి— ఈ రాత్రి... ఇలా వచ్చినందుకు... నన్ను నీచంగా యెంచితే ప్రాణాలు వదిలించుకోవడంకన్న ఏమీ చెయ్యలేను." పాపం అభిమానంతో కుంగిపోయింది.

"ఫర్వా లేదు— అట్లా దిగులుపడడం దేనికి? నాతో నిర్భయంగా మాటాడవచ్చు" కొంచెం ఊపిరిపోశాను.

ఆమె తేరుకుంది—

"నే నొక గొప్పయింటి విశ్వబ్రాహ్మణుల కుటుంబానికి చెందినదాన్ని. తాతతండ్రులు బాగా చదువుకొన్నవారు. ఏం లాభం—కలిసిన సంబంధమని ఒక నిర్భాగ్యుడికి నన్ను చేశారు. అతడు దుస్సహవాసాలు మరిగి దేశాంతరాల పాలయిపోయాడు.

చచ్చిందీ బతికున్నదీ నేటివరకూ తెలియదు. నాబతుకు మంటగలిసిపోయింది. మా వాళ్లకు చాకిరీచేస్తూ—తోచనప్పుడు ఏవో పుస్తకాలు చదువుకుంటూ ఇక్కడే పడి వున్నాను.

ఈమధ్య ఎన్నోసార్లు మిమ్మల్ని చూశాను. మూర్ఛపోయిన నా కోరికలూ— ఆశలూ ఏవేవో మేలుకున్న ట్టయింది.

మీ ప్రసన్నమైన ముఖం—చక్కని కళ్లూ-మీకు తెలియకుండా నే నన్ను ఆకర్షించివేశాయి. కులం—మర్యాద-కీర్తికోసం ఎంతో గిలగిల కొట్టుకున్నాను. లాభం లేకపోయింది. పండువెన్నెల— నిండుయౌవనం— —మీపాదాలదగ్గిరకు వచ్చిపడింది—అనుగ్రహించలేరా?" శ్రావణరాత్రిలో నీటిమేఘంచాటునుంచి ఒక్క వెన్నెలరేకలా నీళ్లునిండిన కళ్లలోంచి సన్నంగా నవ్వి సిగ్గుతో తలవంచుకుంది—

ఆ శుభయామినిలో నా తను వొక్కసారి పులకరిల్లిపోయింది.

ఎన్ని అనంతతపస్సులకు — దురంత వేదనలకు—అనురాగనిష్ఠలకు — సుదూర సుఖస్వప్నాలకూ ఫలితంగా— ఈ కమ్మని రాత్రి—ఈ అప్సరసౌందర్యంనాకుఏ దేవతా

వరప్రసాదంగా-సిద్ధించిందో వూహించుకో లేకపోయాను. కాని...నా నోటి వెంట అప్రయత్నంగా ఈ మాటలు వచ్చాయి.

"నీ వంటి ఉపస్సుందరి నన్ను మనః పూర్తిగా ప్రేమించిం దంటే నా ధన్యత్వం ఎంతని వూహించగలను ? నా ముప్ఫదేండ్ల బ్రతుకులోనూ ఇంతటి పర్వసమయం సంభ వించ లేదు. నిజం. కాని—పూర్వమే భార్యా పిల్లలూ- సంఘం — మర్యాద— వీటిచేత 'మాంసపు జైలు'లో బంధింపబడ్డ ఖైదీని నేను.

ఇంత అస్వతంత్రపతితుడను నిన్ను ఎల్లా కన్నుల కద్దుకొని ఆదరించగలను ?

ఈ చక్కని వేళలో — మత్తులో— హాయిలో నీ సౌంద ర్యాన్ని-యౌవనాన్ని- కన్నులు మూసుకొని అనుభవించి నాత్రోవ వెంట నేను పోతే భవిష్యత్తులో—నీవు పడే నరకాగ్ని బాధను వూహించుకొని జాలితో కుంగిపోతున్నాను.

పురుషులు వట్టి వంచకులు — స్వార్థ పరులు—ఎవ్వరినీ నమ్మకు—వెళ్లు—వెళ్లి పో — నివశమైతే — నన్ను దూరంగానే ప్రేమించు-పిచ్చిదానా! ప్రేమకు భౌతికస్పర్శ లక్కర లేదు. ఏ సుఖస్మృతిలో నైనా నిన్ను నేను తృప్తిగా తలచుకో గలనుసుమా ...

తిరిగి చూడకుండా నాబసలోకి నడిచి పోయాను.

మల్లా చెట్లకింద పండుటాకుల్లో—విసు రైన అడుగుల చప్పుడులోనుంచి 'ఛీ-మగ వాళ్లు ఎంత రాళ్లు—' అన్నమాటలు గాలి లో తేలివచ్చాయి.

వెంటనే బంట్రోతును సామాను సర్ద మని చెప్పి తెల్లవారుజామునే ప్రయాణం సాగించాను"

కథ పూర్తిచేసి—

వెచ్చని పొడుగైన నిట్టూర్పుతో శర్మ గారన్నారు—

"నాయనా, జీవితాన్ని అనుభవపక్వం చేసి సత్యాన్ని గ్రహించండి — క్షుద్ర ప్రపంచ వాసనలకు లొంగక — తపస్సుచేసి ఉత్తమలక్ష్యాలను సాధించండి — ఓహో ఇప్పటికే చాలా ప్రొద్దుపోయింది. మాట మీద మాటగా ప్రసంగం పెరిగింది — ఇంక లేవండి—రేపు కలుసుకుందాం" లేచి శర్మగారు లోపలికి వెళ్లిపోయారు.

'నైమిశం'మెట్లు దిగుతూ క్రిష్ణయ్య గోపాలం బుజం తట్టి "అత డనేకయుద్ధముల ఆరియు తేరిన వృద్ధమూర్తి" భైరవిలో సన్నంగా అందు కున్నాడు.

---

## స వ ర ణ.

జనవరినెల భారతిలో "విమర్శనా పద్ధతులు" అనే వ్యాసం రెండవ పేరాలో "కాబట్టి మనం ఒక కావ్యాన్ని విమర్శించినప్పుడు ఆ కవికి ఆ గ్రంథంగురించి యెటువంటి అభిప్రాయం వున్నదో," అను దానితో "సమకాలికులు దానిని యేవిధంగా ఆదరించేవారో, నేడు దానికి సాహిత్యంలో

"అఖిలభారత కళాపరిషత్తు"కు

# సూచనలు

మహాశయా,

వందనములు. ప్రమాదిసం॥ కార్తీకమాసభారతిలో ప్రకటింపబడిన శ్రీ దేవగుప్తాపు విశ్వేశ్వరరావు గారి వ్యాసం చూశాను. అట్టి కళాపరిషత్తు అచిరకాలంలోనే నిర్మించాలని నాసమ్మతం. ఆ పరిషత్తుకు అనుబంధంగా ఇంకో శాఖకూడా వుండాలని అనుకుంటాను. అది సలహానిచ్చేశాఖ. ఈ శాఖవారు కవుల అభిరుచి కనిపెట్టి వివిధసారస్వతాలలోని కావ్యాల చదివి, ఆయా పుస్తకాల పేర్లు ప్రకటించి వాటిని చదవడంవల్ల కవుల భావాలు పరిపక్వదశకువచ్చునని సలహాలిస్తూవుండాలి. కవుల జీవితములు, వారు పడినబాధలు, వారి కవిత్వములోని గొప్పతనమునుగూర్చి వ్యాసాలువ్రాసి పరిషత్పత్రిక ప్రకటిస్తూవుండాలి.

తరువాత పరిషత్తువారు చెయ్యవలసిన పని యింకొకటి వుంది. మన కావ్యాలను పరదేశభాషల లోనికే కాకుండా, మనదేశభాషలలోనికి పరదేశ కావ్యాలుకూడ తర్జుమాచేయించి ప్రకటించినట్లయితే ఆయా భాషలు రానివారు తర్జుమాలో వచ్చినంతవరకైన కావ్యమాధుర్యాన్ని రుచిజూడగల్గుతారు. పరిషత్తువారి బహుమానములు పొందినకావ్యములను,కిండి కావ్యములను టెక్స్టుబుక్కు కమిటీవారున్నూ, బోర్డు ఆఫ్ స్టడీస్ వారున్నూ పాఠ్యగ్రంథములుగ నిర్ణయిస్తే కావ్యరచన ద్విగుణీకృతోత్సాహంతో సాగుతుంది.

ఆవంత్స వేంకటరంగారావు.

---

### కళాప్రపూర్ణ

# గిడుగు రామమూర్తిగారు

శ్రీ వెంపటి శ్రీనివాసమూర్తి.



శ్రీ గిడుగు రామమూర్తిపంతులుగారు అస్తమించారనంగానే నెత్తిమీద పిడుగుపడినట్లయింది. ఒకవారంరోజులకిందట రామమూర్తిపంతులుగారి 'తుదివాక్యాలు' అని పత్రికలలో ప్రచురించటం చూచి పత్రికాధిపతుల అఘాయిత్య మనుకొన్నానుకాని ఇంత త్వరలో ఆమాట నిజమవుతుం దనుకోలేదు.

వ్యావహారికభాషావాదం మొదలుపెట్టినవారిలో గురజాడ అప్పారావుగారు, శ్రీనివాసయ్యంగారు ఇంతకుముందే మరణించారు. అందరికంటే తీవ్రంగా పోట్లాడి, నవ్యమార్గంలో తలలెత్తే బాలకవు లందరికీ అభయ మిచ్చి, శిష్ట వ్యావహారిక భాషకు 'బ్రహ్మ' అనిపించుకొన్నది రామమూర్తిగారే. సనాతన పండితు లందరూ కారాలు మిరియాలు నూరారు. సవ్యంగా, అపసవ్యంగా రామమూర్తిగారి వాదాన్ని ఖండించారు. కాని రామమూర్తిగారి ధాటికి నిలవలేకపోయినారు. గ్రాంథికవాదులు తప్పులని నిందించేపదాల నెన్నిటినో పూర్వకవుల పుస్తకాల నుండి చూపించారు. పండితులు వాటికి పాఠాంతరాలు సృష్టించి అర్థంలేని పద్యాలు తయారుచేశారు. నవకవులు నూతనమార్గంలో నడుస్తుంటే ఎదిరించేవారికి సమాధానం చెప్పడానికి 'బాలకవిశరణ్యము' 'ఆంధ్ర పండితభిషక్కుల భాషాభేషజము' ప్రకటించారు. "వ్యాకరణం తెలియనివాళ్లు, పూర్వకవిగ్రంథాలు అర్థంకానివాళ్లు వ్యావహారిక భాషను ప్రోత్సహిస్తున్నార"నే అపవాదును

రామమూర్తిగారు తొలగించారు. నిజానికి ఈ రోజున వ్యావహారికభాషానుకూలుర లోనే ఎక్కువమంది పండితు లున్నారు.

వాదానికి ప్రతివాదం ఎప్పుడూ వుంటుంది. కాని ఒకవాదం సకారణంగా వుంటే, రెండవది మొండివాదంగా కనబడుతుంది. అధికారంచేతనో, ఆర్భాటంచేతనో కారణ రహితమైన వాదం గెలిచినట్లు కనపడినా, ప్రపంచంలో ఎక్కువకాలం నిలవదు. నిల కడమీద నిజం బైటపడుతుంది. రామమూర్తి గారి వాదం సకారణమైన దనడానికి ఆయన మరణించేనాటికి అసంఖ్యాకులైన ఆయన అనుచరులే సాక్ష్యం. ఆంధ్రదేశంలో మహాకవీ, పండితుడూ అయిన శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు రామమూర్తిగారి వాదాన్ని స్వీకరించారంటే, అంతకంటె ఆయన విజయానికి నిదర్శన మేముంటుంది ? ఇంకా ఎంతమందో పండితులు — శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు, శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారు—అంతా రామమూర్తిగారికి అనుకూలమే. నేటిపత్రికలలో ఒకటి రెండు తప్ప తక్కిన వన్నీ వ్యావహారికభాషనే స్వీకరించినవి.

అయితే, ఆంధ్రమహాపురుషు లందరి విషయంలోనూ జరిగే అన్యాయమే వీరి విషయంలో కూడా జరిగింది. రామమూర్తిగారు అసమానమైన పండితులు, వ్యాకరణ వేత్తలు, నాలుగుభాషలు తెలిసినవారు. ఇటువంటివారిని ఆంధ్రలోకం ఏవిధంగా సత్కరించింది? వీరి పాండిత్యానికి తగిన కృషిని వీరిచేత ఏమి చేయించింది ? ఒక సమగ్రమైన వ్యాకరణం, ప్రాచీనార్వాచీన పదాలను సంపూర్ణంగా చూపించే ఆంధ్ర కోశం, భాషాశాస్త్రం—వీటిలో ఒకదానినైనా రచించడానికి రామమూర్తిగారి కున్న శక్తి ఆంధ్రులలో ఇంకెవ్వరికీ లేదు. మన కోటీశ్వరులు, జమీందారులు, సాహిత్యోపాసకులు, విశ్వవిద్యాలయాధికారులు — ఎవ్వరూ రామమూర్తిగారిచేత ఒక పని చేయించుకోవడానికి కూడ సాహసించలేదు. పాశ్చాత్య దేశాలలో రామమూర్తిగారు పుట్టినట్లుంటే బ్రహ్మరథం పట్టేవారు.

కొత్తమతాలను, కొత్తసిద్ధాంతాలను సృష్టించినవా రెవరుకూడ వారి జీవితంలో వారివాదం సఫలంకావడం చూడటానికి నోచుకోలేదు. అందుకు విలక్షణంగా రామమూర్తిగారు వారునాటిన బీజం మొలకెత్తి, పెరిగి, మహావృక్షమై కవికోకిలలకు ఆస్కారమై, ఫలపుష్పాలతో ప్రకాశించడం చూచి బ్రహ్మానందంతో డెబ్బైఎనిమిదవయేట దీర్ఘనిద్రలో మునిగిపోయినారు. ఇప్పు డెంతమంది రాళ్లువిసిరినా చెట్టుకు చలనంలేదు. ఆమహావృక్షం ఇచ్చిన పక్వఫలాలను సక్రమంగా అనుభవించడమే ఆంధ్రులకు భావికర్తవ్యం.

ఇంకొక్కమాట—ఆంధ్రులలో మహాకవీ, సంస్కర్త అయిన కందుకూరి వీరేశలింగంగారిప్రతిమ రాజమహేంద్రవరంలో స్థాపించి, ఆంధ్రులు వారికి కృతజ్ఞత చూపించుకొన్నారు. వీరేశలింగంగారి తరువాత మళ్లీ వారికి సమానుడైన రామమూర్తిగారి విషయంలో కూడ అదేవిధంగా ఋణవిముక్తులు కమ్మని ఆంధ్రమహాశయులను ప్రార్థిస్తున్నాను.

# గిడుగు రామమూర్తి పంతులుగారు

## నా అనుభవాలు

శ్రీ శ్రీనివాసశిరోమణి

ఎప్పుడో బాగా జ్ఞాపకము చాలదు—ఆల్ ఇండియా రేడియోవారు మద్రాసు శాఖ కొద్దిరోజులలో పెడుతారు అనగా—నేను రాజమహేంద్రవరము ఏదో స్వంతపనిమీద వెళ్లినాను. శ్రీ రామమూర్తిపంతులు గారి దర్శనముచేయకుండా ఆ వూరునుంచి బయలు దేరడమెట్లాగని పంతులుగారిదర్శనము చేయడానికి వెళ్లినాను. మధ్యాహ్నము మూడు-మూడున్నరగంటలు అవుతుంది.

పంతులుగారు ఏదో యింగ్లీషు అక్షరాలలో ఉన్న పుస్తకము అతితీవ్రముగా చదువుతున్నారు. పక్కను నేను నిలుచున్నాను. వారిని కదిలించడానికి యిష్టములేకపోయింది. అరగంటసేపయింది. ఎందుకో ప్రక్కకు చూచినారు. నేను కనిపించినాను. ఒక్క నవ్వు నవ్వినారు. "మీరు సమయానికే వచ్చినారు ...నేను పాలీభాషలో మహావంశము చదువుతున్నాను. సూర్యరాయాంధ్రనిఘంటువులో ఫలానాశబ్దానికి"...అంటూ మొదలుపెట్టి "మీరున్నూ పాలిభాష చదివినారుకాదూ?" అని నన్ను ప్రశ్నించబోయినారు. "పాళీభాష యెప్పుడో చదివినాను. కాని నా కేమిన్నీ రాదు" అని వెంటనే పలకమీద వ్రాసి చూపించినాను. పంతులుగారు నవ్వి "తప్పించుకోడానికి అల్లా అంటున్నారు. పోనీ లెండి. ఆబాధ నేను పడుతాను" అంటూ కుశలప్రశ్నలు చేసినారు. ఏవేవో కబుర్లు చెప్పినారు. వచనరచనలో నాకు వస్తూఉన్న సందేహాలను వెల్లడించినాను. వారు నా సందేహాలను తీర్చినారు.

ఆల్ ఇండియా రేడియో ప్రసంగాలవిషయమై ప్రస్తావనవచ్చింది. పంతులుగారు ... నారు. రేడియోవారు ప్రసంగాలను సాధ్యమయినంత వరకూ వ్యావహారికాంధ్రములోనే ఉంచుతారని తెలిసి పట్టరాని సంతోషము కలిగింది పంతులుగారికి.

ఒక్క పెద్దనిట్టూర్పు విడిచినారు. పాము బుస కొట్టినంత చప్పుడయింది. మళ్లీ మాట్లాడడము ఆరంభించినారు.

"నా వాదాన్ని రచయితలు అందరూ అంగీకరించినారు. పత్రికలన్నీ ఒకటిరెండుతప్ప అన్నీ వ్యావహారిక భాషలోనే వస్తున్నవి. టాకీలోకూడా వ్యావహారికభాష వస్తూన్నదని నీవు చెపుతున్నావు. ఇక రేడియోవారు వ్యావహారికభాషకే ఎక్కువ ప్రాముఖ్యము యివ్వవలెనని అనుకొంటున్నారు. కాని నాకు యింకా తృప్తిలేదు. యూనివర్సిటీవారు మన వ్యావహారిక భాషను అంగీకరించలేదు. అంతవరకూ కృతకృత్యుణ్ణి అయినాను అని అనుకోను" అన్నారు.

నేను వినయంతో "కొన్నాళ్లకు గ్రాంథికాంధ్రములో పుస్తకాలే రావు. అప్పుడు యూనివర్సిటి వారు వ్యావహారికాంధ్రాన్ని అంగీకరిస్తారు. తప్పదు" అన్నాను.

"ఎంతకాలము పడుతుందో!" అని అన్నారు పంతులుగారు.

*        *        *

రామమూర్తిపంతులవారు ఒక్క భాషావిషయములోనే కాదు: అనేకవిషయాలలో అనుపమాన పండితులు....

ఒకప్పుడు ఆయనతో శ్రీ శివశంకరశాస్త్రిలు గారూ నేనూ ఇంకా కొంతమంది మిత్రులమూ కలిసి

పంతులవారు ఎంతసేపూ తెలుగువ్యాకరణాన్ని గురించి ప్రసంగించడమూ మధ్య మధ్య తెలుగు వ్యాకరణములో ఆయామాత్రాలనుగురించి మమ్మలను ప్రశ్నించడమూ సాగించినారు.

మేమంతా ఎన్నడో ఆయనవాదాన్ని సత్తరించి ఆచరణలో పెట్టినవాండ్లము. వ్యావహారిక భాషలో తప్ప గ్రాంథికాంధ్రమనే కృతకభాషలో వ్రాయ కూడదు అని మతముగా పెట్టుకొన్నవాళ్లము. ఈ దిక్కుమాలిన బాలవ్యాకరణముతో ఎందు కీయన మనలను బాధించడము అని విసుగెత్తిపోయినాము. మా అందరిలోనూ ఎక్కువ విసుగుచెందినది శ్రీ శివశంకరశాస్త్రులవారు.

శాస్త్రులవారు లౌక్యులు. మెల్లిగా భాషావిషయములోనుంచి ఆయనను తప్పించదలచినారు. ఎంత వాడయినా భలే కామినీప్రశంసలోకి తీసుకొనివస్తే సర్వమూ మరిచిపోకతప్పదు, అని మెల్లిగా ఉపాయముగా తెలుగుప్రబంధకారులు వ్రాసిన శృంగారపద్యాలూ ఆ శృంగారపద్యాలలోనుంచి ప్రబంధకారులు చేసిన సంభోగవర్ణనలూ ఆవర్ణించిన మైథునవైపరీత్యాలూ శాస్త్రిగారు చూచాయగా అందించినారు.

అంతే: రామమూర్తిపంతులుగారు చప్పన అందుకొన్నారు.

నేను ఇంగ్లీషులో "సెక్సు"మీద పుస్తకాలు చదివినాను. హావలెక్ ఎల్లిస్ వ్రాసిన పుస్తకాలన్నీ చదివినాను. అంతటితో ఊరుకోలేదు. వివాహబ్లాక పుస్తకాలు చదివాను. ఇంకా క్రాప్టు యెబ్బింగ్ వ్రాసిన సైకోపాతిఃకా సెక్సుయాలిస్ చదివాను. వాళ్లు చెప్పేవిషయాలు ఎంతవరకూ వాస్తవములో అని మనుష్యులను పరిశీలిస్తూవచ్చాను. వాళ్లు చెప్పిన విషయాలు చాలావరకూ అనుభవములోకి వచ్చినవి", అంటూ ఇక మాకు సెక్సుసయిన్సుమీద పాఠములు చెప్పడము ఆరంభించినారు.

* * *

ఏదో సెక్సుపుస్తకాలు అస్మదాదులము చదివి నాము. కాని ఆయన చెప్పినవి విషయాలు ...

గ్రహించలేదు. ఆ సెక్సులోనుంచి ఇక జారత్వముమీద పంతులువారు మాట్లాడడము మొదలుపెట్టినారు. అంతటితో మాకు మళ్లీ ఆవిషయముమీద కుతూహలము పోయింది.

* * *

మాలో చిత్రకారు డొకాయన ఉన్నాడు. అతడు మళ్లీ ఆప్రసంగాన్ని మార్చవలెనని, జారత్వము అది ఏయేదేశములో ఎట్లా పుట్టిందో ఆయా విషయాలనుగురించి ఉపన్యసిస్తున్న పంతులవారితో చిత్రరచనలో దిగంబరత్వము మొదలయినవాటిని గురించి ప్రశంసించినాడు. ఇక పంతులవారు చిత్రరచనమీదనూ హిందూదేశములో విగ్రహాలుచేయడములో దిగంబరత్వము ఎందుకు అవలంబించిందీ మొదలు పెట్టినారు. ఏవో హావల్ వ్రాసినపుస్తకాలు మాలో కొంతమంది చదివినవా రున్నారు. ఆయన చెప్పినవిషయాలు కొన్ని చాలా ఆశ్చర్యముకలగజేసినవి. వెంటనే ఆయావిషయాలు ఏయేగ్రంథాలను ఆధారముచేసుకొని చెపుతున్నారని నేను ప్రశ్నించినాను.

"నేను మూలగ్రంథాలు చదవలేదు. చదవడానికి అవకాశము లేకపోయింది. అయితే గోపినాథరావువ్రాసిన "ఐకనాగ్రఫీ" పుస్తకాలన్ని చదివినాను. విగ్రహాల విషయములో గోపినాథరావుకన్నా యెక్కువపరిశ్రమచేసి వ్రాసిన గ్రంథాలు నాకంటబడలేదు" అని పంతులవారు అన్నారు. అంతవరకున్నూ తక్కినవారిసంగతి ఏమోకాని నేను మాత్రము గోపినాథరావు అనేవాడు అంత గ్రంథము చేసినట్టు ఎరగను.

అయితే మాకందరికీ చాలా ఆశ్చర్యమువేసింది– ఈపంతులవారు చదవనివిషయమూ తెలుసుకోనివిషయమూ ఏదయినా ఉందా అనిపించింది.

* * *

నన్ను ఎప్పుడూ తెలుగులో హిందూదేశచరిత్ర వ్రాయమని పంతులవారు ప్రోత్సాహపరుస్తూ వచ్చినారు. వ్రాస్తానంటూ వచ్చేవాణ్ణి. కాని ఆపని యింతవరకూ చేయలేదు. ఆరోజులలో మేజరు, బి. డి. బసు అనే ఆయన క్రైస్తవసామ్రాజ్యము అనే పుస్త

వచ్చింది. గుంటూరులో మొట్టమొదట ఆపుస్తకాలు చదివినవాణ్ణి నేనే. పంతులవారు కనిపించగానే ఆ పుస్తకాలను గురించి మాట్లాడబోయినాను. అప్పటికి కొన్ని సంపుటములే నేను చదివినాను. పంతులవారు యావత్తుగ్రంథమూ చదివినారు. బసు వ్రాసినపద్ధతిని గురించి నాకు చాలాసేపు చెప్పినారు. కొన్నికొన్ని చోట్ల బసు చేసిన విపరీతవాదాన్ని గురించి ఎంతో యుక్తియుక్తముగా చెప్పినారు. వెల్లస్లీ ప్రభువువిషయములో "బసు హిందూదేశచరిత్ర వ్రాయడము మాని వేసి వెల్లస్లీ స్వంతవ్యవహారాలు పట్టుకొని వచ్చి రాజకీయాలకు ముడివేయడము చరిత్రకారుడు చేయవలసినపనికాదు" అని ఖండితముగా చెప్పినారు.

* * *

"బసు సిపాయియుద్ధాన్ని గురించి వ్రాయలేదు. సవార్కరు వ్రాసిన పుస్తకము దొంగతనముగా చదివినాను. అది నాకు సంతృప్తిగా లేదు" అన్నాను.

"అవును బసు సిపాయియుద్ధమును గురించి వ్రాయలేదు. కాని జాన్ విలియంకేయే అనే ఆయన మూడుసంపుటములు పెద్దపెద్దవి వ్రాసినాడు. కేయే అభిప్రాయాలు తప్పులు అంటూ మాలిసన్ ఒక రెండు సంపుటాలు వ్రాసినాడు. ఈ ఉభయులపుస్తకాలూ మనదేశములో ప్రతివారూ చదవవలెను" అన్నారు.

చరిత్రవిషయములో అందులో హిందూదేశచరిత్రవిషయములో వారిజ్ఞానము అపారము. ఆవిషయములో వారి పాండిత్యాన్ని గురించి చెప్పడము సూర్యుణ్ణి కాగడాతో చూపించినట్లే.

* * *

పంతులవారు నడుస్తున్నా కూర్చున్నా ఏపని చేస్తున్నా తెలుగుభాషనుగురించి యోజిస్తూనే ఉండేవారు.

బెజవాడలో గవర్నరుపేటలో చెట్లరోడ్డున మేము ఉభయులమూ నడిచి వెళుతున్నాము. హఠాత్తుగా పంతులుగారు ఆగిపోయి "చూడు చూడు- ఆబోర్డు చూడు. ఆబోర్డుమీద ఎలా

ఆబల్లమీద "ఇక్కడ ఫోటోగ్రాఫులు చక్కగా తీస్తారు" అని పెద్దఅక్షరాలతో వ్రాసిఉంది. పంతులుగారు బ్రహ్మానందపడిపోయి "ఈ ఫోటోగ్రాఫర్ ఎవరో మనవాడయ్యా - మామూలు పద్ధతిలో అయితే, "ఇచ్చట ఫోటోగ్రాఫులు చక్కగా తీయబడును" అని వ్రాసి ఉండేవాడు. ఇచ్చట అనేది కృతకశబ్దము. తీయబడును అనే కర్మణిప్రయోగము మన తెలుగులో లేదు" అన్నారు పంతులుగారు.

ఆయన అంతటితో ఊరుకొంటారా? ఆఫోటోగ్రాఫులదుకాణములోకిపోయి అట్లా అతడు ఎందుకు వ్రాసినాడో విచారించేవరకూ పంతులుగారు ఊరుకోరు. లోపలికి వెళ్లినాము. ఆ దుకాణదారు మేము ఎరిగినబుద్ధిమంతుడే అయినాడు.

ఆరోజునే బెజవాడ ఊళ్లోకి పోయినాము.

అక్కడ యింతకన్నా చిత్రమయినబోర్డు చూచినాము. ఆబోర్డుమీద "ఇక్కడ పచారీదినుసులు అమ్మడమవును" అని ఉంది. ఆబోర్డునూ పంతులవారే చూచి నాకు చూపించినారు. "చూచినావా ఇతడు సంప్రదాయముగా వస్తూఉన్న తెలుగువాక్యము వ్రాసినాడు" అన్నారు.

ఆకొట్టుదగ్గరకు పోయినాము. ఆకొట్టువాణ్ణి విచారించినాము.

అట్లా ఎందుకువ్రాసిందీ తనకు తెలియదనీ ఆ కొట్టు ఆరంభించి అప్పటికి అరవైసంవత్సరా లయిందనీ అరవైసంవత్సరాలనాడు వాండ్లపెద్దవాం డెవరో ఆబోర్డుమీద ఆవాక్యము అట్లా వ్రాయించినట్లూ ఆ బోర్డు అచ్చివచ్చినందువల్ల ఆబోర్డుమీదనే అక్షరాలు చెరిగిపోయినప్పుడల్లా ఆ అక్షరాలమీదనే కొత్తరంగు పూయిస్తున్నట్టు ఆ దుకాణపుయజమాని చెప్పినాడు.

పంతులుగారు ఆసమాధానానికి సంతృప్తిచెందినారు. "తెలుగుభాషలో కర్మణిప్రయోగము లేదు. 'చేయబడును తీయబడును' మొదలయిన ప్రయోగాలు సంస్కృతములో నుంచిన్నీ ఇప్పుడిప్పుడు ఇంగ్లీషు

చేయడమువును, తీయడమువును అనేవి పరంపరలో వస్తూఉన్న ప్రయోగాలు" అని అన్నారు.

"అయితే తీస్తారా అన్నప్పుడు సంప్రదాయ కప్రయోగము చెడిపోయిందని మీ అభిప్రాయమా" అని నేను ప్రశ్నించినాను.

"కాదు కాదు" అంటూ తీస్తారా అన్నప్పుడు స్ఫురించే అర్థమునకున్నూ తీయడమువును అన్నప్పుడు స్ఫురించే అర్థమునకున్నూ ఉన్న వ్యత్యాసాన్ని బోధపరిచినారు.

* * *

ఆనాడు వారు తెలుగులో కర్మణిప్రయోగము లేదు. ఈ కర్మణిప్రయోగాలు ఆధునికులు చేస్తూవచ్చినారు. ప్రాచీనులు చేయలేదు. అని పంతులుగారు చెప్పినారు. కొంతకాలము గతించింది. పోతరాజుగారి భాగవతములో మూడుచోట్ల పడుధాతువును కర్మణిలో ఉపయోగించినట్లున్నూ పాల్కురికి సోమన్న బసవపురాణములో రెండుచోట్ల పడుధాతువును కర్మణిలో ఉపయోగించినట్లున్నూ నాకు తోచింది. పంతులుగారికి ఈ విషయము విన్నవించినాను.

వారు నవ్వినారు. "ఈ ప్రయోగాలు నాకంటా పడినవి. యోజించినాను. భాగవతములో రెండుచోట్ల పడు అనేధాతువును విభక్తి ప్రత్యయముగా వాడినాడు. ఛందస్సుకోసము సంస్కృతములోనుంచి ఈ కర్మణి ప్రయోగము తెలుగువారు ఎరువు తెచ్చుకొన్నారు. అది ఎరువు సొమ్ముగానే కనబడుతూ ఉంటుంది. అయితే ప్రాచీనకవులు సకృత్తుగానే వాడినారు. నిత్యవ్యవహారములో పడుధాతువు కర్మణిలో ఉపయోగించినట్టు ఊహించడానికి యెంతమాత్రమున్నూ అవకాశము లేదు.

తోకతొక్కిన త్రాచు అనేది లోకోక్తి. ఇది కర్మణిప్రయోగము అయితే తోకతొక్కబడిన త్రాచు అనవలసి ఉంటుంది. అట్లాయెప్పుడూ ఎవరూ అనరు. అంటే నవ్వుతాము. అట్లా అనరు అని ఖండితముగా చెపుతాము. తిన్న అన్నము కట్టినగుడ్డ: అన్నప్పుడు నాచేత తినబడిన అన్నము: నాచేత కట్టబడినగుడ్డ అని

వెంటనే నేను "క్షితప్రతిబద్ధవత్వాం" అనేదాన్ని తెలుగులో ఎట్లా చెప్పవలెనో చెప్పండి అన్నాను. నవ్వుతూ తవుళ్లాడుకోకుండా "పాలుకుడిచినను దూడ కట్టివేసి" అని అన్నారు.

ఏమి చెప్పవలెనో తెలియలేదు.

* * *

"పడుధాతువు కర్మణిలో వాడకము లేదని అంటున్నారే? అయితే మీరెందుకు కర్మణిలో వాడినారు" అని ప్రశ్నించినాను.

"నేను వాడినానా?... నేను వాడినా తప్పే. నేనే వాడినట్లయితే ఇంగ్లీషులో ఆవాక్యము ఆలోచించి తెలుగులో వ్రాసి ఉండవలెను. అయినా ఎక్కడ వాడినానో చూపించు" అన్నారు.

"గృహలక్ష్మీకంఠాభరణము" అనే పుస్తకమునకు తాము పీఠిక వ్రాసినారు. ఆపీఠికలో మొదటి వాక్యములోనే పడుధాతువును కర్మణిలో వాడినారు" అన్నాను.

వెంటనే ఆపుస్తకము తీసి చూచినారు. నేను చెప్పినట్లే ఉంది. చాలా కించపడిపోయినారు. వెంటనే గుర్తుపెట్టుకొన్నారు. "ప్రమాదమే జరిగింది" అన్నారు.

పంతులుగారు ఆ గ్రంథముమీద తమ అభిప్రాయము చెపితే మరొకరు ఆపీఠికలో పడుధాతువును కర్మణిలో ఉపయోగించి వాక్యము వ్రాసినట్లు తరువాత కొంతకాలానికి నాకు తెలిసింది.

* * *

పంతులుగారి ధారణాశక్తి అద్వితీయము. అంత ధారణాశక్తికలవారిని నే నింతవరకూ చూడలేదు.

గాంధీమహాత్ముడి ధారణాశక్తి అద్వితీయమని ఆయనను బాగా ఎరిగినవారు చెపుతూఉంటారు. నాకయితే స్వయముగా మహాత్ముడి ధారణాశక్తిని గురించి తెలియదు: ఇతరులు చెప్పినదాన్ని బట్టిచూస్తే మహాత్ముని శక్తికన్నా పంతులవారి ధారణాశక్తి

పంతులుగారు ఆసాయంత్రము ఉపన్యసిస్తారు. ఉపన్యాసానికి బయలుదేరడానికి ముందుగానే వారు ఒకకాయితముమీద చెప్పదలచుకొన్న విషయాలసూచి కను వ్రాసుకొంటారు. ఆ ఉపన్యాసములో ఏఘట్టములో ఏయేగ్రంథాలనుంచి ఏయేభాగాలు ఆరోజున ఉదాహరించేదిన్నీ ముందుగానే నిర్ణయించుకొని ఆయాపుస్తకాలన్నీ సమకూర్చుకొంటారు. చెప్పవలసిన ఆపుస్తకాలపుటలు తీయడానికి గుర్తులు పెట్టుకొని మరీ బయలు దేరుతారు.

యథాప్రకారముగా ఉపనివంతా వారు ప్రారంభించినారు. ఆయాపుస్తకాలలో వారుచెప్పిన పుటలలో గుర్తులు పెట్టినాను. ఆయన ఆరోజున ఉదాహరించదలచిన పుస్తకాలన్నీ ఒకగాడిద బరువు అయింది. అంత బరువూ నేను మోసుకొనిపోవడానికి బద్ధకము వేసింది. సాయంత్రము వారు బయలుదేరుతుండగా వారిదగ్గిరకువెళ్లి "ఇన్నిపుస్తకాలూ మనము యిక్కడి నుంచి పట్టుకొని పోనక్కరలేదు. ఉపన్యాసముచేసే శాలలో ఉన్న"వని చెప్పినాను : ఆయన సరేనన్నారు.

పంతులవారు ఉపన్యాసము ప్రారంభించినారు. ఆయనకు అవసరము వచ్చినప్పుడు పుస్తకములలో పుటలు తెరిచియివ్వడానికి అక్కడ కూర్చుని గుర్తులు పెడుతూఉన్నాను. వారు వ్రాసుకొన్న సూచీపత్రము నాదగ్గిరే ఉంది. కాబట్టి ఏపుస్తకముతో యెప్పుడు వారికి అవసరము వస్తుందో నాకు తెలుసును.

ఇక క్షణలేశములో వావిలికొలను సుబ్బారావు గారి రామాయణములోనుంచి వారు ఉదాహరిస్తారు. ఆరామాయణములో వారు ఉదాహరించదలచుకొన్న పద్యముకోసము వెతుకుతున్నాను. ఇంతలో "ఏదీ ఆరామాయణములో పద్యము; యింకా తీయలేదూ" అంటూ నన్ను ప్రశ్నించినారు. నేను గాభరాపడిపోయి దబాదబా అపుటలో ఆపద్యముకోసము వెతుకుతున్నాను. క్షణలేశము అయివుంటుంది. "ఇంకా కనిపించలేదు" అని గద్దించినారు. నేను నిర్విణ్ణుణ్ణి అయిపోయినాను.

ఆలస్య మయినందుకు పంతులవారు ఒక్క నిట్టూర్పు విడిచినారు. నన్ను చూస్తూ "ఆరామాయణము ఎన్నో కూర్పో చూడండి" అన్నారు.

"రెండో కూర్పు" అని సంజ్ఞచేసినాను.

"ఆఁ అదే అందువల్లనే, ఆలస్య మయింది. మనం ఇంటిదగ్గిర మొదటికూర్పు చూచినాము. రెండో కూర్పు అయితే ఆపేజీ తిప్పి కిందినుంచి పైకి మూడు పంక్తులు చూడండి. మనకు కావలసిన పద్యముఅక్కడ దొరుకుతుంది" అని అన్నారు.

అంతే అపక్క పేజీ తిప్పి కిందినుంచి మూడు పంక్తులూ పైకిచూచినాను. వారికి కావలసిన పద్యము అక్కడ ఉండనేఉంది. ఆజ్ఞాపకశక్తికి నాగుండె బ్రద్దలయింది.

ఏతాటాకుపుస్తకములో ఎన్నో ఆకులో ఎన్నో బంతిలో ఏశబ్దము ఉందో ఇట్టే చెప్పివేసేవారు. అంతే కాదు. పదిసంవత్సరాలవాడు వారిపేర కార్డు వ్రాస్తే వారిదర్శనము చేయగానే ఫలానా తారీఖున మీరు వ్రాసిన కార్డులో ఇల్లా అన్నారే అంటూ మొదలు పెట్టేవారు.

* * *

మే మిద్దరమూ ప్రయాణముచేస్తూ ఉన్నాము. పంతులవారు యథాప్రకారము ఏదో ప్రబంధము తీసుకొని పచ్చపెన్సలుతో గుర్తులు పెడుతున్నారు. నేను ఆరైలుపెట్టెలో ఒకమూలకూర్చుని ఆయనకు కనబడకుండా సిగరెట్టుకాల్చుకొంటున్నాను. ఇంతలోనన్ను పిల్చినారు. ఏమిరా భగవంతుడా ఏదో వ్యాకరణ సూత్రముతోనో ఏదోశబ్దము ఏదో మారిపోయింది అనో చెప్పి విసిగిస్తారు కాబోలు ననుకొంటూ సిగరెట్టు పారవేసి ఆయన దగ్గిరకు పోవలెననుకొన్నాను. నన్నుచూచి నవ్వుతో "ఎవ్వే సిగరెట్టుమాత్రము పారవేయకండి, ఒక్క శబ్దరూపము మాత్రమే ఎలా మారిందో చెపుతాను" అన్నారు.

నే నయితే సిగరెట్టు పారవేసినాను. పంతులుగారు మందహాసముచేస్తూ "పాపం దురభ్యాసము అయింది. ఏమిచేయడము. నాకూ చుట్టతాగే అభ్యాసము ఉంది. టాల్‌స్టాయ్ అరవై ఏండ్లు దాటినతరువాత చుట్టతాగడము మానివేసినాడట. ఆమానివేసిన తరువాత వారమురోజులు యమయాతన పడ్డాడట.

ఆవిషయము మామూలుగా పుస్తకము చదివేవాడి కేం తెలుస్తుంది!" అన్నారు.

* * * *

పంతులుగారు తెలుగువ్యాకరణా లన్నీ చదివిన తరువాత అవన్నీ అసమగ్రముగా ఉన్నవనీ సమగ్రమయిన వ్యాకరణము తయారుచేయవలెననీ పూనుకొన్నారు. అహోరాత్రములూ అందుకు అవసరమయిన పరికరాలన్నీ కూర్చడము మొదలుపెట్టినారు. ఇంట్లో కొమార్ల నందరినీ అందులో పెద్దకుమారుణ్ణి నిద్రఅయినా పోనీయకుండా ఆ వ్యాకరణోదాహరణాలకోసము బాధపెట్టినారు. పదిహేనుసంవత్సరాలు కష్టపడి పనిచేసినారు. ఏవూరుపోతే ఆవూళ్లో మిత్రులనూ శత్రులనూ (శత్రువులంటే పండితు లన్నమాట) ఆ ఉదాహరణాలనుగురించీ, వారు పరిశోధించిన విషయాలనుగురించీ ప్రశ్నించేవారు. ఏదయినా అంతవరకూ వారు ఊహించనివిషయము తెలుసుకొంటే తమ చిఠాలో వ్రాసుకొనేవారు. అప్పటికప్పుడే ఆ విషయము యోచించమని పెద్దకుమారుడికి తాకీదు పంపించేవారు.

అట్లా పదిహేనుసంవత్సరాలు కష్టపడి తయారుచేసుకొన్న గ్రంథము—ఆగ్రంథము పుచ్చుకొని అయిదుసంవత్సరాలు దేశమంతటా తిరిగినారు. తాము తెలుసుకొన్నదానికంటే మరొకరికి ఏమీ తెలియదు అని తేలిపోయింది.

ఆగ్రంథాన్ని అచ్చువేయించమని మే మంతా వేధించినాము.

ఇంతలో ఒకానొక శాస్త్రిలుగారు పంతులుగారి దగ్గిరకు వచ్చి సమగ్రమయినవ్యాకరణము తెలుగులో వ్రాయవలె ననుకొంటున్నాను. మీ గ్రంథము అంతా నాకు యిప్పించండి. నాపుస్తకానికి ఉపయోగించుకొంటాను అన్నారు. అంతే అడిగిందే ఆత్రముగా పంతులుగారు తమగ్రంథాన్ని ఆ శాస్త్రిలుగారిచేతికి యిచ్చినారు.

ఆశాస్త్రిలుగారు పంతులుగారు వ్రాసుకొన్న ఉదాహరణ లన్నిటికీ సూత్రాలు గ్రాంథికములో తయారుచేయించి అచ్చువేయించినారు. ఆపుస్తకములో పంతులవారి పేరయినా ఆబ్రాహ్మణుడు చెప్పలేదు.

* * *

రాజమహేంద్రవరము పంతులవారితో నేను వెళ్లినాను. అక్కడ భావరాజు వెంకటకృష్ణరావుగారు పంతులుగారిదగ్గిరకు వచ్చి ఆవ్యాకరణములో పంతులవారి పేరయినా ఆశాస్త్రిలవారు వేయలేదని భగ్గున మండిపడిపోయినాడు.

పంతులుగారు పకపక నవ్వినారు. కృష్ణారావుగారి వీపుతట్టి "నాపే రెందుకు? నాకు పేరు అక్కరలేదు. నావాదాన్ని ఆశాస్త్రిలవారు లోకములో పారవేసినారు. నా కదే తృప్తి" అన్నారు.

అంతటితో కృష్ణారావుగారు ఊరుకోలేదు. ఏదేదో మాట్లాడినారు.

పంతులుగారు గంభీరముగా "అక్షరాలు కనిపెట్టినవాడిపే రెవరికయినా తెలుసునా? అట్లాగే నా పేరు లోకానికి తెలిస్తే ఏం తెలియకపోతే ఏం" అని మందలించినారు.

* * *

పంతులుగారి పేరు అయినా ఉదాహరించలేదంటే నాకూ చాలా కష్టమువేసింది.

ఆపుస్తకము పీఠిక చూదామని తీసినాను.

ఆపుస్తకానికి ఒక వీరగ్రాంథికుడు—చిత్తూరు జిల్లా ఆయన—ఉపోద్ఘాతము వ్రాసినాడు. వీరగ్రాంథికు డనడములో నా అభిప్రాయము వీరశైవులు వీర వైష్ణవులు అన్నట్టు......

ఆవీరగ్రాంథికుడు పుస్తకము వ్రాసినానని ప్రకటించుకొన్న శాస్త్రిలవారిని గురించి వ్రాస్తూ "అనన్యసామాన్యపండితుడు" అని కితాబు యిచ్చినాడు. అది చూసి నేను నవ్వుకొని పంతులుగారికి చూపించినాను.

పంతులుగారు "అనన్యా! రానిభాషలో వ్రాస్తే వచ్చేఅనర్థకము ఇదేసుమా" అని వెంటనే పుస్తకము వ్రాసిన శాస్త్రిలవారిని పిలిపించి "అనన్యసామాన్య పండితుడు" అనేశబ్దము చూపించినారు. పంతులుగారు అంతటితో ఊరుకోలేదు. ఆకితాబు శాస్త్రిలుగారి కిచ్చిన వీరగ్రాంథికుడికికూడా చెప్పినారు.

కాని ప్రయోజనం...ఇప్పటికీ ఆతప్పు అలాగే ఉపోద్ఘాతములో ఉంది.

* * *

బెజవాడస్టేషనులో నేనూ పంతులుగారూ రైలు ఎక్కబోతున్నాము.

ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారు కనిపించినారు. అంతే; రామమూర్తి పంతులుగారు ఎకాఎకి పోయి వారిని కలుసుకొన్నారు. వారు మా అదృష్టవశాత్తూ తెనాలి వెళుతున్నారు. మేమున్నూ తెనాలే బయలుదేరి వెళుతున్నాము. రైలు ఎక్కినాము. కూర్చున్నాము. ఇక పంతులుగారు "మాలపల్లి"లో గుంటూరు జిల్లా మెట్టతాలూకాల ప్రయోగాలను గురించి చర్చించినారు.

"మీ మాలపల్లి రెండోపేజీలో తుమ్మపీకలు ఎక్కివస్తున్నవి అనే ప్రయోగము ఒకటివుంది. ఎక్కిరావడము అనేది పెరుగుతున్నవి అనే అర్థములో వ్రాసినారు. ఈప్రయోగము వ్యవహారములో మాత్రమే ఉందా లేక ఏదయినా గ్రంథములో చూచినారా" అని ప్రశ్నించినారు. లక్ష్మీనారాయణగారు తమకావిషయము తెలియదనీ తమ ప్రాంతాలలో ఆవాడుక ప్రతిరైతున్నూ చేస్తాడనిన్నీ చెప్పినారు.

పంతులుగారు కొంతసేపు ఆయావిషయాలను గురించి మాట్లాడి "కాంగ్రెసువారు నామతాన్ని అంగీకరించవలెను. నామతాన్ని అంగీకరించేట్లయితే అచిరకాలములో కాంగ్రెసు జయిస్తుంది" అన్నారు.

లక్ష్మీనారాయణగారు ఎందువల్ల - ఏలాగు? అని ప్రశ్నించినారు.

"అయితే వినండి ... మీస్వరాజ్య ఉద్యమము లోకి ప్రజలందరూ రావలెననేట్లయితే ప్రజలందరూ మీ ఉద్యమాన్ని ముందుగా అర్థముచేసుకోవలెను. మీరు ప్రతి గ్రామమూపోయి ప్రచారముచేయలేరు. అంతేకాదు అట్లాచేయడానికి అంతరాయాలూకూడా వస్తవి. మీ ఉద్యమమంతా వ్రాతతోనూ కరపత్రాలు ప్రకటించడముతోనూ సాగవలెను. మీ రిప్పుడు రెండుకోట్ల డెభ్భైలక్షలమంది ఆంధ్రులను విద్యావంతులనుచేయడానికి నామతము అంగీకరించేట్లయితే ఒకమాసమురోజులలో సాధ్యమవుతుంది. ముందుగా వ్యావహారికభాషలో మీకరపత్రాలన్నిటినీ వ్రాసి అచ్చొత్తించండి. ఆతరువాత తెలుగుఅక్షరాలూ గుణింతమూ ప్రతివారికీ నేర్పడానికి గ్రామానికొకప్రచారకుణ్ణి ఏర్పాటుచేయండి. అక్షరాలూ గుణింతమూ మామూలు తెలివితేటలుగలవాడు నేర్చుకోడానికి వారము పదిరోజులకన్నా ఎక్కువ పట్టదు. ఎప్పుడయితే అక్షరాలూ గుణింతమూ వచ్చిందో అక్షణమునుంచీ మీ కరపత్రాలూ మొదలయినవి చదువుకోగలుగుతాడు. ఇంతకన్నా దేశములో విద్య వ్యాపింపచేయడానికి సులభమార్గము లేదు. మీరీపనికి పూనుకోవలెను. ఈ విధముగా బాల్కనురాష్ట్రాలలో యుద్ధము అయిపోయినతరువాత చేసినారు. నేను ఆవిషయమంతా చదివినాను. బాల్కనురాష్ట్రాలలో ఆరుమాసాలలో విద్యాశూన్యత అంతా తొలగిపోయింది. మీరు చేయవలెనుసుమా ఈపని" అన్నారు పంతులుగారు.

పాపము పంతులుగారు అనేకమందిని అనేకపనులకు ప్రోత్సహించినారు. కాని ఆయాపనులు చేసినవారు అరుదు.

---

# బాంకుల దివాలాలు

## (రిజర్వు బాంకువారి చిత్తు బిల్లు)

శ్రీ కొచ్చెర్లకోట సత్యనారాయణమూర్తి

"ఊడుపుపంటలతో ఉబ్బుఖాయిలాలువచ్చాయి" అని గోదావరిజిల్లాలో వకసామెత వుంది. ఆర్థికపరిస్థితులు అభివృద్ధిఐనకొద్దీ దేశంలో బాంకులుకూడా అభివృద్ధికావడం, అందులో పరపతిబాంకులు, భూమితనఖాబాంకులు, పారిశ్రామికబాంకులు మొదలైన నానావిధాలైన బాంకులు అభివృద్ధి కావడం, అవసరమైంది. దానితోబాటు బాంకుల పేరుజెప్పి మోసాలు, దివాలాలు, వేలకొద్ది ప్రజ నష్టపడడం తప్పటంలేదు. కాని మనదేశంలో వేసంగులలో వేలకొద్ది గ్రామాలు అగ్నిప్రమాదాలవల్ల తగులబడడంగురించి మనం ఎంత అశ్రద్ధ చూపిస్తున్నామో, అలవాటుపడి వున్నామో, ఈబాంకుల దివాలాలనుగురించీ, ఇందువల్ల వేలకొద్ది కుటుంబాలు కూలిపోవడం గురించీ కూడా ఆవిధంగానే అలవాటు పడ్డాము. బాంకులంటే ఏమిటి? బాంకుల దివాలాలను మోసాలను వారించడానికి సాధనాలేమిటి? అని ఆలోచించడం కూడా మానివేశాము. తెలుగుదేశంలో వకజిల్లాజడ్జికోర్టులో ఈమధ్యఒకబాంకుదివాలానుగురించి విచారణ జరిగే సందర్భంలో హనుమంతరావు అను వకముసలి బ్రాహ్మణుడు, తనకున్నదంతా ఆబాంకులో పెట్టానని వలవల ఏడ్వగా, "ఈనాడు ఈజిల్లాలో ఎంతమంది హనుమంతరావులు ఈబాంకుదివాలావల్ల ఈవిధంగా ఏడుస్తున్నారో" అని జడ్జి తన తీర్పులో వ్రాశాడు. కాని అగ్నిప్రమాదాలతోబాటు, అంటువ్యాధులతోబాటు, బాంకుదివాలాలనుకూడా కర్మసిద్ధాంతానికి ముడిపెడుతున్నాము, మనం-

మనదేశంలో ఈమధ్య సర్వసామాన్యమైన బాంకు దివాలాలను గురించి వాటిని వారించే సాధనాలనుగురించీ రిజర్వుబాంకువారు వకచిత్తుబిల్లును తయారు చేసి ఇండియాగవర్నమెంటువారికి నివేదించారు. దానిని ఇప్పుడు బాంకుల, ప్రజల,అభిప్రాయం కోసం దేశంలో ప్రచురణలో పెట్టారు. మనదేశంలో వున్న బాంకులవిధానం ఎట్లావుంది? వాటిలో ఇప్పుడున్న లోపాలేమిటి ? ఇన్ని దివాలాలకు కారణాలేమిటి? వాటిని ఇకముందు నివారించడానికి రిజర్వు బాంకు సూచిస్తూవున్న సవరణ లేమిటి? రోగం పోగొట్టడానికి వేసిన మాత్రవల్ల ప్రాణానికే ఉపద్రవం కలిగినట్లు, ఈ సవరణలవల్ల అసలు బాంకుల అభివృద్ధికే ముప్పురాదుగదా? నేడు దేశవాళీ బాంకులలో అగపడుతూవున్న లోపాలకు, వాటిఅత్తగారు, అని చెప్పదగ్గ రిజర్వుబాంకు ఎంతవరకు బాధ్యురాలు ? ఇవి మనం ఆలోచించవలసిన విషయాలు మన బాంకింగువిధానాన్నిగురించి ముందుగా ఒకటి రెండుముక్కలు చెప్పాలి.

(౧) రిజర్వుబాంకు మన బాంకింగువిధానానికి కేంద్రసంస్థ. దేశంలోవున్న పరపతివిధానాన్నీ నాణేల చలామణీవిధానాన్నీ దేశాభివృద్ధి కనుకూలంగా సరియైనమార్గాలలో నడపడం దాని ప్రధానకర్తవ్యం. దానికికూడా వాటాదార్లు ఉన్నారు; అదికూడా వాటాదార్ల బాంకే. కాని లాభాలు సంపాదించడం దాని ముఖ్యోద్దేశం కాదు. లాభాలకోసం ఇతర బాంకులతో పోటీకిరాదు. అది బాంకులకు బాంకు. తన మెంబర్లైన బాంకులకు అప్పులిస్తుంది; డబ్బు రవాణా చేసిపెడుతుంది; అత్తగారి మోస్తరుగా పైనుండి కర్రపెత్తనంచేసి, ఇతర బాంకులలో తప్పులుపడుతూ, శ్రీరంగనీతు లుపన్యసిస్తూ వుంటుంది. అదిగాక,

ఇండియాగవర్నమెంటుకీ, వివిధరాజధానుల గవర్నమెంట్లకీ, బాంకింగుపని నిర్వహిస్తుంది.

(౨) ఆతర్వాత చెప్పవలసినవి వర్తకపుబాంకులు. వాటిలో ముఖ్యంగా చెప్పవలసినది ఇంపీరియలు బ్యాంకు. దేశమంతటా ౩౫౦ పైగా బ్రాంచీ ఆఫీసులు, ఇంకా ఎన్నో సబుఆఫీసులు వుండడంవల్ల దానికి ఎంతో బలమూ ప్రాధాన్యతా కలవు. రిజర్వు బాంకు లేనిచోట్ల దానికిది ఏజంటుగా పనిచేస్తావుండడంవల్ల గవర్నమెంటుబాంకు అన్నగౌరవం దీనికి ఇంకా పోలేదు.

(౩) ఎక్చేంజిబాంకులు ముఖ్యంగా విదేశవర్తకం నడుపుతున్నవి, చార్టర్డు, మెర్కెంటైలు, నేషనలు వగైరాలు; ప్రస్తుతం వీటిసంఖ్య ౧౯. ఇవన్నీ కూడా ఇతర దేశాలలో రిజిస్టరీఅయిన విదేశీబాంకులే. అర్థబలమూ, అధికారులప్రాపూ కలిగి, వుండడంచేత మన విదేశవాణిజ్యంలో వీటిదే పైచెయ్యిగా వుంది. తమడిపాజిట్లకూ అప్పులకూకూడా వీటిరేట్లు దేశవాళీ బాంకుల రేట్లకన్న చాలాతక్కువగా వుంటాయి. మన విదేశవర్తకం వీరి గుత్తహక్కు అని చెప్పవచ్చును.

(౪) దేశవాళీ బాంకులలో 'షెడ్యూలు బాంకులు' ముఖ్యమైనవి. రిజర్వుబాంకు చట్టంప్రకారం, వసూలైన మూలధనమూ రిజర్వూకలసి ౫లక్షల రూపాయలకు పైగా గలబాంకులను "షెడ్యూలుబాంకులు" అని వ్యవహరిస్తారు. ఈ షెడ్యూలు బాంకు లన్నీ రిజర్వుబాంకులో కొంతకనీసం రొక్కం నిలవవుంచుకోవాలి. ప్రతివారమూ తమ వ్యాపారాలనుగురించి వార్తాపత్రికలలో స్టేటుమెంట్లు ప్రకటించాలి. ఇట్టి నిబంధనలు ఇంకా కొన్నివున్నాయి. వాటికి కావలసినప్పుడు రిజర్వుబాంకు, గవర్నమెంటువగైరా పత్రాల హామీమీద దేశంలో అప్పులిస్తుంది; చవకరేట్లకి దేశంలో ఒకచోటునుంచి మరోచోటికి ద్రవ్యాన్ని రవాణాచేసిపెడుతుంది. వీటిలో ముఖ్యంగా చెప్పదగ్గవి సెంట్రలు బాంకు, బాంకు ఆఫ్ ఇండియా, అలహాబాదుబాంకు, బాంకు ఆఫ్‌బరోడా, పంజాబు నేషనలు బాంకు. వీటినే "ఐదుపెద్దబాంకులు" అని వ్యవహరించడంకద్దు. వీటిలో ఒక్కొక్కదానికి ౫కోట్ల రూపాయలకు మించి డిపాజిట్లు ఉన్నాయి. ఇవిగాక చిన్న షెడ్యూలు బాంకులెన్నో వున్నాయి. ఇంపీరియలుబాంకు, ౧౯ ఎక్చేంజి బాంకులు కాక, దేశవాళీ షెడ్యూలుబాంకుల సంఖ్య ౩౭. ఈ చిన్న షెడ్యూలు బాంకులకు పెద్ద బాంకులతో పోటీవల్ల ఒత్తిడి కలుగుతూ వుంటుంది. డిపాజిట్లకూ అప్పులకూకూడా వీటిరేట్లు పెద్దబాంకుల రేట్లకన్న అధికంగా ఉండకమానవు. ప్రజలకు బాంకుల యెడల నమ్మకం చెడినప్పుడు ఆ దెబ్బ ముందుగా వీటికి తగులుతుంది.

(౫) ఇవికాక మూలధనమూ రిజర్వులూ కలిసి ౫ లక్షల రూపాయలకు తక్కువగా వుండడంచేత షెడ్యూలు బ్యాంకుల లిస్టులోకి రాని చిన్న బాంకులున్నాయి. వీటిని పేరుకు బాంకులని వ్యవహరించినా, ఇవి అనేకగోత్రాలూ, ఇంటిపేర్లూ కలిసిన కలగూరగంపవంటివి. నిధులనీ, చీటీఫండులనీ, పరస్పరసహాయ శాశ్వతనిధులనీ ఇత్యాది పేర్లుగలవి. వీటిస్థితిగతులనుగురించి రిజర్వుబాంకువారు ఈమధ్య దర్యాప్తుచేసి కొన్ని సంగతులు ప్రకటించారు. ౧౯౩౭-వ సంవత్సరాంతానికి ఇట్టివి మనదేశంలో ౧౪౨౧ కలవు. అందులో ౫౦ వేల రూపాయలకు మించిన మూలధనమూ, రిజర్వులూ కల బాంకులు ౨౩౬ మాత్రమే. అంతకు తక్కువ వుండే బాంకులసంఖ్య ౧౧౮౫! అనగా మనదేశంలో నూటికి ౮౪ బాంకులు ౫౦ వేల రూపాయలకన్న తక్కువ మూలధనమూ, రిజర్వుఫండులతో పనిచేస్తున్నాయి!

రూ. ౫౦ వేలకు పైనా, రూ. ౫ లక్షలకు తక్కువ ౨౩౬ బాంకులలో:—

రూ. ౫౦ వేలకూ రూ. ౧ లక్షకూ మధ్యవున్నగానూ వున్న బాంకులు ౧౩౫

రూ. ౧ లక్షా రూ. ౨ లక్షలకూ మధ్యవున్నవి ౬౫

రూ. ౨ లక్షలకూ రూ. ౪ లక్షలకూ మధ్యవున్నవి ౨౭

రూ. ౪ లక్షలకూ రూ. ౫ లక్షలకూ మధ్యవున్నవి ౯

కాబట్టి ఇప్పటిపరిస్థితులనుబట్టి ఈ ౯ మాత్రమే త్వరలో షెడ్యూలుబాంకులు కాగలస్థితిలోవున్నాయి.

మిగతా ౧౧౮౫ చిన్న బాంకులలో:—

మూలధనమూ నిలవా కలిసి రూ. ౫ వేలకు లోపుగా వున్న మరీ చిన్న బాంకులు ౩౭౭

రూ. ౫ వేలకూ రూ. ౧౦ వేలకూ మధ్యవున్నవి ౨౩౬
రూ. ౧౦ వేలకూ రూ. ౨౦ వేలకూ మధ్యవున్నవి ౨౩౪

ఈ చిన్న బాంకులలో కొన్నిటి మూలధనం కొన్ని వందల రూపాయలకు మించదు. మూలధనం జమాలుచేయడంకోసం అవి యిచ్చేకమీషను వగైరా ఖర్చులు అధికం. వచ్చిన లాభాలు వాటాదార్లకే పంచిపెట్టడంవల్ల వాటిరిజర్వుఫండు బహుస్వల్పం. రిజర్వుఫండు ఉన్నట్లు స్టేటుమెంటులో అగపడ్డా అది ఏబాపతో, లాభంలోనుంచి వేరుచేయపడ్డదగునో, కాదో, తెలియదు. అయితే ౧౯౩౬-వ సంవత్సరపు కంపెనీఆక్టు ౨౭౭-ఐ సెక్షను ప్రకారం రూ.౫౦ వేలకు తక్కువగా మూలధనము వసూలైన చిన్న బాంకులు ఇకముందు పని ప్రారంభించగూడ దన్న నియమం వుండడంవల్ల ఇట్టిచిన్న బాంకులసంఖ్య ఇక హెచ్చడానికి అవకాశంలేదు. పైగా, చిన్న బాంకులన్నీ తమ నికరలాభంలోనుంచి నూటికి ౨౦ వంతులు రిజర్వుఫండుకు మార్చాలన్న నియమం ఆచట్టం ౨౭౭-కె-సెక్షనులో వుండడంవల్లకూడా ఇకముందు క్రమంగా పరిస్థితులు చక్కపడవచ్చును.

ఈ బాంకుల డిపాజిట్లు చాలావరకు దీర్ఘవాయిదాలమీద తిరిగి ఇయ్యవలసినవి. వీటిరొక్కం నిలవ బహుతక్కువ. అయితే దీర్ఘవాయిదా డిపాజిట్లను సాధారణంగా:—

| పేరుపడ్డ ఇంగ్లీషుబాంకులు, తమ డిపాజిట్లలో నూటికి:— | ఇండియాలో షెడ్యూలు బాంకులు, తమ డిపాజిట్లలో నూటికి:— | షెడ్యూలు లిస్టులోచేరవిచిన్న బాంకులు, తమడిపాజిట్లలో, నూటికి:— |
| --- | --- | --- |
| ౧౦ వంతులు రొక్కం, | ౧౩ వంతులు రొక్కం, | ౧౩ వంతులు రొక్కం, |
| ౫, లేక ౬ వంతులు అడిగిడంతోనే చేతికందే పెట్టుబళ్లు, | | |
| ౧౫ వంతులు గవర్నమెంటు ట్రెజరీ బిల్లులు, వర్తకంవగైరా బిల్లులలో పెట్టుబళ్లు, | ౬ వంతులు గవర్నమెంటు ట్రెజరీ బిల్లులు, వర్తకంబిల్లులువగైరాల లో పెట్టుబళ్లు, | |
| ౩౦ వంతులు గవర్నమెంటుపత్రాలు, కంపెనీవాటాలు, ఇతరబాంకుల డిపాజిట్లు, వీటిలో పెట్టుబళ్లు, | ౫౦ వంతులు గవర్నమెంటుపత్రాల మీద, ఇతరకంపెనీల వాటాలు వగైరాలమీద పెట్టుబళ్లు, | ౧౯ వంతులు గవర్నమెంటుపత్రాలు, వాటాలు వగైరాలలో పెట్టుబళ్లు, |
| (ఈ౬౦ వంతులు పైకం ఇంచుమించు త్వరలో చేతి కందుతుంది.) | (ఈ ౬౯ వంతులు పైకం ఇంచుమించు త్వరలో చేతికి అందుతుంది.) | (ఈ ౩౨ వంతులు పైకం ఇంచుమించు వెంటనే చేతికి అందుతుంది.) |
| ౪౦ వంతులు ఇతర అప్పులు ఈ విధంగా విభాగించుకుంటాయి. మొత్తం డిపాజిట్లలో మూలధనమూ నిలవా కలిపి నూటికి ౬ వంతు లుంటాయి. | ౩౧ వంతులు ఇతర అప్పులు ఈ విధంగా వినియోగిస్తున్నాయి. మొత్తం డిపాజిట్లలో మూలధనమూ నిలవాకలిసి నూటికి ౧౩ వంతు లుంటాయి. | ౬౮ వంతులు ఇతరఅప్పులు. ఈ విధంగా వినియోగించుకుంటాయి. మూలధనమూ నిలవఫండూ కలిసి మొత్తం డిపాజిట్లలో నూటికి ౨౧.౩ వంతు లుంటాయి. |

పూర్తిగా తిరిగి ఇవ్వవలసిన అవసరం ఉండదు కాబట్టి ఎప్పటికప్పుడు నిల్వరొక్కం విశేషంగా ఉండ నక్కరలేదని వీటి ఉద్దేశ్యమై యుంటుంది. ఈచిన్న బాంకుల పెట్టుబళ్లలో, అడిగిన వెంటనే పైకం చేతికందే పద్దులు బహుస్వల్పం. అటువంటి పెట్టుబళ్లలో గవర్న మెంటు పత్రాలమీద అప్పులు ముఖ్యంగా చెప్పతగ్గవి. ఈబాంకుల అప్పులు చాలావరకు ప్రైవేటు పార్టీలకు ప్రోనోట్లమీద ఇచ్చినవి. అందులో ఆ బాంకుల డైర క్టర్లకు ఇచ్చిన అప్పులుకూడా విశేషం ఉండడంకద్దు. ఈ అప్పులలో కొన్ని హామీ కలవి; మరికొన్ని హామీ లేనివి. ఈబాంకు లిచ్చిన అప్పులలో, చాలాకాలంనుంచి నిలవవుండీ వడ్డీయైనా వసూలుగాని బండపద్దులు చాలా వున్నాయి.

మొత్తంమీద బాంకులంటే ప్రజలకు నమ్మకం చెడిపోయినరోజులలో ఈచిన్న బాంకులకు ముందు ఒత్తిడి కలుగకమానదు.

దేశమంతటిలోనూ మద్రాసులోనే ఈచిన్న బాంకులు ఎక్కువ తృప్తికరంగాను పొదుపుగాను లాభప్రదంగాను పనిచేస్తూవున్నట్లు తెలుస్తుంది. బంగా ళా రాజధానిలో మిక్కిలి నష్టప్రదంగా పనిచేస్తున్నా యి. ఏళ్లకొద్ది ఆ నష్టాలు పూడటం లేదు.

(౬) ఈ సంస్థలన్నిటికంటె ముఖ్యంగా చెప్ప తగ్గవారు దేశవాళీ పెట్టుబడిదారులు, మార్వాడీలు, సాహుకార్లు, నాటుకోటచెట్టియార్లు వగైరాలు— ఇండియాలో జరిగే వర్తకవ్యాపారాలలో నూటికి ౯౦ వంతులు వీరిచేతులమీదనే నడుస్తున్నట్లు తెలు స్తుంది. వీరు బాంకువ్యాపారంతోబాటు ఇతరవ్యాపా రాలుకూడా చేయడంకద్దు. వీరిది చాలావరకు తమ స్వంతమూలధనం. వీరిలో కొందరివ్యాపారం విరివి షెడ్యూలుబాంకులనుకూడా మించివుంది. ఆ వ్యాపా రాన్నిగురించి సరియైన లెక్కలు బైటికి రావు. బైట పెట్టడానికి వారిష్టపడరు.

(౭) ఇవిగాక పరపతిబాంకులు, భూమితనఖా బాంకులు, పోస్టాఫీసు సేవింగు బాంకులు, ఇన్సూరెన్సు కంపెనీలు, చిన్నచీటీఫండుఆఫీసులు వగైరాసంస్థలు కలవు. పరపతిబాంకులలో గ్రామ ప్రైమరీ సంఘాలు, జిల్లా కేంద్ర సంస్థలు, ప్రెసిడెన్సీబాంకులు — ఈవిధంగా అంతస్థులు వున్నాయి. భూమితనఖా బాం కులు మనరాజధానిలోనే విరివిగా పనిచేస్తున్నాయి.

మన బాంకింగువిధానం ఈ విధంగా వుంది. మన దేశంలో బాంకింగుపద్ధతుల అభివృద్ధి ఇంకా మిక్కిలి బాల్యావస్థలోనే వున్నదని చెప్పక తప్పదు. బాంకులలో డబ్బు నిలవవుంచుకునే అలవాటు ఇచ్చట ఇంకా బాగా అభివృద్ధికాలేదు. అమెరి కాలో ప్రజలు బాంకులలో దాచుకున్న పైకం లెక్కిస్తే దామాషాయిని తల ౧కి రూ. ౧౨౩౪ చొప్పున వచ్చింది; గ్రేటుబ్రిటనులో దామాషాయిని తల ౧-కి ౨౩౯/- చొప్పున వచ్చింది; కాని ఇండియాలో తల ౧-కి రూ. ౧౦ మాత్రమే తేలింది! బాంకింగుపద్ధతులు అభివృద్ధి కావడం దేశాభివృద్ధికి మిక్కిలి అవసరం అని వేరే వ్రాయనక్కరలేదు. బాంకులు తమ డిపాజిట్ల పైకమంతా వడ్డీకి కక్కుర్తి పడి దీర్ఘ వాయిదా అప్పులలో ముడిపెట్టుకుని కూచో వడంలో అనేక ఇబ్బందు లున్నాయి. అనేక బాంకులు ఈవిధంగా ఎన్నో చిక్కులపా లవుతున్నాయి. తమ డిపాజిట్లలో నూటికి ౩౫ వంతులు పైకాన్ని గవర్న మెంటు పత్రాలు వగైరా ఒకటో రకం హామీలమీద అప్పులిచ్చి ఆవిధంగా పైకం అవసరానికి అందుబాటులో వుంచుకోవడం క్షేమం. అట్టి బాంకులమీద ప్రజలకు నమ్మకం కుదురుతుంది. అవసరం వచ్చినప్పుడు రిజర్వు బాంకువారు అట్టి బాంకులకు ఆ పత్రాల హామీమీద సులభంగా అప్పు లియ్యగలరు. అది ఎంతో లాభకర మైన విషయం. అంతే గాదు: చిన్న చిన్న బాంకులు క్రమంగా ఐక్యమై బలము నిలకడా కుదుర్చుకోవడం ఎంతో అవసరం. కట్టెలమోపు విడిపోయినప్పుడు ఒక్కొక్క కర్రను సులభంగా విరువవచ్చును; మోపుగా కట్టితే సులభంగా విరువలేరు, అన్న పూర్వపు కథ వీటికికూడా వర్తిస్తుంది. అదిగాక, ద్రవ్యాన్ని కూడబెట్టి బాంకులలో నిలవ వుంచుకునే అలవాటు ప్రజలలో అభివృద్ధి కావాలి. అందుకు తగిన ప్రో త్సాహం ఇయ్యడానికి బాంకు సంస్థలూ ప్రభుత్వమూ

కూడా అన్ని విధాలా సాయపడాలి. ఇట్టి సంస్థలపై ప్రజల కింకా నమ్మకం కుదరకనే వారిలో వారు స్వయంగానే అప్పు లిచ్చుకుని వసూలు చేసుకుంటున్నారు. తెడవ కొంతకాలం సంభవిస్తూ వున్న బాంకు దివాలాలవల్ల బాంకు లంటే ప్రజలకు నమ్మకం చెడిపోయింది. దేశంలో వున్న బాంకింగు విధానాన్ని సరియైన పద్ధతులమీద నడపవలసిన బాధ్యత ప్రభుత్వంమీద వుంది. బాంకుల అభివృద్ధినిసరించి ప్రభుత్వం ఎంతమట్టుకు కలియజేసికొని చట్టనిర్మాణంద్వారా ఎట్టి నియమాలను నిర్బంధాలను విధించవచ్చును? అన్నవిషయమై అభిప్రాయభేదాలున్నాయి. సాధారణంగా బ్రిటిషుఅభిప్రాయం, బాంకులకు సర్వస్వతంత్రం ఇచ్చి వాటినిసరియైన పద్ధతులమీద అభివృద్ధి చెందనీయాలి - అని. బ్రిటిషు బాంకులు ప్రపంచానికంతకూ ఆదర్శప్రాయంగా ఇన్నాళ్లూ అభివృద్ధికావడం వారి అదృష్టం. జర్మను, అమెరికను, వగైరా బాంకులు అట్లాగాదు. గవర్నమెంటువారు కలియజేసుకుని వాటిని సరియైన పద్ధతులమీద అభివృద్ధిచెయ్యాలి అని ఆయా దేశాలవారి అభిప్రాయం. ఇండియాలో, ౧౯౩౬ లో ప్యాసైన కంపెనీ సవరణ చట్టంలో, బాంకులనుకూడా కంపెనీలుగా పరిగణించి వాటి వ్యవహారాలనుసరించి కొన్ని నియమాలు ఏర్పాటుచేశారు. రిజర్వుబాంకు ఆక్టు ప్రకారంకూడా షెడ్యూలుబాంకులమీద కొన్ని నియమాలు విధింపబడ్డాయి. ఇయ్యేవీ నిరుడూ దక్షిణఇండియాలో సంభవించిన అనేక బాంకుల దివాలాలనుబట్టి చూస్తే ఇంకా కొన్నినిర్బంధాలు అవసరమనీ, ప్రత్యేకంగా ఒక ఇండియను బాంకుచట్టాన్ని ప్యాసుచేయడం ముఖ్యమనీ రిజర్వు బాంకువారు కడచిన డిసెంబరులో ఒక చిత్తుబిల్లును తయారుచేసి ఇండియా గవర్నమెంటుకు నివేదించారు. అది ఇప్పుడు ప్రజల ఆలోచనకోసం, సలహాలకోసం, విమర్శనలకోసం ప్రచురణలో వుంది.

(౧) బాంకులలో డబ్బును దాచుకునేవారికి సాధ్యమైనంతవరకు నష్టం కలగకుండా చేయడమే ఆసవరణల ముఖ్య ఉద్దేశ్యమని వారు చెపుతున్నారు. ఎక్కువ వడ్డీకి ఆశపడి తమ ద్రవ్యాన్ని సందేహాస్పదమైన బాంకులలో ఉంచుకునేవారిని కాపాడడం ఎప్పుడూ దుస్సాధ్యమైన పనే; కాని బాంకు అనే సంస్థకు ఆవ్యాపారంవల్ల కొంతవరకైనా లాభం సంపాదించగల శాఖా, అర్థబలమూ, మూలధనమూ, వుండాలి. అవి లేని బాంకులకు బాంకింగు వ్యాపారం చేయడానికి అర్హత లేదు.

(౨) పైగా వాటి పెట్టుబడులు గడ్డ కట్టుకుపోయే బండపద్దులుగా వుండరాదు. బాంకులు దివాలా తీసినప్పుడు వాటి పెట్టుబళ్లు కొంతవరకైనా అదనుకు చేతి కందేటట్లుగా వుండాలి. అందుకోసం బాంకులు ఇచ్చే అప్పులకు కొన్ని నియమాలను ఏర్పాటుచేయడం అవసరం.

(౩) బాంకులు దివాలా తీసినప్పుడు పోగా మిగిలిన మొత్తం సాధ్యమైనంత త్వరలో, తక్కువ వ్యయప్రయాసలకు డిపాజిటర్లకు అందాలి. అందుకు తగిన ఏర్పాట్లు చేయడం అవసరం.

ఈ ఉద్దేశాలతో రిజర్వుబాంకువారు చేసిన సూచన లేమిటంటే:—

(౧) 'బాంకు', 'బాంకరు', 'బాంకింగు వ్యాపారం,' అన్నపదాలకు స్పష్టంగా అర్థం చెప్పాలి అనీ, బాంకుల కర్తవ్యాలను స్పష్టంగా నిర్వచించాలి అనీ వారు సూచించారు. ఆ అర్థం స్పష్టంగా లేకపోవడంవల్ల అనేక బాంకులు చట్టవిరుద్ధమైన వ్యాపారాలు చేయడానికి అవకాశం కలుగుతోంది; అందువల్ల బాంకులదివాలాలు సామాన్యమై ప్రజలకు నష్టం కలుగుతోంది, అని వారివాదము. బాంకింగువ్యాపారం చేసేసంస్థలు తమవిలాసంలో బాంకర్లు అని స్పష్టంగా నిర్దేశించాలి; బాంకింగువ్యాపారంచేసేసంస్థలు ఇతర విధములైన వ్యాపారాలు చేయగూడదు.

(౨) ఇండియనుకంపెనీలచట్టం ౨౭౭-ఎఫ్-సెక్షను ప్రకారం, ౧౯౩౭ జనేవరి ౧౫-వ తేదీ తర్వాత రిజిస్టరీ అయిన బాంకుల మూలధనం కనీసం ౫౦ వేల రూపాయ లుండాలని నిర్ణయించారుగాని అంతకు పూర్వమేవున్న బాంకులు అంతకన్న స్వల్పంగా మూలధనంవున్నప్పటికీ పనిచేయవచ్చును. అది గొప్పలోపము. అసలు ౫౦ వేల రూపాయల పరిమితికూడా చాలదు.

షెడ్యూల్లు లీస్టులో చేరని చిన్న బాంకుల మూలధనం ఇంకా చాలా తక్కువగా వున్నట్లు ఇదివరకే చెప్పివున్నాము. ఈ చిన్న బాంకులు ఎక్కువ వడ్డీలిచ్చి డిపాజిట్లను ఆకర్షించాలన్న ఉద్దేశ్యంతో పెద్దపట్నాలలో బ్రాంచి ఆఫీసులు పెడుతున్నాయి. చిన్న స్థలాలలోను పెద్ద స్థలాలలోను పనిచేసే బాంకుల కనీసం మూలధనం వేర్వేరుగా వుండడం అవసరం. చిన్నచిన్న బాంకులు మిక్కిలి దూరప్రదేశాలలో బ్రాంచిఆఫీసులను స్థాపించరాదు. బాంకింగు కంపెనీలు పని ప్రారంభించడానికిపూర్వం కనీసం ఒకలక్షరూపాయలైనా మూలధనం వసూలైయుండాలి. బొంబాయి కలకత్తాలలో ఏర్పాటుచేయబడ్డ ఆఫీసులలో ఒక్కొక్క ఆఫీసుకు కనీసం 3 లక్షల రూపాయలు మూలధనం వసూలు కావాలి. ఒకలక్ష జనసంఖ్య వున్న పట్నంలోని ప్రతిఆఫీసుకీ ప్రత్యేకంగా రెండులక్షలరూపాయలు మూలధనం వసూలైయుండాలి. ఇరవైలక్షల రూపాయలు మూలధనమూ రిజర్వులూ లేనిబాంకులు ఇతర రాష్ట్రాలలోగాని సంస్థానాలలోగాని ఆఫీసు లుంచగూడదు.

(౩) అనేకబాంకులకు మూలధనంకింద పెద్ద మొత్తం కాగితంమీద నిర్ణయింపబడ్డప్పటికీ క్రియలో బహుస్వల్పమొత్తంతో పని ప్రారంభించడం ఆచారమై యుంది. బాంకుల మూలధనంలో సగమైనా వసూలుకాకుండా అవి పని ప్రారంభింపరాదు.

(౪) బాంకులు తమడిపాజిట్లను సంపూర్తిగా అప్పులక్రింద లోకులకు పంచిపెట్టడం చాలా అపాయకరమైనపద్ధతి. ఆ అప్పులు అదనుకు వసూలుకాక బాంకులకు ప్రాణోపద్రవం కలుగుతుంది. అందులో కొంతభాగమైనా వెంటనే వసూలుఅయ్యేటట్లు రొక్కరూపంగానూ, గవర్నమెంటు పత్రాలవగైరాల హామీమీదా వుంచడం అవసరం. బాంకుల మొత్తండిపాజిట్లలో నూటికి కనీసం ౩౦ వంతులైనా ఆవిధంగా అందుబాటులో వుండేటట్లు చట్టంలో ఏర్పాటు చెయ్యాలి. బాంకులు అప్పులిచ్చే గవర్నమెంటుపత్రాలలో సగపాలు ౧౦ ఏళ్లలో తీరిపోయేవిగా వుండాలి. ఏమంటే స్వల్పవాయిదా పత్రాలధరలు విశేషంగా తగ్గడం హెచ్చడం ఉండదు.

ఈ కనీసం ౩౦ వంతులుకూడా గవర్నమెంటు పత్రాలలోవుంచి వాటిమీద తిరిగి అప్పులుతీసుకునే అభ్యాసం వుండగూడదు. మిక్కిలిఅవసరమైన ఒడుదుడుకులు వచ్చి తమడబ్బు కావాలని డిపాజిటర్లు ఎగబడితే అప్పుడు ఆ ౩౦వంతులు గవర్నమెంటుపత్రాల మీదతిరిగి అప్పు తీయవచ్చునని ఇండియాగవర్నమెంటు వారు ప్రత్యేకంగా అనుమతి నీయవచ్చును.

ఈ ౩౦ వంతులు నియమం ఇతరచోట్ల అమలులో వుంది. బ్రిటిషు బాంకులుకూడా తమ డిపాజిట్లలో నూటికి ౩౦ వంతులు రొక్కంగానూ, గవర్నమెంటు వగైరా ఒకటోరకం పత్రాలలోను ఉంచుకుంటున్నాయి. ఇండియను షెడ్యూల్లుబాంకులుకూడా చాలవరకు అల్లాగే చేస్తున్నాయి.

(౫) బ్రిటిషు ఇండియాలో పనిచేస్తూవున్న బాంకులడిపాజిట్లలో విస్తారం పైకం, అనగా నూటికి ౭౫ వంతులు, బ్రిటిషు ఇండియాలో వుంచడం అవసరం.

(౬) బాంకుల దివాలాలలో ఇప్పటి లిక్విడేషను చర్యలలో అనేకలోపా లున్నాయి. బాంకుల వ్యాపారాలు చాలావరకు ఆలస్యంలేకుండా వెంటవెంటనే జరగవలసినవి. లిక్విడేషనుచర్య ఆలస్యం అయినయెడల అనేకమందికి అనేకనష్టాలు కలగవచ్చును. కాబట్టి బాంకులు ఏరోజు కారోజు తమ లావాదేవీలను నడపజాలనిస్థితిలో వున్నయెడల కోర్టులు వాటిని మూసివేయుటకు వెంటనే ఆర్డరు చేయవచ్చును. అట్టిసందర్భాలలో బాకీదార్ల మీటింగులు, తీర్మానాలు వగైరా చర్య అనవసరం. మూసివేయవలసిందని ఆర్డరైన రెండు నెలలలోగా లిక్విడేటరు ఆబాంకుయొక్క స్థితిగతులను గురించి రిపోర్టు పంపవలెను. ఆ రిపోర్టును బట్టి బాంకు ఆస్తిలోనుంచి డిపోజిటర్లకు కొంత మొత్తం వెంటనే ఇచ్చేటట్లు కోర్టు కాంక్షను చేయవచ్చును. లిక్విడేషను చర్యలకు మామూలుగా అయ్యే ఖర్చులూ ఆలస్యమూ తగ్గించడంకోసం, లిక్విడేటర్లుగా రిజర్వుబాంకువారినే నియమించడం ఉత్తమం. అందుకు వారు అన్నివిధాలా తగివున్నారు.

రిజర్వుబాంకు చేసిన సూచనలలో ఇవి ప్రధానమైనవి. ఈ వివరణ లన్నీకూడా ఈమధ్య దక్షిణ ఇండియాలో జరిగిన బాంకుల దివాలాలను గురించి ఉద్దేశింపబడ్డవి. ఆ పరిస్థితులను బట్టి నిర్ణయింపబడ్డవి. ఒకటి రెండు అంశాలను పురస్కరించుకొని సామాన్య చట్టాలూ, సూత్రాలూ ఏర్పాటుచేయబూనడం సాహసకార్యమని తార్కికు లంగీకరించిన విషయమేగాని ఈమధ్య, అనగా ౧౯౩౪ - ౧౯౩౯ లలో జరిగిన బాంకుల దివాలాలు సామాన్యమైనవి కావు. ప్రజలకు అందువలన కలిగినహానిని గ్రహించడానికి కడచిన రెండేళ్లలో దక్షిణ ఇండియాలో దివాలా తీసిన కొన్ని బాంకుల పేర్లు ఇక్కడ ఉదాహరిస్తున్నాను.

తిరువాంకూరు అస్సోసియేషను బాంకు, తిరువాంకూరు, సామ్రాజ్యలక్ష్మి బాంకు, కొచ్చి, క్రిస్టియను యూనియను ధనవ్యాపారం బాంకు, కొచ్చి, నంబుదిరి బాంకు, కొచ్చి, మెహామ్మ బాంకు, తిరువాంకూరు, రినాసాన్సు ప్రోవిడెంటు ఇన్సూరెన్సు అండు బాంకింగు కంపెనీ, మద్రాసు, బాలభారతి బాంకు, మద్రాసు, శ్రీనారాయణవిజయం బాంకు, కొచ్చి, ఆర్కాటు బాంకు, మద్రాసు, కారమడై రంగరాజనిధి, కారమడై, నీలగిరి యూనియను బాంకు, తిరువాంకూరు బాంకు, సెంటు మేరీ ఇండస్ట్రియలు బాంకు, తిరువాంకూరు, లక్ష్మీవిలాస బాంకు, కొచ్చి, డెక్కను బాంకు, మద్రాసు, ఇండియా అండు ఫారిను మర్కెంటైలు బాంకు, మద్రాసు, కొల్లేగలు శ్రీవేంకటేశ్వరనిధి, కొల్లేగలు, సిలోను ఇన్సూరెన్సు బాంకు, కేసరిబాంకు, కౌను బాంకు, కొచ్చి, మద్రాసు ఎస్టేట్సు అండు బాంకింగు కార్పొరేషను, క్విలాను బాంకు, తిరువాంకూరు, ఎలుతంత్రబాంకు, కొచ్చి, మర్కెంటైలు బాంకు, మద్రాసు, నెల్లూరుబాంకింగు అండు ట్రేడింగు కంపెనీ, కేరళోదయంబాంకు, కొచ్చి, కరింగమన్నె బాంకు, మలబారు, యూనివిలేజిబాంకు, కొచ్చి, ఆనందవిలాసంబాంకు, కొచ్చి, అస్సోసియేటెడు బాంకర్సు, మలబారు నేషనలుబాంకు, బాంకు ఆఫ్ రాజమండ్రి, కోయంబత్తూరు సెంట్రలుబాంకు, ఒరయూరుబాంకు, డెక్కను కమెర్షియలుబాంకు, మద్రాసు, ట్రావంకూరు నేషనలు అండు క్విలానుబాంకు, సిటీబాంకు, కేరళవిలాసంబాంకు. కాలికట్టుబాంకు, మద్రాసు పీపిల్సు బాంకు, వాయరు మాడరను బాంకు, బెంగుళూరు బాంకు, బి బి. సి. ఐ. బాంకి, విశాఖపట్నం, స్టాండర్డుబాంకు, ఇండో-కర్నాటిక్ బాంకు, గోపన్న బాంకు వగైరా, వగైరా.

రిజర్వుబాంకువారు సూచించిన వివరణలను గురించి ముందు నెల చర్చిస్తాను.



# శ్రీసూర్యరాయాంధ్ర నిఘంటువు

శ్రీ వడ్లమూడి వెంకటరత్నము

(గతసంచిక తరువాయి)

నా విమర్శనమును పరామర్శించుచు శ్రీ పిసుపాటి విశ్వేశ్వరశాస్త్రిగారు నేను నిఘంటువులో లేవన్న శబ్దములను మూడు తరగతులుగా విభజించి యున్నారు. 1 అపశబ్దములు, 2 అనావశ్యకములు, 3 గృహీతములు- అని. అందు 'అనావశ్యకము' లను గూర్చి "ఇవి కవులు సమానార్థక పదములను గలిపి సృష్టించుకొనునవి. ఇట్టి వీని నెన్నింటి నిచ్చినను నిఘంటువునకు సమగ్రత యుండదు." అని శాస్త్రిగారన్నారు.

శబ్దముల నెన్నిటి నిచ్చి యర్థము మాత్రము వ్రాసినను ఎట్లు సమగ్రతయుండదో, శబ్దచరిత్రమును అర్థపరిణామాదులను వ్రాసినను కవిప్రయుక్త శబ్దములను విడిచిపెట్టినచో నట్లే నిఘంటువు సమగ్రము కాజాలదనియే నా తలంపు.

నిఘంటువున 'అనావశ్యకములు' అని విడిచిపెట్టిన పదములు ఎవరి కనావశ్యకము లగును? అవి ప్రతివానికి ననావశ్యకములే యగునా? అవి యెవరికి నావశ్యకములు కావా? ఎవ్వరికి నావశ్యకములు గాని పదములనేనా తిక్కనాదికవులు సృష్టించి తమ కావ్యరత్నములయందు వాడినది? నిఘంటువు చదువ నేర్చినవారి కెల్లరకు నుపయోగ పడవలయునది. అట్టిచో నా పదముల యర్థ మెఱుంగవలసిన విద్యార్థులుగాని, సామాన్య విద్యావంతులుగాని ఆంధ్రదేశమున లేరా? ఇక నుండరా? లేక యిట్టివారివిషయము నిఘంటువున కక్కరలేదా? విద్యార్థులను, సామాన్యవిద్యావంతులను లెక్కగొనక, వారి విషయమాలోచింపక నిఘంటువు రచియించినచో నది సమగ్రనిఘంటువు కాగలదా? అప్పుడు 'సమగ్రత' అనుమాట కర్థమేమి? నిఘంటువున వదలివైచినపదముల కర్థము తెలిసినవారికే నిఘంటు వుపయోగకరముగా నుండదగు ననుట సమంజసమా? కావ్యములు చదువనేర్చిన యెల్లవారి నుద్దేశించునవిగావు. అవి రసికులనుమాత్ర ముద్దేశించునవి. 'తనకావ్యములు తన కాలమువారికి గావు' అన్న ప్రౌఢకవులును గలరు. నిఘంటునిర్మాతలు నట్టులే తమ నిఘంటువు విద్యార్థులు మున్నగువారికి గాదనియో లేక తమకాలమువారికి గాదనియో తలంచుట న్యాయ్యమా? అట్టినిఘంటువునేనా యాంధ్ర మహాజను లిప్పు డభిలషించుచున్నది?

కొంత శబ్దార్థజ్ఞానము గలవారికే నిఘంటు వుద్దేశింపబడ్డది యన్నచో నానిఘంటువున 'అపుడు, అయ్యో, అంతదాక, ఆఱుగురు, ఆహా, ఇక్కడ, ఎక్కడ, ఒకతె, ఉప్పు' మొదలగు పదములు వ్రాయవలసినయవసర ముండునా? మఱి యానిఘంటువున నట్టిపదముల నేల చేర్పవలయునో? మఱియు నిఘంటువు నుపయోగించుకొనువారికి తాము విడిచిన పదముల కర్థము మున్నగునవి తెలియక యుండునా? అని తలచుటయు సమంజసము గాదు.

అంగజుడు, మొదలగుపదములు గ్రహియింపబడి యున్నవి గాన అంగజన్ముడు అనుపదమును గ్రహింప నక్కరలేదనియు, 'అమరగురువు' అనుపదముగలదు గాన 'అనిమిషగురువు' అనుపద మక్కరలేదనియు శాస్త్రిగారనుచున్నారు.

ఈ విడిచిపెట్టినపదముల కర్థము నూహించుకొనునపుడు ఒకొక్కప్పుడు యోగార్థమే స్ఫురించినను ఒకొక్కతావున విపరీతార్థము తోచినను తోచవచ్చును. అట్టి విపరీతార్థముల కవకాశ ముండదనుటకు

వీలులేదు. కనుక మనభాషలో, మనదేశములో గ్రంథములలోగానీ, వ్యవహారములోగానీ యున్న యన్ని పదములును సమగ్రనిఘంటువున నుండుట యవసరము.

అన్ని శబ్దము లున్నందువలన గ్రంథవిస్తరమయినను విశేషనష్టములేదు. కాని యేతరగతిపాఠకు లయినను నిఘంటువున దాము కోరిన పదములు లేక ఉన్న వానినిబట్టి తము కోరినశబ్దముల కర్థము లూహించుకొనుటలో ప్రమాదపడు నెడల నందువలన గలుగు నష్టము విపరీతము, కూడ కట్టరానిది.

మఱియు శబ్దరూపములలో సందేహములు గలిగినపుడు నిఘంటువును జూచి తమసంశయమును దీర్చుకొనువారు పెక్కురున్నారు. కొందఱు గ్రంథకర్తలు, పండితులుకూడ శబ్దరూపమున సందేహము గలిగినపుడు నిఘంటువు నాధార మొనర్చుకొనుట నే నెఱుగుదును.

"నిఘంటువు పాఠకులకు మాత్రమేగాక గ్రంథరచనము చేయువారికిగూడ నుపయోగించునట్టిదిగా నుండవలయును. గ్రంథరచనము చేయువారు సంశయము గలిగినపు డెల్ల నిఘంటువుల జూచుచుండుట యనుభవసిద్ధము." (పీఠిక 16పుట) అని పీఠికాకారులు గూడ చెప్పియున్నారుగదా!

తెన్నగ సంస్కృతాంధ్రముల నభ్యసించినవారికిని సంశయములు గలుగుచుండును. మఱి యిప్పుడు సంస్కృతాంధ్రములను సరిగా నభ్యసింపక ఆంగ్లాది భాషా పరిచయమున గలిగిన భావోద్రేకమువలన నాంధ్రమున ఖండకావ్యములు రచియించుచున్న యువకవులు, భావకవులు మనదేశమున పెక్కురు గలరు. వారిలో కొందఱకు మనభాషయందు శుష్కపాండిత్యముమాత్రమే యుండవచ్చును. అట్టివారికి తోడుపడుటకు పండితులకంటె, వ్యాకరణములకంటె నిఘంటువు లెక్కువ యుపయుక్తము లనుట నిర్వివాదము. కవిప్రయుక్తములగు కొన్నిమాటలను విడిచివైచి వానియర్థ మూహించుకొనవచ్చు ననుకొన్నచో నట్టిశబ్దములను తాము ప్రయోగింప దలచుకొన్నపుడు శబ్దరూపములను దెలిసికొనుట యెట్లు? అట్టివారికి నిఘంటువులు సహాయము చేయరాదా? లేక అట్టివారు గ్రంథరచనమున కర్హులు కారా?

మఱియు 'అనిమిషగురువు'న కర్థము తెలియనివారికి 'అమరగురువు' దానికి పర్యాయపదమే యని యెట్లు తెలియును? 'అమరగురువు' చూచిన ఆ పదమున కర్థము తెలియునని వారు తెలిసికొనుట కాధారమేమి? 'దేవగురువు'నో, 'ఆదిత్యగురువు'నో ఏల చూడరాదు?

"అంగజుఁడు, అంగభువు, అంగభవుడు మొదలగునవి గ్రహింపబడియుండగా అంగజన్ముడు గ్రహింపబడకున్న నేమి దోషము?" అని పరామర్శకులనుచున్నారు. అటు లయినచో 'అంగజుడు' గ్రహించిన చాలదా? అంగభువు, అంగభవుడు మొదలగునవి గ్రహింపబడకున్న నేమి దోషము? తక్కినవాని నేల గ్రహియింపవలయును? ప్రసిద్ధనిఘంటువులో నున్నవందురా? ఉన్న నేమాయె? వాని నేల మానరాదు? వానిని మానినందువలన గ్రంథవిస్తృతి మఱియు తగ్గును గదా!

"ఇట్టిపదముల నెన్నిటి నిచ్చినను సమగ్రత యుండదు" అని శాస్త్రిగా రనుటలోని భావము అట్టి పదముల నెన్నిటి నీయకున్నను తమ నిఘంటువు సమగ్రమైనదే యని కాదుగదా! అటులే యయినచో నిట్టిపదముల నెన్నిటి నీయకున్నను నిదివఱకున్న నిఘంటువు లన్నియు (ఈ పదముల విషయమున) సమగ్రములేగదా!

గ్రంథప్రయుక్తమగు అంగజన్ముడు అన్న పదమున కర్థము తెలియనివానికి నిఘంటు వేమి చెప్పును? అంగజుడు, అంగభవుడు మొదలగు తా మిచ్చిన పదములలో నేదో యొకదానిని సూచించి దానిని చూచుకొనవలయుననియైన తెలుపరాదా?

• అంగజన్ముడు అనుదానికి స్త్రీలింగరూపము అంగజన్మ అనియా? అంగజన్మి అనియా? లేక మఱియే మేనియా? అని సందేహము గలిగినపుడు నిఘంటు వేమి తెలుపును? మూకీభావమేనా?

"ఇట్టివాని నన్నిటిని గ్రహింపవలయునన్న అంగజాతుడు, అంగజాతి, అంగజననుడు, అంగసంభవుడు, అంగసముద్భవుడు, అంగసంజాతుడు మొదలగు వనేక

శబ్దములను గ్రహింపవలసివచ్చును. మఱియు అంగశబ్ద పర్యాయము లన్నింటియొద్దగూడ నిట్టివి చూపుట కారంభించినయెడల ననవసరముగా నింకను గ్రంథము పెరుగును" అని పరామర్శకు లనుచున్నారు.

ఆంధ్రమహాభారతములోని యీపదము లేదేమి? యనగా మనము సృష్టించినచో చాలపదము లగునని యీ సమాధానము? భారతాదులలో నున్న పదములను వ్రాసినచో మనము సృష్టింపగల పదములన్నియు వ్రాయవలసినదేనా? లేక మనము పుట్టింపగల శబ్దములన్నియు వ్రాయగలిగిననే భారతాదిగ్రంథములలో నున్న పదములన్నియు వ్రాయవలయునా? ఏమి సామంజస్యము! అనవసరముగా గ్రంథము పెంచరాదు అనుట సముచితమే యగునుగాని అవసర మయినంతగా కూడ గ్రంథము పెరుగనీయకుండుటకు గారణము గావరాదు.

"ఇట్టివానిని మేము చూపినట్లే ప్రధానశబ్దములలో జూపిన జాలదలకు గ్రంథవిస్తరము తగ్గుటయే కాక యట్టివాని ననేకములను గల్పించుకొను తెలివి కూడ గల్గును. లేనిచో గ్రహించినవే తక్క తదితరములు తెలియవు." అని యొకచోట శాస్త్రిగారన్నారు. మంచిదే. మఱి ఆ తెలివి అక్షిశబ్ద మొక్కదానిదగ్గఱ చూపిననే కలుగునా యేమి? ఇతరశబ్దములదగ్గఱ జూపినచో ఆతెలివి కలుగదా? అటులయినచో అంగ మొదలగు శబ్దములమీద జాత, జన్మ మొదలగుశబ్దములు చేరినపుడు ఆయా యర్థము లిచ్చునని యేల చెప్పలేదు? ఇట్టిచోట్ల చెప్పినచో ఉన్న తెలివిపోదుగదా!

"'అనిమిషుడు అనుమాటకు దేవత' అని యర్థము వ్రాసి 'అనిమిషసురువు'నకు 'అమరసురువు' చాలదా అనుటలో సామంజస్య మేమి? పోనీ అనిమిషశబ్దమున కర్థము అమరశబ్దమునైన నిచ్చినారా? అదియు లేదు. పోనిండు; 'దేవతాసురువు'నైన వ్రాసి దానిని చూడుమన్నారా? అంతకంటె లేదు.

అనిమిషసురువు, అంగజన్ముడు మొదలగు పదము లనవసరమయిన నిఘంటువునకు అతడు, ఇతడు, ఆతగాడు, ఈతగాడు మొదలగు శబ్దములును, ఒకత, ఒకతి, ఒకతుక, ఒకరిత, ఒకరితి, ఒకరితె మొదలగు పెక్కురూపములును ఆవశ్యకము లగుట వింతకాదా?

అగ్ర్యము :—

ఈ పదము లే దన్నందులకు శాస్త్రిగారిచ్చిన సమాధానము :—

"(అ) అగ్ర్యుడు అను పదమును గ్రహించియున్నాము.

(ఆ) ఇట్టి విశేషణశబ్దములలో నమహన్మహన్మహతీరూపములు మూడును గ్రహింపక యేదేనొకటియే గ్రహించుట నిఘంటుసంప్రదాయము" అని.

దీనికి నా ప్రత్యుత్తరము:—

భారతములో ప్రయుక్తమగు అగ్ర్యము అను నపుంసకలింగశబ్దము గ్రహింపబడలేదేమనగా అగ్ర్యుడు అను పుంలింగశబ్దము గ్రహింపబడిన దనుట మిరియాలున్నవా? యని యడిగినపుడు మిరపకాయ లున్నవి అని చెప్పుప్రత్యుత్తరము వంటిది.

(ఆ) సూ - ఆం - నిఘంటువులో అగ్ర్యుడు అన్నపదము దగ్గఱ సం. అగ్రియుడు అని వ్రాసియున్నారు. కొన్నిపదములయొద్ద విశేష్యమో విశేషణమో తెలిపి, అంతములచే లింగములు సూచించి అర్థము వ్రాసియున్నారు. అగ్ర్యుడు మొదలగు కొన్ని మాటలయొద్ద విశేషణ విశేష్యభేదముగాని, అంతములు, లింగములు గాని వ్రాసియుండలేదు. ఆమాటల నేమని తలంపవలయును? విశేషణములనియా? విశేష్యము లనియా? మూడు లింగములలో నుండవచ్చుననియా? ఏకలింగకమే యనియా? కొన్నిటికి లింగములు తెలుపనపుడు అది నియతలింగకమే యని తలంచుట కవకాశముగలదుగదా! అగ్ర్యుడు అను పుంలింగశబ్దమునకు అంతములతో, లింగములు తెలుపకపోయిన అగ్ర్యము అను నపుంసక లింగశబ్దమును గ్రహియించినట్లే యగునా యేమి?

ఇట్లు ప్రమాదముల కవకాశము గలుగునట్లు వ్రాయుటయే నిఘంటుసంప్రదాయమా యేమి? కొన్నిమాటల కంతములు చూపవలయు ననియు, మఱికొన్నిటికి చూపరా దనియునా నిఘంటు సంప్రదాయముశ

అన్ని మాటలకు అంతములలో లింగములు సూచించినచో సంప్రదాయభంగ మొనర్చియుండెడివారా? యేమి? చేసిన ప్రమాదములనుండి తప్పించుకొన జూచుటకు ఈ సంప్రదాయమొక తడకగాదా? లేక అగ్రస్థుడు అను మాటనుబట్టి అగ్ర్యను అనుమాట నూహించుకొనలేరా యందురా? ఇచ్చిన యన్ని పదముల నూహించుకొనలేరనియేనా యిచ్చినది? ఒక వ్యవస్థ లేదా?

అంపపెట్టు:—

ఇది లేనందులకు "అమ్ములో వ్రాసిన విశేషము వలననే సిద్ధి సులభగ్రాహ్యము" అన్నారు శాస్త్రిగారు. నిఘంటువులో నిచ్చిన యర్థమునుబట్టి 'బాణముయొక్క దెబ్బ' అని యర్థము చెప్పుకొనవచ్చును. సరియే కాని భారతమున నీశబ్దము 'బాణము పోవునంతదూరము' అను నర్థమున ప్రయోగింపబడియున్నది. చూడుడు —

"అబ్బలంబు లిరుగెలంకులం దొలంగి యంప
పెట్టున కవ్వలం జని చూచుచుండె"

—భార. ద్రోణ. ౪–౨౨౭.

ఇచట 'అంపపెట్టునకు' అనగా 'అమ్ము పోవునంత దూరమునకు' అనియేగదా యర్థము? ఈ యర్థము నిఘంటువులో వ్రాసిన విశేషమువలన ప్రకటమగునా? లేక అట్టివానికి లక్షణార్థము చెప్పుకొనవలయు నందురా? లక్షణార్థము చెప్పుకొన నక్కర యుండ దనియా యేమి, 'అమ్ముమేటునేల' అనుపదమును గ్రహించినారు? 'అమ్ముమేటునేల'ను గ్రహించినారుగాని ఆ యర్థము నిచ్చు 'అంపపెట్టు' అను మనోహరప్రయోగమును సంగ్రహింపలేదు. ఇచట "అంపపెట్టునేల కవ్వలం జని" అను పాఠాంతరము గూడ నున్నది. పాఠాంతర మున్నది గనుక నీపదము గ్రహియింపబడలే దందురా? మఱి యీ పాఠముతో పఠించు వారికి నిఘంటువు కైదండ యీయదా? లేక తాటి యాకుప్రతులలో నీపాఠము లేదా?

అంతఃపరివారము:—

(సూ-శం-ని-లో) "అంతర్ అనుపదమును జూచిన నిట్టిది ప్రత్యేకముగ గ్రహింప నక్కర లేదని తోచును" అని పరామర్శకు లన్నారు.

నిఘంటువులో "అంతర్, సం, అవ్య, ౧ మధ్యమున, లోపల ౨ క్రింద" అని యున్నది. దానినిబట్టి లోపలిపరివారము అనియో, క్రిందిపరివారము అనియో అర్థము చెప్పుకొనవలయును. కాని భారతమున నీశబ్దమే యర్థమున ప్రయోగింపబడియున్నదో కొంచెము చూడుడు. భీష్మాచార్యులు అంపశయ్యమీద నుండగా నాయనయొద్దకి ధర్మము లాలకించుటకై యేగుచు ధర్మరాజు అర్జునునితో మకుపుసందర్భమున,

"న సైనికశ్చ యాతవ్యం, యాస్యామో వయమేవ హి,
నచ పీడయితవ్యో మే భీష్మో ధర్మభృతాం వరః.
అతః పురస్సరాశ్చాపి నివర్తంతు ధనంజయ!
అద్య ప్రభృతి గాంగేయః పరం గుహ్యం ప్రవక్ష్యతి."

—శాంతి. ౫౩ అధ్యా. ౧౫-౧౬.

దీనిని తిక్కయజ్వ యెట్లు చెప్పెనో గమనింపుడు.

"నేను మొదలుగా నయ్యెడకు సైనికుల రానీకుము. అంతఃపరివారంబు వచ్చు టుడుపుము. శాంతనవుండు సందడిం బడ నర్హుండు గాడు. విశేషించి పరమగుహ్యంబు లగు వాక్యంబులు మనకును గ్రహింపగలవాడు."

—శాంతి. ౨ ఆ. ౧౨౯.

ఇచట మూలములోని 'పురస్సరులు' అను మాటకేగదా తెనుగుభారతమున 'అంతఃపరివారము' అని ప్రయోగింపబడినది. నిఘంట్వర్థమును బట్టి లోపలి పరివార మనగా అంతఃపురమునందలి పరివార మనియే గదా యర్థము! అనగా కంచుకిసమూహ మనియా? లేక అంతఃపురమునందలి పరిచారికాజన మనియా? కాదు. ప్రభువులు వెళ్లునపుడు ముందు నడచుచు (రక్షకులుగా) నుండు జన మని యర్థము చెప్పుటయే రసవంతము గాదా! అట్లు గాక యుధిష్ఠిరాదులు తాము మఱియొక తావున కేగునపుడు అంతఃపురమునందలి పరివారమునే తీసికొనిపోవలసిన అవసర మేమి? కనుక నీ పదసార్థము నిఘంటువులోని పదములవలన ప్రకటమగునా? అట్టిచో నిఘంట్వర్థము చాల నకట యుపచారభూ ?...

అంబుజాక్షుడు —

'అక్షి'దగ్గర చూచుకొనవలయు నని శాస్త్రి గారు చెప్పియున్నారు. అక్షిదగ్గఱ చూడవలయు ననుటకు సూచనయేమో! సరియే, యిపుడు శాస్త్రిగా రనుచున్నారు గనుక చూతము. చూచినచో "అక్షి. సం. వి. ఇ. న. కన్ను.' 'అవ్యయీభావములోను, బహువ్రీహిలోను ఉత్తరపదమైనపుడు అకారాంత మగును." అని యున్నది. అయిన నేమగును? చూడుడు

"అలరి యెఱుఁగక ధార్తరాష్ట్రులు కడంగి
మమ్ముఁ బఱచినపాటులు మానసమున
చవులఁ బెట్టిన విత్తుల చంద మొంది
అంకురింపక చెడిపోదు నంబుజాక్ష."
—ఉద్యోగ. ౩-౭౬.

ఇది రాయబారసందర్భమున శ్రీ కృష్ణునితో నర్జునుడు పల్కిన మాటలు. ఇచట అంబుజాక్షుడు శ్రీ కృష్ణమూర్తియే గదా! అంబుజాక్షి అను పదము స్త్రీల కెల్ల రకను వాడుచున్నటుల అంబుజాక్షుడు అనుపదము పురుషుల కెల్ల రకను వాడుదుమా? అది విష్ణువునకే రూఢము. పితామహ శంకరాది యితర దేవతలకును అంబుజాక్షుడు అనుపదము రూఢము గాదు. కనుకనే ఆంధ్రనామసంగ్రహము విష్ణువు నామములలో 'తమ్మికంటి' అనుపదము నిచ్చియున్నది. అమరము నయితేను 'పుండరీకాక్షుడు' అనుపదమును విష్ణునామము లలో చేర్చియున్నది. అట్టి యోగరూఢములను నిఘంటువులో నిచ్చుట సమంజసము గాదా? ఈ మాటకు విష్ణుమూర్తి అన్న యర్థము నిఘంటువులో జూచిన తెలియగలదా?

"ఇట్టివానిని మేము చూపినట్లే ప్రధానశబ్దము లలో జూపిన చాలవఱకు గ్రంథవిస్తరము తగ్గుటయే గాక యట్టివాని ననేకములను గల్పించుకొను తెలివి కూడ గల్గును. లేనిచో గ్రహించినవే తక్క తదితర ములు తెలియవు" అని శాస్త్రులవా రిప్పుడు నిఘంటు పద్ధతిని సమర్థింపగడగినారు. సరియే! యీ పద్ధతినైన ననుసరించినారా నిఘంటునిర్మాతలు? మఱి 'అంబుజము' మొదలగుమాటలలో 'అంబు' అనునర్థము నిచ్చు శబ్దముపై 'పుట్టినది' అనునర్థమునిచ్చు శబ్దము చేరినపుడు 'పద్మము' అను రూఢ్యర్థము కలుగు ననియు, అట్లే 'అంబుదము' మొదలగుమాటలలో ఆయా యర్థముల శబ్దములమీద, ఆయా యర్థముల శబ్దములు చేరునపుడు ఆయా యర్థముల నిచ్చుననియు వ్రాయలేదేమి? దాని కదే; దీని కిదే. ఇదీ నిఘంటుసంప్రదాయము.

అబ్జముఖి:—

"ఇక్కడ 'అబ్జముఖ' అను రూపాంతరము గూడ నుండును. ఈవిషయము 'అభిముఖుడు' లో జూపబడినది. ముఖశబ్దములో గూడ జూపబడును" అని శాస్త్రిగా రన్నారు. 'అబ్జముఖి' కి 'అబ్జముఖ' అనురూపాంతరముగూడ గలదని యావ్యాసములో చెప్పుటకంటె నిఘంటువులో చెప్పుట మంచిది. ఈ విషయము 'అభిముఖుడు' అను శబ్దముదగ్గఱ జూప బడిన దని చదువరుల కెట్లు తెలియును? 'ఫలానా' శబ్దముల యర్థములకొఱకు 'ఫలానా' శబ్దములయొద్ద చూచుకొనవలయును; అని యైన సూచించియుండ రాదా? ఇది వరుసగా జదువు గ్రంథము కాదుగదా!

అలుగుటమ్ము:—

"ఇది విశేషార్థాభిధాయకము గాకపోవుటచేత (అలుగు ౨ లో) నుదాహరణముగా జూపబడినది." అని పరామర్శకు లనుచున్నారు.

ఇది విశేషార్థాభిధాయకము గాదని నిఘంటువును జూచినప్పుడు తెలియవలయునుగాని యీవ్యాసమును జూచినప్పుడా తెలియదగినది? నిఘంటువులోని అలుగు ౨ లోని యుదాహరణ మిది.

గీ. "అలుఁగుటమ్ములు దాఁకిన నలిగె భద్ర
కుంభి కాద్రంబు సొంపారఁ గొలిచె నతఁడు"
—భార. ద్రోణ. ౧-౩౮౯.

అలుఁగు ౨ నకు నిఘంటువులో 'బాణాగ్రము, ములికి; 'పిడిగాక మిగిలిన ఆయుధాంశము' అనునర్థము లీయబడియున్నవి. నిఘంటువులో కామాచే విభజింప బడిన పదములు సమానార్థకములు గాన బాణాగ్ర మనగా ములికి యగును. ఆపక్షమున అలుగుటమ్ములనగా ములికిగల బాణము లనవచ్చును. అము ౨ లనగానే ఆ-

యర్థము వచ్చుచుండగా విశేషార్థము లేని అలుగుటమ్ము లనుపదమును గంభీరార్థప్రియుడగు సోమయాజివంటి యార్థిక కవిసత్తముడు ప్రయోగించునా యని సంశ యము. మఱియొక విషయమిట నాలోచింప వలయును. అలుఁగు అనగా చిన్నగడ్డపాఱ అని వ్యవ హారమున గలదు. దీనివెున కొంచెము వెడల్పు గానుం డును. అదియే యయినచో అలుగువంటి బాణము అని యర్థము గలుగును. బాణములలో పెక్కురకము లుండు టయు, ఒక్కొక్కరకపు బాణమును ఒక్కొక్క సమయమున యోధులు ప్రయోగించుటయు మనకు తెలియనిది గాదు. ఇదియు నట్టిదే యగునా యనుట విచార్యము.

అల్లఁదనము:—

"కొన్నిచోట్ల దప్పతన ప్రత్యయాంత శబ్దములు ప్రత్యేకముగా గ్రహింపబడలేదు." అని పరామర్శక లనుచున్నారు.

తన ప్రత్యయాంతములను కొన్నిచోట్ల గైకొనుట యేల? కొన్నిచోట్ల గైకొనకపోవుట యేల? కారణము గానీ, నిర్ణీతపద్ధతిగానీ కానరాదు. వానిని గైకొన్న చోట వీలగైకొన్నారో లేనిచోట వీలలేదో కారణము తెలుపగలరా శాస్త్రిగారు? అయినను అడ్డుపెట్టు కొనుట కన్న దిగదా సంప్రదాయపు రదిక. ఒకనిర్ణీత మగు చక్కనిపద్ధతి యేర్పఱచుకొని సాహిత్యపరిషత్తే ఒక మంచిసంప్రదాయము నేల యేర్పఱుపరాదో?

అవసథము:—

"ఇది కలదనుటకు దృఢతరప్రమాణము లేక పోవుటచేత పరిత్యజింపబడినది." అని పరామర్శక లన్నారు. దీనికి వీరు చూపిన కారణములు ఇవి.

(అ) ఇది యధికపాఠ మని యమరవ్యాఖ్యా తలు వ్యాఖ్యానము చేయక వదలినారు. అయినను,

(ఆ) రామాయణ గోవిందరాజీయవ్యాఖ్యలో ఆవసథముగా గ్రహింపబడి యున్నది.

(ఇ) వైజయంతీ నిఘంటువులో గూడ ప్రామా ణికులచే వ్రాల్లె ఛేదింపబడియున్నది.

(ఈ) సిద్ధాంతకౌముదిలో అవసథశబ్దమే సాధిం పబడి యున్నది గాని అవసథశబ్ద మెచ్చటను సాధింప బడలేదు.

(ఉ) రంగాచార్య ప్రభృతి నిఘంటుకర్తలు అవసథశబ్దమును గ్రహింపక ఆవసథశబ్దమునే గ్రహిం చినారు.

వీనికి నా సమాధానములు.

(అ) శాస్త్రిగారు చూపిన మొదటి హేతువు వారి రెండవ మూడవ కారణములవలన పరాస్తమగు చున్నది. అధికపాఠము ప్రమాణముగాదేని (ఆ) లో చెప్పిన గోవిందరాజును, (ఇ) లో చెప్పిన వైజయంతీ కారులును ఎట్లు గ్రహించి ఆవసథముగా ఛేదించియుం దురు? కనుక అధికపాఠ మయినంతమాత్రమున ప్రమా ణము గాదనుట అంగీకార్యము గాదు. అమరములోని యధికపాఠములు ప్రమాణములు గావేని తక్కినయధి కపాఠములలోని పదములమాట యటు లుండగా ప్రస్తు తమందలి ధిష్ణ్యము, ఓకస్సు, నివసనము, స్థానము వాస్తు అనుపదములును దుర్లభములే యగును. (ధిష్ణ్య మోకో నివసనం స్థానావసథవాస్తుచ) కనుక సమగ్ర నిఘంటువులుగా నుండ బ్రయత్నించునవి అమరవ్యా ఖ్యాతల నటులుంచి యధికపాఠముల నంగీకరించుటయే లెస్స.

(ఈ) సిద్ధాంతకౌముది ఆవసథశబ్దమును సాధిం చుటకు ప్రత్యేకసూత్రమును చెప్పుట నిశ్చయమే కాని మఱియొకవిధముగా అవసథశబ్దము సిద్ధమగుచుండగా ప్రత్యేకసూత్ర మేల కావలయును? సూత్రములలో చెప్పబడిన శబ్దములుగాక యితరశబ్దములు సాధువులు గావా? అటులే యయినచో పాణినీయగౌరవము పాతాళము పోకతప్పదు. కనుక ప్రత్యేకసూత్రము చెప్ప నంతమాత్రమున అవసథశబ్దము సాధువు గా దనుట సముచితము గాదు. అవసథశబ్దము దుర్లభమని పాణి నీయమహిమకు కొఱత గల్గింపరా దని నామనవి.

(ఆ, ఇ, ఉ) కొందఱు ఆవసథశబ్దమును స్వీకరించినను అవసథశబ్దమునుగూడ పెక్కురు స్వీక రించినారు చూడుడు.

"అవసథః (పు) అవ+సో+కథన్ ౧ నిలయే ౨ గ్రామేచ. అవస్యతి శాస్త్రమత్ర అవ+సో కథన్ ౩ ఛాత్రనిలయే మఠే హేమ"

అని వాచస్పత్యము ప్రక్రియతోగూడ సాధించి ఆశబ్దమును గ్రహించియున్నది. ఆవసథశబ్దమునుగూడ నది గ్రహించియున్నది. మఱియు అవసథ శబ్దమునేగాక దానిపై నేర్పడిన ఆవసథ్యశబ్దమునుగూడ గ్రహించి

"ఆవసథ్యః (పు) ఆవసథ+స్వార్థే యఞ్ అవసథశబ్దార్థే" అని వ్రాసియున్నది.

ఆప్టే నిఘంటువు సయితము అవసథశబ్దమును వాచస్పత్యమువలెనే సాధించి గ్రహించియున్నది. చూడుడు.

"అవసథః [అవ+సో+కథన్] **A dwelling place, habitation 2. A village 3. A school, college** (ఛాత్రాలయః, మఠః).

ఈ నిఘంటువు ఆవసథశబ్దమునుగూడ గ్రహించి వాచస్పత్యమువలెనే ప్రక్రియ వ్రాసియున్నది.

మఱియు "విల్సను నిఘంటువు" నుండి సంగ్రహింపబడిన పండిత రామజసనగారి నిఘంటువు సయితము ఈశబ్దము నిచ్చియున్నది.

చూడుడు.

అవసథ **(m) 1 Village 2 College 3 School**

**(n) A house. E** అ. **neg.** వస **to dwell. and** అథన్ **affix; than which there is no other or better abode.**

ఆవసథ్యః:—**(m) A college, a school, E see the preceding** అని వ్రాసియున్నది.

—చూడుడు ౧౮౭౦ సం॥ ముద్రణము.

బ్రౌణ్యము

"అవసథము **n. s. A house habitation** ఇల్లు" అని వివరించినదిగాని ఆవసథశబ్దమును గ్రహింపలేదు. శబ్దరత్నాకరము సయితము 'అవసథము'నే యిచ్చినది కాని ఆవసథము నీయలేదు.

ఆంధ్రవాచస్పత్యముమాత్రము రెండురూపములను గ్రహించినది.

ప్రామాణికులచే ఆవసథముగానే భేదింపబడినదని (అవసథమసాధు వని) శాస్త్రిగారన్నారే వాచస్పత్యకారాదులు ప్రామాణికులుకారా? వాచస్పత్యాదులప్రమాణము లగుటు యీ శబ్దము నొద్దనేనా? ఎచ్చటను ప్రమాణములు గావా? శాస్త్రిగారు వ్యాసములోనే "వాచస్పత్యాది సంస్కృతనిఘంటువులుగూడ నీమార్గమునే యనుసరించినవి" అని యొకచోట వాచస్పత్యమును ప్రమాణముగా నుదాహరించియున్నారు. శాస్త్రిగారి మాటలలో నేది ప్రమాణము? వారికి వాచస్పత్యము ప్రమాణమా కాదా? అయినచో నది యేల? కానిచో నిది యేల? లేని కదియేనా? తీర్థమునకు తీర్థము, ప్రసాదమునకు ప్రసాదమునా? ఈ శబ్దవిషయమున శాస్త్రిగారు తక్కిన నిఘంటువులను జూచిరా? చూడలేదా? చూచియే వాచస్పత్యాదుల న ప్రమాణములుగా త్రోసివైచినారా? చూడలేదందురా? ఆమాత్రమేని పరిశీలింపరాదా? దీనినిబట్టి అవసథ, ఆవసథ శబ్దములు రెండును గ్రహించుట యుక్తమని తేలుచున్నది గదా! ఇట్టులే అగారము, ఆగారము అను శబ్దములు గలవు. అమరము 'నిశాంతవస్త్యసదనం భవనాగారమందిరమ్' అని చెప్పగా కొందఱు అగార మనియు, మఱి కొందఱు ఆగార మనియు, నేలోకకొందఱు రెండు రూపములను గ్రహించినారు. ఆవిషయము మనకు ఇప్పుడప్రస్తుతము గనుక వదలివైతము.

అవసథ మసాధు వనియే శాస్త్రిగారింకను పిడివాదము చేయుదురా? మాటవరుస కసాధు వనియే యొక క్షణకాల మంగీకరింతము. అయినను వాచస్పత్యాదు - లన్ని నిఘంటువు లిచ్చిన శబ్దమును సమగ్రాంధ్రనిఘంటువు ఇచ్చుట న్యాయ్యము గాదా? అంగమొల, అంగమొలవేల్పు, అంగమచ్చము, అంతేర దామర మొదలగు శబ్దములను సూ- ఆంధ్రనిఘంటు విచ్చినదే! ఇవి యన్నియు సాధువులేనా? సాధువులు కాకున్నను సుప్రసిద్ధ కవిప్రయుక్తములను, నిఘంటువిచ్చుట యుచితమే. అటులనే 'అవసథ'మునుగూడ నిచ్చుట యుచితము.

ఈశబ్దచర్చ యటు లుంచి యిచట శాస్త్రిగారు పలికిన యొకవాక్యమును జూడుడు.

"ఇట్లు సవిమర్శముగా బని చేయుచున్న సూర్యరాయాంధ్రనిఘంటువు నిందార్హమో, స్తుత్యర్హమో పాఠకలోకమే నిర్ణయించునుగాక."

'ఇట్లు సవిమర్శముగా...' అని తాము విడిచిపెట్టిన 'అవసథ' శబ్దమునొద్ద చెప్పుటవలన ఆశబ్దమును స్వీకరించిన వాచస్పత్యాది సుప్రసిద్ధనిఘంటుకర్తలెల్లరు సవిమర్శముగా నిఘంటురచనమునకు బూనిరని నిందయు, చేసిన ప్రమాదము నంగీకరింపక, పైగా ఆప్రమాదమును సమర్థించు పూనికయు, తమనిఘంటువు 'స్తుత్యర్హమో నిందార్హమో విమర్శలోకమే నిర్ణయించునుగాక' అనుటవలన తమ పద్ధతిని తామే స్తుతించుకొను ప్రయత్నమును వ్యంగ్యముగా బ్రకటించుచున్నారు. ఔరా! వాచస్పత్యాదు లెంత యవిమర్శముగా రచియింపబడ్డవో, సూ-ఆం-నిఘంటు వెంత సవిమర్శముగా రచియింపబడుచున్నదో విమర్శకలోకమే నిర్ణయించినది: నిర్ణయించుచున్నది. నిర్ణయింపగలదు. ఈ 'సవిమర్శ'మను మాట నిఘంటు రచనమున జరిగిన యాలస్యమును లోపములను కప్పిపెట్టుట కల్పినమాట యని లోక మెఱుగును.

సూ-ఆం. నిఘంటుపీఠికలోని "ఉపసర్గశత్రంతాదిశబ్దములుకూడ నిందు గ్రహింపబడినవి." అన్న వాక్యమును నేను విమర్శించుచు 'శబ్దములు' అన్నమాటకు 'కొన్ని' యను విశేషణ మున్నచో నది యథార్థమే యగును—'అనుచు నేను వ్రాసియున్నాను. కొన్ని అన్న విశేషణమును నేను చేర్చుటకు గారణ మేమనగా ఉపసర్గ లన్నియు నిరువదిరెండు. అందులో ఈమొదటి సంపుటములో జేరదగినవి—అకారాదులు పదిమాత్రమే. ఆపదింటిలోను ఈమొదటిసంపుటమున 'అపి' అను ఉపసర్గము బొత్తిగ విడిచివైచినారు. వాచస్పత్యమునందు అపి అను నుపసర్గకు సోదాహరణముగా కొన్ని పుటలు వ్రాయబడియున్నవి. కాని మన నిఘంటువు దానిని గ్రహింపనేలేదు. మఱియేదేనిపదము నొద్ద జూపవలయునేమో శాస్త్రిగారు తెలిపెదరా?

మఱియు 'అప' అను నుపసర్గకు నాలుగర్థములను మాత్రము వ్రాసి 'ఇంకను సంస్కృతమున విశేష ప్రయోగములు గలవు.' అని కుండలీకరించినారు. లక్కినయర్థములు తెలుగుచదువుకొనువారి కక్కఱ లేదనియా? ఆ యుపసర్గము సంస్కృత భాషయందలిదే గదా! అది సామాన్యముగా సంస్కృతపదములతోడనే చేరియుండును గదా! అట్లు సంస్కృతపదముతో జేరి తెనుగుకావ్యములలో బ్రయోగింపబడుట కేమియు నభ్యంతర ముండదుగదా! అట్టిచో తెలుగువారి కావిషయము లక్కఱలేదన్నట్లుగా 'ఇంకను సంస్కృతమున విశేషప్రయోగములుగలవు' అని వదలివేయ నేల? అంతియగాక "యీ విషయములో నీ నిఘంటువు సంస్కృతవిద్యార్థులకు గూడ మిక్కిలి యుపకరించు నని నిస్సంశయముగా జెప్పవచ్చును." అని పీఠికలో వ్రాసినారే! మఱి సంస్కృతములోని విశేషప్రయోగముల నేల యీయలేదో? విద్యార్థుల కంతటివిశేషములతో నావశ్యకము లేదనియా యేమి?

ఇక శత్రంతాదులవిషయము నటులనే యున్నది. నేను సంపూర్ణముగా లెక్కింపలేదుగాని కొన్ని వందల పుటలవరకు జూడగా మిక్కిలి కొలదిగనే కాన్పించినవి. అన్ని ధాతువులకు శత్రంతాదుల నీయలేదు. కనుక 'ఉపసర్గ' లనుటకు 'ఉపసర్గపూర్వకము లని నేను విపరీతాన్వయము చేసినను నేను చేర్పవలయునన్న 'కొన్ని' అన్న విశేషణము చేర్పకతప్పదు.

ఉపసర్గ లన్నియు కొలదియే యగుటవలనను, అందును ఈ సంపుటమున జేరదగిన వన్నియు జేరక యుండుటవలనను నిఘంటువు అసమగ్ర మగుచుండగా నీస్వల్పపదములవిషయమున గలుగు నసమగ్రత్వముకంటె ఉపసర్గపూర్వకములు భాషలో పెక్కు లున్నవిగాన నవి యన్నియు తీసికొనకపోవుటవలన గలిగినయసమగ్రత నిఘంటువునకు గౌరవదాయక మని తలచి 'ఉపసర్గ శత్రంతాదులు—' అన్నవాక్యములో ఉపసర్గ అనుమాటకు 'ఉపసర్గ పూర్వకములు' అని విపరీతముగ వ్యాఖ్యచేసియుంటిని. నా యాదోషము నంగీకరింతును. దీనిని సహించినందులకు శాస్త్రిగారు మాన్యులే యగుదురు.

"...ఉపసర్గ శత్రంతాది శబ్దములు" అన్న పీఠికావాక్యమును విమర్శించుచు నేను నావ్యాసమున నొక 'పేరా' ప్రారంభించి కొలదివిషయమును వ్రాసియున్నాను. ఉపసర్గ శత్రంతాది శబ్దములకు

దాహరణముగా దాని క్రింద "అకలంకము...అఖణ్ణయనము ... అవినాభవన్ . ." మొదలగు పదములపట్టిక నొకదాని నిచ్చియుంటిని.

నే వ్రాసిన దిది-

" . . ఉపసర్గశత్రంతాది శబ్దములుగూడ నిందు గ్రహింపబడినవి" (పీఠిక, 3 పొరట) అని వ్రాసియున్నారు. 'శబ్దములు' అనుమాటకు 'కొన్ని' అను విశేషణ మున్నచో నది యథార్థమే యగునుగాని ఆ విశేషణము లేక అన్నియు అనుభావము కలుగ వలయునను తలంపుతో వ్రాసినయెడల నది ఘోరాసత్యమే యగును. పంతులవారిమాటలో ఉపసర్గ అను మాటకు ఉపసర్గపూర్వకము లనియేగదా వారిభావము. చూడుడు ఆంధ్రమహాభారతమునందివియే కొన్ని పదములు."

అని దాని యడుగున అకలంకము మొదలగు పదముల నిచ్చియుంటిని. ఉపసర్గశత్రంతాది శబ్దములు అన్న మాటలో పైన నేను తెలిపిన నాయుద్దేశము ననుసరించి 'ఉపసర్గ' అనుమాటను వివరింపవలసి యుండుటచే ఆ పదమునకు మాత్రము 'ఉపసర్గపూర్వకము లనియేగదా వారిభావము' అని వివరించితిని. ఇక శత్రంతాది శబ్దములు అన్నమాటను వివరింపవలసిన యవసరమేలేదు గాన వానివిషయ మేమియు తెలపెట్టక మొత్తము మీద నా పేరాకంతటికి నుదాహరణ మిచ్చియుంటిని. 'పంతులవారిమాటలో...వారిభావము' అన్న వాక్యమును కుండలీకరించిన సంశయము లేకుండెడిది. అది వ్రాతలోని లోపమే. అయినను ఆపేరాను ప్రారంభించుటలో గల యుద్దేశమునగాని, ఆపేరాకును అక్రింది పట్టికకును గలసంబంధమునుగాని శాస్త్రిగారు పరికింపలేదు. "పీఠికనైనను సరిగా నర్థముచేసికొనక" అని నన్నాడి శాస్త్రిగారయినను నాయుద్దేశమును సరిగా నర్థము చేసికొనగూడదా? ముద్రితప్రతులలో నన్నట్టు కొన్ని పదముల నిచ్చితినని "ఇంతమాత్రమేని సవరించుకొనలేని వీరొక గొప్పనిఘంటువును విమర్శింపబూనుట మిక్కిలి సాహసము." అని నన్ననుచున్న శాస్త్రిగారయినను ఆపేరాను ఆపట్టికను సమన్వయ మొనర్చుకొనగూడదా? ఒక్క వాక్యమును కుండలీకరించుకొనగూడదా? ఇంతమాత్రమేని సవరించుకొనలేని వీరొక సమగ్రనిఘంటువును రచియించు పండితబృందములో నుండుట మిక్కిలి సాహసముగాదా? అప్పుడు రచయిత్రు విమర్శకులు ఒకరికి తగిన వారొకరగుదురుగదా! మతిశాస్త్రిగారట్టివారు రచియించుచుండగా ఇక నాయట్టివారు విమర్శింపరాదా?

"ఏ మాత్రపు సంస్కృత వ్యాకరణజ్ఞానము గలవాడైనను 'అ, అగస్' అనునవి యుపసర్గము లని చెప్పడు" అని శాస్త్రిగారనుచున్నారు. వానిని నే నుపసర్గము లనలేదు. ఉపసర్గశత్రంతాదుల కుదాహరణముగా నిచ్చితిని. ఒకవేళ నేనుపసర్గలకే యిచ్చియుందునను కొనుడు. అయినను ఇప్పుడు శాస్త్రిగారు సాధింపవలసినది నాసంస్కృతవ్యాకరణజ్ఞానపరిమితిని గాదు. సూ-ఆం-నిఘంటువు సమగ్రమే యని. నేను వ్యాకరణజ్ఞానశూన్యుడ నయినంతమాత్రమున నిఘంటువు సమగ్ర మగునా? నాకు సంస్కృతవ్యాకరణజ్ఞానము లేదని సాధించుటకు కంటాలు పడనక్కరలేదు. కావలెనన్నచో నే నొప్పికొందును.



# కన్నీటి బొట్లు

శ్రీ వక్కలంక శ్రీనివాసరావు

విడువడా ఏ తెనుగుబిడ్డడు
విడువడా కన్నీటి బొట్లను
విడువకుండునె గిడుగువంశపు
వీరు మరణమునకున్ —

"గిడుగు పిడుగై", తెనుగుమాటల
కైతలను నడిపించు కలమున
కంతరాయము లేక కావ్యము
లలరచేసిన ఆంధ్రు డరుగను
తెనుగు తల్లీ, నీదుశోకము
తెల్ప మాతరమా —

ముదిమివగ్గై "ముందు మాటల"
ముచ్చటను పలుమార్లు పలుకుచు
తెనుగునుడువుల తెల్లపరచిన
ధీరు డరిగెనుగా, భావకు,
పోరు సమయుడుగా —

మేటిబిరుదుల మేటిమగనిని
సాటివా రిల లేని సాధుని
సవరభాష నిఘంటు సాధ్యుని
గిడుగు వేంకట రామమూర్తిని,
తలపవా-ఓ తెనుగుబిడ్డా,
తలపవా, ఋణమున్ —

"కాంతిమూర్తి, "కళాప్రపూర్ణ"ని
దాంతిగ్రామ్య సుమార్గచోదుని,
తెనుగువైయాకరణధీరుని
తెలిసికొని కన్నీటి బొట్లను
తెనుగుతల్లీ, విడువబోకా,
తేరుకొనవమ్మా, శాంతి, నిం
పార, ఇమ్మమ్మా —

# క్వినైన్ మరువవద్దు

అమెరికాలో అంతఃకలహము ఏర్పడినప్పుడు మెక్సికోలోగూడ విషాదము తటస్థించినది. దీనిని ఆధారము చేసుకొని హాలీవుడ్ కంపెనీవారు చిత్రరాజమును తయారుచేసిరి. ఇందు ప్రధాన పాత్రలను ధరించినవారు మువ్వురు. వీరిలో ఇద్దరు దుర్గతిపాలైరి. మూడవవాడు జూరెజ్ మెక్సికోను ఉద్ధరించెను.

యూరోపియనులకుట్ర, మెక్సికో రాజకీయ పరిస్థితుల ఫలితముగా మెక్సికోరాజు, రాణి అసమర్థులని వదంతులు బయలుదేరినవి. ప్రజలు తిరుగబడిరి. ప్రజానష్టము కలిగినది.

రాణి పాత్రధారి బెటెడేవిస్ రాజు పాత్రధారి హాబ్సుబర్గుకు ధైర్యము చెప్పుచుండెడిది. అతని ఆరోగ్యము విషయమైగూడ ఈమెయే ఎక్కువశ్రద్ధ వహించుచుండెడిది. ఇప్పుడున్న మాదిరిగానే ఆ దినములలోగూడ మలేరియా బాధ ఎక్కువగా యుండెడిది. రాణి రాజుకు మలేరియాచికిత్సకు క్వినైన్ యొసంగుచుండెడిది.

రాజ్యమున అరాజకము ఏర్పడినది. ఫ్రెంచి సైన్యమును మరికొంత తెప్పించుకొనవలెనని రాజు తలంచుచుండెను. అట్టి పరిస్థితులలో మెక్సికోలో ఉన్న ఫ్రెంచిసైన్యము నంతను ఫ్రాన్సుకు రప్పింపవలెనని మూడవ నెపోలియన్ ఉత్తరువు చేసెను. నెపోలియన్ వద్దకు స్వయముగా వెళ్లి సహాయము కోరవలెనని రాణి ఉద్దేశించెను.

ప్రయాణమై వెళ్లుటకుముందు రాణి తన అనురాగమును ప్రకటించుచు "మీరు క్వినైన్ సేవించుట మరువవద్దు" అని కడపటిమాటగా చెప్పెను. మలేరియా కమీషనరువారి దేమాదిరి శిఫార్సు చేసియుండిరి. మలేరియా చెలరేగిన దినములలో వ్యాధి రాకుండుటకుగాను ప్రతిదినము 6 గ్రెయినులవంతున సేవింపవలెను. రోగికి మొదటి 5-7 దినములు 15-20 గ్రెయినులవంతున యొసంగవలెను.

1938 సం॥ నివేదికలోని 125 పుటలో మలేరియా కమీషనరువారు ఈవిషయమునే బలపరచిరి. మలేరియాకు వాడు మందులలో క్వినైన్ చాల శ్రేష్ఠమైనదనియు, దీనిని సేవించువిధానము అందరికి తెలియుననియు వీరు ప్రకటించిరి.

M. No. 298.

లనియు వ్యవహరించిన ఆచరణ కమనీయముగా నుండెడిది. కాని ఇట్టిప్రమాదము లోకలోపము గావు. మొత్తము మీద రచయిత తనకర్తవ్యమును శ్లాఘనీయముగనే నిర్వర్తించుకొనినాడు:

సి. వి. దీక్షితులు

---

## వైద్యవిప్లవం

కర్త: డా. అడుసుమిల్లి వెంకటకృష్ణారావుగారు. ఆరోగ్యవర్ధనీసమాజం, చంద్రాల, అంగలూరు పోస్టు, కృష్ణాజిల్లా. వెల ఎనిమిదణాలు.

కొన్ని శాసనములు సదుద్దేశముతో చేయబడినను దుష్ఫలితము నిచ్చుచున్నవి. ఒకేశాసనము కొందరికి సుగుణమును, మరికొందరికి దుర్గుణమును గలిగించుచున్నది. టీకాల నిర్బంధశాసన మిటువంటిదే. కొందరి విషయములో నిది మశూచి రాకుండ ఆపుచున్నది. మరికొందరి విషయములో మశూచి నాపలేకపోవుటయేగాక ఇతర దుష్ఫలితములనుగూడ గలుగజేయుచున్నది.

గ్రంథకర్త ఆంధ్రరాష్ట్ర టీకాల వ్యతిరేకసంఘమునకు కార్యదర్శి. టీకాలవలన నేమాత్రము ఫలము లేదనియు, పైగా దీనివలన ఇతరవ్యాధులు గలుగుచున్నవనియు వీరి దృఢాభిప్రాయము. పాశ్చాత్యదేశములలోకూడ మొదట టీకాలను నిర్బంధముగా వేయించియు, మరల దాని దుష్ఫలితములను గొప్ప వైద్యశాస్త్రజ్ఞుల పరీక్షచే కనుగొని, ఇప్పుడు టీకాల నైచ్ఛిక మొనర్చియున్నారు. ఈ పరీక్షవలన టీకాలు ముఖ్యముగా ఎన్సెఫలో మైలిటిస్ (**Encephalo-myletes**) అను అపాయకరమైన వ్యాధిని కలుగజేయుచున్నవని గుర్తించినారు. ఇదిగాక కొంతమంది పిల్లలు టీకాలమూలముగానే మరణించుచున్నారు. కొందరికి గుడ్డితనము, క్షయవ్యాధి వచ్చుచున్నవి. కాబట్టి మన రాష్ట్రములోకూడ పాశ్చాత్యదేశములలోవలె టీకాల నిష్టమున్నవారికే వేయవలెననియు, నిర్బంధశాసనమును

తొలగింపవలెననియు గ్రంథకర్తగారు తీవ్రాందోళ
నముచేసి, మద్రాసుశాసనసభ్యులైన శ్రీ ఓరుగంటి
వెంకటసుబ్బయ్యగారి ఆధిపత్యమున బెజవాడలో
టీకాల వ్యతిరేకసభ గావించిరి మద్రాసుశాసనసభలో
ఆరోగ్యశాఖామంత్రి శ్రీ రాజన్ గారు ఆరోగ్యచట్టము
నుపపాదించినప్పుడు శ్రీ వెంకటసుబ్బయ్యగారు టీకాల
నిర్బంధమును తొలగించవలెనని సవరణ పెట్టిరి. దాని
వలన, టీకాలను వేయించుకొనుట మానసికముగా
నిష్టములేనివారు మేజస్ట్రీటువద్దనుండి అనుమతిని
బొంది, వారు చెప్పినట్లు నివాస మేర్పరచుకొనినయెడల
వారికి నిర్బంధము లేదను సవరణ అంగీకరింపబడెను.

ఈ సవరణవలన బీదసాదలకు ఎక్కువ లాభము
లేదు కాబట్టి టీకాలను ఐచ్ఛికముగా నొనర్చువరకు
పోరాడవలెనని గ్రంథకర్త సంకల్పము. ఈ విషయ
ములో వీరు మహాత్ముని ఆశీర్వాదమునుకూడ పొంది
యున్నారు. ప్రభుత్వమువారు టీకాలు వేయించుటకు
ఖర్చుపెట్టు ద్రవ్యమును నగరపారిశుద్ధ్యము నభివృద్ధి
చేయుట కుపయోగించినయెడల మశూచిజాడ్యము
శీఘ్రముగా నాగిపోవునని గ్రంథకర్తవాదము. వీరి
ఉద్యమము త్వరలో జయప్రదమగుగాక.

వెం. శ్రీ.

---

## పాంచజన్యము

అనువాదకులు—శ్రీ చక్రపాణిగారు— యువ
కార్యాలయము, తెనాలి. వెల రు ౦-౬-౦.

ఇందు ఎనిమిదికథలు గలవు. వీనిలో ధనవంతుల
దౌష్ట్యము, నిరుపేదల కష్టములు, సామ్యవాదపు
ధోరణి, ప్రాచ్యపాశ్చాత్య దేశములకుగల తారత
మ్యము, భారతదేశ స్వాతంత్ర్యమున కవలంబింపవల
సిన మార్గములు, దేశసేవకులుగా తమ సర్వస్వము ధార
వోసి తుదకు కష్టములపాలైనవారిని కడగంటనేనియు
గమనింపని దేశనాయకుల ధౌర్త్యములు, న్యాయ
స్థానములలో జరుగు అన్యాయచర్యలు మొదలగు విష
యములు నిష్పాక్షికదృష్టితో విమర్శింపబడినవి.

ప్రస్తుతము అత్యవసరములగు రాజకీయ విషయ
ముల నెఱుకపఱచు గ్రంథములు మన తెనుగుభాషలో
అంతగా గాన్పింపవు. ఏకొలదిగానో ఉన్నను అయ్యవి
పాఠకుల నాకర్షింపజాలని ప్రాతధోరణిలోనే వెలు
వడుచున్నవి. కాని, మనరచయితలుమాత్రము అట్టి
మార్గము నవలంబింపక స్త్రీ పురుష బంధములను సులభ
ముగా విషయ మవగతమగునట్లు వ్యంగ్యధోరణిలో
ఈకథల వ్రాసిరి. ఇవియన్నియు బెంగాలీ భాషనుండి
అనువదింప బడినవియే. ఐనను రచనాస్వాతంత్ర్య మే
మాత్రము కొఱవడలేదు. కథ లతిదీర్ఘములై చదువరుల
విసిగించుట, అతిసంక్షిప్తములై విషయసంకోచము
పాలగుటగాని జరుగలేదు.

ఇందలి "యమునికి దరఖాస్తు పెట్టుకొని మం
జూరు ఉత్తరువుకోసం ఎదురుచూస్తూ పెన్షను అను
భవిస్తున్న వృద్ధులు" "పెసరబద్ద పరిమాణంతో ఆరం
భించి గుమ్మడుకాయంత పేరుకుపోయేట్టు చూడాలి"
మొదలగు చమత్కారవాక్యములు, "పిల్లి ఉపన్యసిం
చుట" మొదలగు కథాధోరణి, మొట్టమొదటనుండి తుట్ట
తుదవఱకు సాగించిన రచనావిధానము పానుగంటివారి
సాక్షిని అన్నివిధముల అనుకరించియున్నది. గ్రంథము
నకు పేరుపెట్టుట పాఠకులకు విషయమును స్ఫురింపజ
జేయుటకే. రచయితలు ఈ ఆచారము నుల్లంఘించి
పాంచజన్య మనునామ మేర్పఱచిరి. కాని వీరు
క్రింద నుదాహరించిన "రాజకీయ కథా సంపుటి"
అను పేరచే యీపొత్తము వ్యవహరింపబడియున్నది
ఇందలి విషయమునకుతోడు భాషా సౌష్ఠవముగూడ
నున్నచో సువర్ణమునకు తావి అబ్బినట్లుండెడిది.

పో. సు. శా.

---

## నీతిరత్నములు

దర్శనాచార్య శ్రీ రాజామంత్రి పెగడ భుజంగ
రాయ ప్రణీతము, మంజువాణీముద్రాలయము,
ఏలూరు.

కవికి కావలసిన శక్తులలో ప్రధానమైనది నిశిత
పరిశీలనము. ఈశక్తిని పురస్కరించుకొని అతడు
తత్త్వాన్వేషణము గావించును; ఉదాత్తసత్యములను
కనుగొనును. ఒక్కొక్కసత్యము దివ్యదీపికవలె తేజ
రిల్లి, మానవజీవితము నాలోకితమొనరింపగలదు. యుగ

ములు కడచినను, ఈసత్యములు తేజరిల్లుచునే యుండును. ప్రపంచసాహితీ వియత్తలమున నుడుగణముల లీల నివి వెలుగొందుట జూచుచుందుము. ప్రతీచీరచయితలు సృష్టించు ఎపిగ్రామ్స్ (Epigrams)అనబడు సంక్షేప వాక్యములందు సత్యోక్తులు తళుక్కొత్తుచుండును. ఆంధ్రజగతియందు వేమనాదులు తమరచనములను సత్యసందీప్తము లొనరించిరి. ఒక్కొక్క సత్యము చెంగట నొక్కొక్క దృష్టాంతము నిలిచి, అవలీలావగాహము నకు తోడుపడును. దర్శనాచార్యులై, సత్యాన్వేషణతత్పరులైన ప్రస్తుత గ్రంథకర్తగారు బహుళసత్యముల నిందు వ్యక్తీకరించిరి; తమపద్యములను భావభరితము లొనరించిరి. చూడుడు :

"ఆశకు మేర లేక జగ
మంతయుదా గబళింపగోరినన్
నాశన మౌను మానవుఘ
నత్వము, తృప్తినిగాంచువారలా
వేశము లేక సౌఖ్యముగ
బృథ్వి దరింతురు జన్మసార్థకం
బై శరదిందుసన్నిభము
హా ప్రతిభం గను జీవితాంతమున్."

"బలితపు ద్రవ్యరాసులను
బండెడువా డొకవేళ చెంటకు
ప్పల శయనింపగావలయు
బాయసముం దినువాడు త్రాగగా
వలయును గంజి, గర్వపడ
వచ్చునె ? చంచలలక్ష్మినమ్మి వె
న్నెల సుఖియించువాడు తర
ణిద్యుతి దుఃఖము జెందకుండునే ?"

"వ్రతములు దీర్ఘయాత్రలు జ
పంబులు జేసెడు తల్లి పుత్రదు
ష్కృతముల జెంపొనర్ప దొల
గింపకజాలునె సర్వబంధుసం
తతుల యకృత్యముల్ ? బహువి
ధంబుల బోధలుచేసిరైనఁ గొం
గతపములన్ ఫలించునె ? మ
నంబు వినిర్మలభక్తినిల్పమిన్."

"పాతివ్రత్యము స్త్రీల కట్లౌ పురుష
ప్రాముఖ్యధర్మంబు వి
ఖ్యాతం బాత్మసతీవ్రతం బదియ
భావ్యం బౌనుగాదే ధరా
పాతంబందును, ద్రాసుకొమ్మ లవి, జీ
వ ప్రీతికై సృష్టిసం
జాతప్రక్రియ సంధివిగ్రహము లి
చ్ఛంగూడి వీడన్వలెన్."

నిర్మలచరిత్రగ్రథనమునకు నీగ్రంథము మార్గదర్శకము కాగలదు.

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి.

---

## సుగ్రీవ విజయము

గ్రంథకర్త : శ్రీ కందుకూరి రుద్రకవి. ప్రకాశకులు : కపిలేశ్వరపురం జమీందారులు శ్రీ బలుసు బుచ్చి సర్వారాయుడుగారు. వెల రు ౦-౮-౦.

ఇది యక్షగానం. ఇందలి ఇతి వృత్తం రామాయణంలోని సుగ్రీవునికథ. హిందువుల కందరికీ ఈకథ తెలిసేవుంటుంది. రాముడు వనవాసిగా వున్నకాలంలో సీతాపహరణమైన పిమ్మట తదన్వేషణార్థంబయలు దేరిన రామలక్ష్మణులకు శబరి కలిసి సుగ్రీవుని సమాచారం తెలియచేస్తుంది. అంత వారిద్దరూ సుగ్రీవునితో స్నేహం చేసుకొని వాలిని జంపి యతని తమ్మునికి పట్టం కడుతారు. ఈకథ జంపె, త్రిపుట, అటతాళాది దరువు పదాల్లోనూ, ద్విపదలోనూ, మధ్యమధ్య కథాసందర్భం కలపడానికి వచనాత్మకంగాను వర్ణించాడు రుద్రకవి. ఇందలి కవిత్వము పండితులకే గాని అవగాహనం గాని ప్రబంధశైలిలో గాక పాటకపుజనానికైనతేం తెలిసే సరళశైలిలో వుంది. ఇది మధురకవితల్లో చేరిం దని శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిలుగారు ఈ గ్రంథానికి ప్రభావాన్వితమైన పీఠికను వ్రాశారు. వారి పీఠికను జదువుకొంటే మన పూర్వులలోనుండిన లలితకళావ్యాప్తి ఎంత మనోహరమైందో విశదమవుతుంది. రాజకీయంగా అయితే చేసి...

నైతే నేమి, ఆత్మీయములను పోగొట్టుకొని పరకీయము లకు బానిసలమైనలాగే ఆ మధురరచనలను సైతం పోగొట్టుకొన్నాం గదా అనిపిస్తుంది. సినీమాలకూ, దిగంబరనృత్యాలకూ అలవాటుపడి అధోలోకానికి జారిపోతున్న ప్రస్తుతకాలపు సంఘాన్ని మళ్లీ పైకి లాగడానికి ఇట్టి రచనాత్మక గ్రంథాలు కొంతవరకు తోడ్పడవచ్చు. ఇట్టివానిని ఇంకనూ ప్రకటించ తల పెట్టియున్న కపిలేశ్వరపురంవారి ప్రయత్న మెంతయూ స్తవనీయ మైనది!

---

## జీవజ్వాల

రచయిత: శ్రీ పార్ల వెంకటేశ్వరరావు గారు. ప్రకాశకులు: నవయుగ ప్రచురణాల యం, పెడసనగల్లు పోస్టు, కృష్ణా జిల్లా. వెల రు ౦-౧-౦ మాత్రమే.

శృంగారరసంలో మునగానాం తేలానాం అవుతూవున్న ఆంధ్రజనులకు వీరరసాన్ని చవి చూపించి ఊటలూరించే నాటిక ఇది. ఇటీవలనే పోలెండు దేశంలో జరిగిన భయంకర, అమానుషిక, అత్యాచార పూర్ణమైన మృత్యుతాండవాన్ని కట్టెదుట కన్పడేలాగు ఒకతాత, అతనికూతురు, అమెకొడుకూ ముగ్గురు పాత్రలను గల్పించి నాటిక వ్రాశారు రావుగారు. వీరకరుణారసాల కిది ఆటపట్టు. చిన్నదైనప్పటికీ నిప్పురవలాగు పనిచేస్తుంది మనస్సుమీద. తాత్కాలికాలైన అనగా ఆయాఘట నలు జరుగుతున్న కాలంలోనే వాటినిగురించి చక్కని రచనలు గావించి మందకొడిగా పడివున్న యువక హృదయాల కుద్రేకం పుట్టించడంలో వీరు మంచి పేర్పరుల్లాగుంది. కాబట్టే ఆస్ట్రియా, జెకోస్లావేకియా, పాలస్తీనాల పరిస్థితులు పరిణామాలను పొందుతూ వుండిన కాలంలోనే వాటినిగురించి వ్రాశారు. ఆంధ్రు లందరూ దీనిని జదివి ఆనందించాలని మాకోరిక. అణావ్యర పోస్టుబిళ్లలు గ్రంథకర్తకు ఆంధ్రప్రభ అడ్రెసుకు పంపితే గ్రంథం లభిస్తుంది.

---

## విరహి

కర్త: శ్రీ మెుక్కపాటి కృష్ణమూర్తిగారు. నవ్య సాహిత్యపరిషత్తు, గుంటూరు, వెల పావలా.

ఇది ఖండకావ్యముల సంపుటము. దీనిలోని భావగీతములన్నియు ప్రేయసీవిరహమునుగురించి వ్రాయ బడినవని పుస్తకముపేరే తెలుపుచున్నది. ఎడబాటు వేడిమిని బాగుగా గుర్తించి విరహగీతములతో విశ్వ మంతయు శోకనిలయమున ముంచుట కవి ఉద్దేశ్యము. గ్రంథాంతమున కొన్ని గేయములు విరహమునకు సంబంధించనివికూడ ఉన్నవి. భావములు చాల సహ జముగా నున్నవి. శైలి సులభవేద్యము. పుస్తకము చిన్న సైజులో చూచుటకు ముచ్చటగా నున్నది.

వెం. శ్రీ.

---

## చీనారోదనం

అనువాదకుడు: శ్రీ కృత్తివాసతీర్థులు, నవ్య సాహిత్య పరిషత్తు, గుంటూరు.

ఇది ట్రెటికోవ్ గ్రంథమునకు అనువాదం. ఈనాటకం బెర్లిన్‌లోను, న్యూయార్కులోను, మాం ఛెస్టరులోను, జపాను దేశములోను ప్రదర్శింపబడినది. గ్రంథకర్త రష్యాదేశస్థుడు. నాటకంలోని ఇతివృత్తం చైనాదేశంలో జరిగిన యథార్థసంఘటన మేనట. పాశ్చాత్యదేశస్థులు వ్యాపారముకొరకు చైనాదేశమును ప్రవేశించి స్వదేశీయులను హింసించు చుండగను లిందు చూపబడినవి. ఈ నాటకములో అమెరికన్ ఏజెంటు పడవలోనుండి పడి చచ్చిపోవును. ఆ పడవను నడపిన చీనా కళాసు పారిపోవును. ఆ తప్పునకు నింది తుని బదులు ఇద్దరు అమాయకులైన కూలీలను ఉరి దీయుటతో నాటకము ముగియును. నాటకములో పాత్రపోషణ మెుదలగు నాటకలక్షణములు లేకున్నను ముఖ్యముగా పాశ్చాత్యుల దౌర్జన్యము, ఆత్మలాభ పరాయణత్వము చూపింపబడినవి.

వెం. శ్రీ.

# గ్రంథ స్వీకారము

---

### శ్రీ త్రిపురవిధ్వంసము

గ్రంథకర్త: శ్రీ శిష్టా గోపాలంగారు - అమలాపురం. ప్రకాశకులు: రాతుబుక్కు డిపో, రాజమండ్రి. వెల రు ౦-౬-౦.

### పాణిగ్రహణము

రచయిత: శ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారు-శ్రీపాదభవనము, ట్రిప్లికను, చెన్నపురి. ప్రకాశకులు: వావిళ్ల ప్రెస్, మద్రాసు.

---

# పత్రికా స్వీకారము

---

**కాగడా** — క్రొత్తగా వెలువడిన సచిత్రవారపత్రిక. శ్రీ తాపీ ధర్మారావుగారు సంపాదకులు. ౧౯౪౦-వ సంవత్సరం, జనవరి ౧౦-వ తేదీ గల మొదటి సంపుటపు మొదటి సంచిక మా కార్యస్థానం చేరింది. దేశవిదేశాల వార్తలతో, చట్టబేలవంటి వ్యాసాలతో, చక్కని కథలతో, మరి యనేకసంగతులతో పత్రికయూనత్తూ ప్రకాశిస్తూ వుంది. అసలు దానిపేరే కాగడా! సుప్రసిద్ధ జర్నలిస్టులు శ్రీ తాపీ ధర్మారావుగారు దాన్ని చేత్తో పైకెత్తబూనుకొన్నారు. ఇక ఆంధ్రదేశం మూలమూలల యందుండే చీకటంతా పటాపంచలై సత్యం సాక్షాత్కరించడంలో సందేహ మేముంది?

౪౩. ఆచారప్పన్ వీధి, జి. టి. మద్రాసు అడ్రెసుతో సంపాదకుల పేర సంవత్సరానికొకమాటు రు ౪-౦-౦ లు పంపితే చాలు ప్రతిబుధవారం మీచేతుల్లో వచ్చి పడుతూ ఉంటుంది కాగడా.

**బోర్డుహైస్కూలు మేగజీన్** — పెదనందిపాడు బోర్డుహైస్కూలు తరఫున నూతనంగా బయలు దేరిన పత్రిక. మొదటి సంపుటపు మొదటి సంచిక మాకు అందినది. ప్రొఫెసర్ రామాగారు దీని సంస్థాపకులూ, సంపాదకులు గూడాను. పీరిటీవలనే నిడుబ్రోలు హైస్కూలు నుండి వకపత్రికను ప్రకటించారు. ఇది వేరొకటీ. ఆంధ్ర, ఆంగ్ల భాషలు రెండింట్లోనూ ఉపాధ్యాయులూ విద్యార్థులూ కలిసి వ్రాసిన వ్యాసాలు పఠనార్హమైన విందు గలవు. ఇట్టిపత్రికల మూలంగా స్కూలు ఉపాధ్యాయవర్గంలోనూ, విద్యార్థులలోనూ ఒక విధమైన నూతనోత్సాహం, సామరస్యం ఏర్పడి కళాశాల అభివృద్ధి నందవచ్చును. ఆంధ్రులందరూ ఆదరింప తగినది. వెల సంచిక ౧ కి రు ౦-౬-౦ లు.



---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St., Madras. Editor: — S. Sambhu Prasad.